## శుభాకాంక్షలు

మా పాఠకులు, రచయిత(త్రు)లు, ఏజంట్లు, ప్రకటనకర్తలందరికీ రిపబ్లిక్ దినోత్సవ శుభాకాంక్షలు -సం.

## ముఖచిత్రం

2-8 జనవరి' 87 నటి సుమలత ముఖ చిత్రము గల ఆంధ్ర సచిత్ర వార పత్రిక ఎంతో ఆకర్షణీయంగా యున్నది

గుడ్ల సాయికుమార్, పొందూరు

★ ★ ★

సుమలత ముఖ చిత్రము చూడ ముచ్చటగా ఉంది

అరసవిల్లి యోగీశ్వరరావు, ఇతరులు, కాశీబుగ్గ

## సీరియల్స్

"రస రాగ వాహిని', ఒడిలో చెలి మోహన రాగం' సీరియల్స్ రసవత్తరంగా సాగుతున్నవి ఇంత మంచి సీరియల్స్ అందిస్తున్న రచయిత్రులకు మా అభినందనములు

గోపిశెట్టి నిర్మల, కృష్ణవేణి, అనూరాధ, పోరా

★ ★ ★

'ఒడిలో చెలి మోహనరాగం' సీరియల్ కొత్తలోనే మమ్మల్ని ఎంతగానో ఆకట్టుకుంది 'పడమటి సంధ్యారాగం" తరువాత మళ్ళీ మంచి సీరియల్ అందిస్తున్న మా అభిమాన రచయిత్రికి మా అభినందనలు

సుంకర సర్వేశ్వరరావు, మాణిక్యాంబ, రాజమండ్రి

★ ★ ★

"రస రాగ వాహిని" సీరియల్ క్లయిమాక్సుకు వెళుతున్నట్లుగా అనిపిస్తున్నది రచయిత్రిగారి శైలి కొనియాడదగినది

చెంగల కృష్ణమూర్తి, లింగన్నపాలెం

★ ★ ★

ఆరోహణ" సీరియల్ రచయిత శైలకుమార్‌గారి



## ఉత్తరాలు

శైలి చాలా బాగుంది

పి శ్రీరామచంద్రమూర్తి, గుంటూరు

## కథలు

"నాగరికత నవ్వింది', 'గతుకుల బతుకులు', "లాటరి" కథలు బాగున్నాయి రచయిత(త్రు)లకు అభినందనలు

ఎం శివాజీ, మోదుకూరు

★ ★ ★

"లాటరి' కథ బాగుంది లాటరి మత్తులో పడి తేలుతున్నవార్కి కనువిప్పు కలిగించగలదు రచయితకు అభినందనలు.

సింగం దత్తాత్రేయమూర్తి

సింగం రఘురామా రావ్, ఒంగోలు

★ ★ ★

అవధూత' కథలోని నరసింహశాస్త్రిగారి పాత్ర దేశ స్వాతంత్ర్య కాలము నుండి నేటి ఈ రాజకీయ వ్యవస్థ వరకు ఒక చక్కని. అమూల్యమైన సందేశాన్ని ఇనుమడింప చేసింది వేదిక లెక్కి శుష్క వాగ్దానాలు చేసే ఎందరికో తమ దాకా వస్తే ఏమి చేయాలి అన్నది తెలీని రాజకీయ వాగ్దానాలపై ఒక చక్కని విమర్శనాత్మక సందేశాన్ని ఈ కథ ద్వారా తెలియజేసిన రచయితకి నా హృదయ పూర్వక అభినందనలు

యం యన్ బి శివకుమార్, ప్రొద్దుటూరు

( 74 వ పేజీ చూడండి)






ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు -

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు (1938-1972)

30 జనవరి-5 ఫిబ్రవరి '87

శ్రీ అక్షయ నామ సం మాఘ శు పాడ్యమి

... ప్రటము 7... ...ంచిక 22

ముఖ్య సంపాదకుడు

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు 80 60 |
| పోస్టులో 12నెలల చందా | రు 161 20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003

## విషయానుక్రమణిక

# నియంతృత్వానికి దారి తీసే ద్రవ్యోల్బణం

## న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

మొన్నా మధ్య ఓ ధనికుడు ద్రవ్యోల్బణం గురించి ఫిర్యాదు చేస్తూ మాట్లాడాడు. ఢిల్లీలో ఐదు నక్షత్రాల హోటల్లో నూతన సంవత్సర విందుకు పోయినేడాది ఆయన 800 రూపాయలు చెల్లించాడట. ఈ సంవత్సరం అది 1500 రూపాయలయిపోయిందని ఆయన ఫిర్యాదు చేశాడు. ఇటువంటి 90 శాతం పెరుగుదలను కనీ వినీ ఉండలేదని, ఆర్థిక వ్యవస్థ కుక్కలు చింపిన విస్తరి అవుతున్నదనడానికి ఇది సూచన అని ఆయనన్నాడు. అందుకని ఆయన ఈ సారి నూతన సంవత్సర ఆగమనాన్ని లండన్‌లో జరుపుకో నున్నాడట. అక్కడ ధరలు చాల సరసంగా ఉన్నాయట ఎంత సరసంగా ఉన్నాయి? దిగుమతి చేసుకున్న నిమ్మచెక్కతో పాటు ఒక పళ్లెం పెద్ద చేపగుడ్ల పచ్చడి కేవలం 50 పౌండ్లే (900 రూపాయలే) నట!

ఇంకో రోజు ఒక స్నేహితుడు నన్ను బొంబాయిలోని అతి ఖరీదయిన ఐదునక్షత్రాల హోటల్‌కి 'ఏదయినా గతికి వద్దాం పద' అని తీసుకు వెళ్లాడు. అక్కడ పదార్థాల జాబితాలో ప్రతిదీ దిగుమతి అయినదే. ఆస్ట్రేలియా నుంచి వచ్చిన గుల్ల చేపలు, స్కాట్లండ్, న్యూజిలాండ్, ఫ్రాన్స్‌ల నుంచి వచ్చిన గొర్రెపిల్లలు - (వాటిలో మీరేదయినా ఎన్నుకోవచ్చు), అరడజను దేశాల నుంచి వచ్చిన చీజ్‌లు అక్కడున్నాయి. మా ఇద్దరికీ బిల్లు 1800 రూపాయలయింది. నా స్నేహితుడు తన ప్లాస్టిక్ కార్డుతో ఆ బిల్ చెల్లించాడు ఆయన దగ్గర ఎప్పుడూ డబ్బుండదు. ఆయనసలు ఉంచుకోవలసిన అవసరమే ఉండదు. ఐనా ఆయన కేవలం భోజనానికే రోజుకు వెయ్యి రూపాయలకన్న ఎక్కువ ఖర్చు పెడతాడు. ఆ ప్లాస్టిక్ కార్డు చూపి ఆయన ఎక్కడికైనా, న్యూయార్క్ అయినా, లండన్‌కైనా వెళ్లిరావచ్చు. ఆ ఖర్చులన్నీ ఆయన కంపెనీయే భరిస్తుంది.

నా స్నేహితుడు చేసే ఉద్యోగం ఏమిటి? ఆయన ఎగుమతి - దిగుమతి వ్యాపారంలో ఉన్నాడు. ఆయన భార్య గృహాలంకరణ చేస్తుంది మీ బతుకుతెరువేమిటని బొంబాయిలో ఎవరినైనా అడగండి, వాళ్లు ఎగుమతి- దిగుమతి వ్యాపారంలో ఉన్నామని చెప్తారు. వాళ్ల భార్యలేం చేస్తున్నారో అడగండి, గృహాలంకరణ చేస్తున్నామంటారు

ధనవంతులు, వాళ్లే చెపుతున్నట్టు, మీకన్నా, నాకన్నా వేరయినవాళ్లు. వాళ్ళకు చాలా డబ్బుంది బొంబాయిలో, ఇప్పుడిప్పుడు ఢిల్లీలో కూడా. వాళ్లు పది, ఇరవై, యాభై వగైరా అస్పష్టమైన అంకెలు పలుకుతుంటారు. వాళ్లు వేల గురించి మాట్లాడుతున్నారేమోనని మీరనుకుంటారు. కాని నిజానికి వాళ్లు లక్షల గురించి, తరచుగా కోట్ల గురించి అట్లా మాట్లాడుతుంటారు ఒకాయనయితే తాను జె ఆర్ డి టాటా ఒక ఏడాదిలో సంపాదించే దానికన్నా ఎక్కువ ఒక గంటలో సంపాదిస్తున్నానన్నాడు. ఆయనేమన్నా పన్ను చెల్లిస్తున్నాడా అన్నది అనుమానమే.

ఐదేళ్ళ కింద పరిస్థితులు ఇలా ఉండేవి కావు. 1980లో శ్రీమతి ఇందిరాగాంధీ తిరిగి అధికారానికి వచ్చేవరకూ పరిస్థితులు ఇలా ఉండేవికావు. ఈ ఆరేళ్ళ కాలంలో పరిస్థితులు ఎలా మారిపోయాయంటే డబ్బుకు విలువలేకుండా పోయింది. ఓ మంచి చోట ఓ కప్పుడు టీ పదిరూపాయలకంటే తక్కువకు దొరకడం, ఒక భోజనం వందరూపాయలకంటే తక్కువకు దొరకడం అసాధ్యమైపోయింది. ఉన్నవాళ్లూ, అధికారం ఉన్నవాళ్లూ దేశం మొత్తాన్ని తమ ఇష్టారాజ్యం చెయ్యదలచుకున్నట్టున్నారు పైగా ఉన్నవాళ్ళలో- స్త్రీలను కూడ కలిపి- సగం మంది రాజకీయవేత్తల ముఖ్యంగా కాంగ్రెస్ రాజకీయవాదుల కొడుకులూ, కూతుళ్ళే. మీరు ఢిల్లీలో ఉంటే భోజనాల సమయంలో తాజ్‌కో, ఒబెరాయ్‌కో వెళ్లి చూడండి. ఆ భోజనశాలల నిండా కుర్తా పైజమాల మనుషులు, మిఖయీల్ గోర్బచెవ్‌ను కలుసుకొన్నప్పుడు రాజీవ్‌గాంధీ ధరించే దుస్తుల మనుషులు మీకక్కడ కనబడతారు. వాళ్లందరూ తయారవుతున్న రాజీవ్ గాంధీలు.



రాజీవ్‌గాంధీ, విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్‌లు ఆర్థిక వ్యవస్థను పళ్లెంలో పెట్టి మీ అనుమతేమీ లేకుండానే ధనవంతులకూ, సంపన్నులకూ అందజేశారు అధికారపు వరండాల్లో "బహిరంగ ఆర్థిక వ్యవస్థ' అనే వ్యక్తీకరణకే ఆశ్రయం దొరుకుతున్నప్పటికీ, వీళ్ళ కింద ఆర్థిక వ్యవస్థ క్రమక్రమంగా పెట్టుబడిదారీ రంగులు పులుముకుంటున్నది. ఆర్థిక వ్యవస్థ ఎంత బహిరంగంగా ఉన్నదంటే మీరు దానిలోనుంచి నడిచి వెళ్లి బేరసారాల్లో పుష్కలంగా సొమ్ము చేసుకోవచ్చు మీరేమీ ఉత్పత్తి చెయ్యనక్కరలేదు, ఆ పనికి కాలదోషం పట్టింది మీరేమీ అమ్మనక్కరలేదు, ఎందుకంటే అమ్మడానికేమీలేదు విపరీతంగా ఉన్న దిగుమతుల మీద- ఏడాదికి ఇరవైవేల కోట్ల రూపాయల విలువైన దిగుమతుల మీద ఇక్కడో ఐదుశాతం, అక్కడో పదిశాతం కమిషన్ సంపాదించండి. మీ దగ్గర డబ్బు పోగు పడుతుంది.

డబ్బు కుప్పలు తెప్పలుగా ఉన్న ప్రపంచ బ్యాంకు, బహుళజాతి కార్పొరేషన్లు, విదేశీ ప్రభుత్వాలు భారతదేశంలోకి డబ్బును గుమ్మరిస్తున్నాయి. వాళ్ళు కమిషన్ల పేరిట ఇచ్చే డబ్బు నిజానికి దళారీలకందే లంచం. ఈ దళారీలు లేకుండా ఏ పనీ జరగదు. ఏడో ప్రణాళికలో మనం యాభైవేల కోట్ల రూపాయలు ఖర్చు పెట్టనున్న రక్షణశాఖ కంట్రాక్టులలో నే ఒకాయన, ఎవరో నన్ను అడగకండి, మూడువేల కోట్ల రూపాయలు జేబులో వేసుకున్నాడనో, వేసుకోబోతున్నాడనో నాకు తెలిసింది. ఆయన ఈ డబ్బంతా జూరిచ్‌లోని బాంక్ అకౌంట్లలో శుభ్రంగా చేర్చి పెట్టుకుంటాడు. మీరు విదేశాల కెళితే, విమానంలో వ్యాపారస్తుల కన్న కాంగ్రెస్ రాజకీయవేత్తలే ఎక్కువమంది కనబడతారు. వాళ్లు జెనీవాలో ఒకరోజు ప్రయాణం ఆపుకొని, మజిలీ చేసి తమ పని పూర్తి చేసుకుంటారు- స్విట్జర్లాండ్‌లో వాళ్ళకుండే పనేమిటో మీకు తెలుసా? మళ్లీ గుట్టు చప్పుడు కాకుండా తర్వాతి విమానం అందుకుని పారిస్‌కో లండన్‌కో చేరుతారు. అక్కడ దొంగల్లా కాచుకుని

# ధర్మపథం నిజమైన బంధువులు




కుటుంబంలోని వారిని మినహాయించి చూస్తే ఆప్తులనబడే వారు స్నేహితులూ, బంధువులున్నూ. వీరిలో బంధువుల కంటే స్నేహితులే నిజమైన హితులు. బంధువులు కొంత రక్త సంబంధం కలిగి ఉండవచ్చును. కాని మిత్రులు హృదయంతో సన్నిహిత సంబంధం కలిగి ఉంటారు. వారికి డబ్బుతోనూ, ఆదరణతోనూ నిమిత్తం ఉండదు.

తమవారు గొప్ప ధనవంతులై, ఆదరణ చూపే వారుగా ఉంటే జనులు ఏదో దూరపు బంధుత్వాన్నయినా కల్పించుకొని ఆ బంధువుల యింట్లో తిష్ఠ వెయ్యటం పరిపాటి. డబ్బులేని దగ్గరి బంధువుల దగ్గరికి వెళ్ళమన్నా వెళ్ళరు. వెళ్ళితే తాను వారికోసం ఖర్చు పెట్టవలసి వస్తుందేమో అని భయం.

చెరువు పూర్తిగా నిండి ఉన్నప్పుడు వేల కొద్దీ కప్పలు అక్కడ చేరిన విధంగా శ్రీమంతుడుగా ఉన్న వాని దగ్గర బంధువులు చేరుతారనీ, చెరువు ఎండిపోగానే ఒక్క కప్ప కూడా అక్కడ ఉండని విధంగా, ధనం వ్యయమై పోయి లేమి సంభవించినప్పుడు ఒక్కడు అతనివైపు చూడరనీ సుమతి శతక కారుడు చక్కగా వివరించాడు.

తమకు సహాయం చేసినా, చెయ్యక పోయినా సుప్రసిద్ధులూ, ఉన్నత పదవిలో ఉన్నవారూ, పలుకుబడి ఉన్నవారూ అయిన వ్యక్తులు తమ బంధువులే అని కొందరు చెప్పుకోవడం పరిపాటి. అందువల్ల తమకు గౌరవం కలుగుతుందని, వారి భావన. ఇలా చెప్పుకుని గౌరవం సంపాదించేవారున్నూ లేకపోలేదు.

నిజమైన బంధువులకి సరియైన ఆహ్వానం లేకపోయినా ఆప్త బంధువుల వివాహాది శుభ కార్యాలకు వచ్చి, విందులారగిస్తూ ఒక చోట కూర్చోక-శ్రమ అనుకోక కావలసిన పనులలో ఎంతో సహాయపడతారు. ఎలాటి మర్యాదలనూ ఆశించక, ఆ శుభ కార్యం ముగియగానే తప్పుకుంటారు. అభిమానంలేని బంధువులు మర్యాదల కోసం ఎదురు చూచి, ఏ మాత్రం లోపం కనబడినా అలిగి వెళ్ళిపోతారు.

యధార్థ బంధువులు కష్ట కాలంలో వచ్చి ఆదుకొంటారు. అవసరమైతే తమకు శ్రమగా ఉన్నా లెక్క చేయక ఆర్థిక సహాయాన్ని అందిస్తారు. దీనికి పిలుపు అవసరంలేదు.

వంచకులయిన బంధువులు, తాము అత్యంతాప్తులమైనట్లు నటిస్తూ వచ్చి ముఖప్రీతి మాటలు చెప్పి తమ పనులు ముగించుకొని వెళ్ళిపోతారు. ఇలాంటి వారిని ఒకకంట కనిపెడుతూ, వారిని దూరంగా ఉంచటం ఎంతో అవసరం. లేకపోతే వారివల్ల ఎన్నో చిక్కులు కలుగుటకు అవకాశం ఉంది. నిజమైన బంధువులనే దగ్గర చేరనియ్యాలి.

—బులుసు వేంకట రమణయ్య

## న్యూఢిల్లీ లేఖ

కూచునే ఆయుధ వ్యాపారులుంటారు

బ్రిటిష్ పార్లమెంటు సభ్యుడు ఒకరు హోం మంత్రి బూటాసింగ్‌ను కలిసినప్పుడు, ఆయన, అంటే బూటాసింగ్ తమకేమి కానుకలు తేలేదా అని అడిగారట ఈ విషయాన్ని బూటాసింగ్ ఖండించలేదు ఆ బ్రిటిష్ పార్లమెంట్ సభ్యుడు మాత్రం బారతదేశం లంచగొండి దేశమనీ, దేశం నిండా లంచగొండి రాజకీయవేత్తలున్నారని గొంతు చించుకొని అరుస్తూ వెనక్కి వెళ్ళాడు కొన్ని సంవత్సరాల క్రితందాకా భారతదేశానికి ఉన్న పేరు ప్రతిష్ఠలు ఇవికావు అప్పుడు లాటిన్ అమెరికాలోని కొన్ని దేశాలతో సహా నైజీరియా ఇటువంటి విషయాలలో అగ్రాసనాధిపత్యం వహించేది. ఇప్పుడు భారతదేశాన్ని కూడా అటువంటి అర్థంలోనే ప్రస్తావించవలసి వస్తున్నది. ఈ శతాబ్దం ముగిసే నాటికి మనం యధాతథంగా ఉండే అవకాశాలు రెండింట ఒకటేనని 'లండన్ ఎకానమిస్ట్' పత్రిక కూడా అభిప్రాయపడుతున్నది టర్కీ, తైవాన్ వంటి దేశాలు మనకంటే సుస్థిరంగా ఉన్నాయి మనను సూడాన్, ఈజిప్ట్ వంటి దేశాలతో కలిపి చెపుతున్నారు

ఇదే గనుక 'నూతన' ఆర్థిక విధానమయితే ఇక ఆ భగవంతుడే మనను రక్షించాలి. ఇదంతా ఉద్దేశపూర్వకంగానే జరుగుతున్నదేమోనని నా కనిపిస్తున్నది ఎందుకంటే, దేశాన్ని ఉన్న వాళ్ళకూ, లేనివాళ్ళకూ మధ్య ఎడగొడితే తద్వారా ఏర్పడే పరిస్థితులు ప్రజలనెంతో భయోత్పాతంలో ముంచివేస్తాయి అప్పుడు వాళ్ళు ఖచ్చితంగా శక్తివంతులైన వ్యక్తులకు, నియంతలకు వోట్వేయక తప్పదనుకుంటారు బ్రెజిల్, మెక్సికో, ఫిలిప్పైన్స్‌లని ఉదాహరణలుగా తీసుకోండి అక్కడి ప్రజలు అసలు ఏం జరుగుతున్నదో తెలుసుకునే లోపుగానే ఆ దేశాలు నియంతల చేతుల్లోకి వెళ్ళిపోయాయి ఆ దేశాలకు కూడా వాళ్ళ 'నూతన' ఆర్థిక విదానాలున్నాయి వాళ్ళ సలహాదార్లు ప్రపంచ బాంకు నుంచే వచ్చారు వాళ్ళు కూడా అంతర్జాతీయ ద్రవ్యనిధి నుంచి ఋణాలు తీసుకున్నారు విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ తానెంత నిజాయితీ పరుణ్ణని చెప్పుకున్నా, ఎంత తరచుగా పారిశ్రామిక వేత్తల మీద దాడులు చేసినా మనం కూడా ఆ దేశాల మార్గంలోనే వెళుతున్నాం (దాడికి గురయిన పారిశ్రామిక వేత్తలు ధూన్ పారశాల నిర్వాహకులని తర్వాత తెలిసి క్షమాపణ తర్వాత వారిని వదిలి వేయడం జరుగుతున్నది) మనిలాలో మార్కోస్ అధికారానికొచ్చింది సరిగ్గా ఇటువంటి పద్ధతిలోనే, అంతేకాదు, అక్కడ కూడా మన బొంబాయి, కలకత్తాలలో లాగానే పొరుగున మురికివాడల్లో చిన్నారి బాలలు ఆకలికి ఆహుతై పోతుండగా నూతన సంవత్సర విందుకు 1500 రూపాయల టికెట్టుండేదని మీరు తెలుసుకోవాలి □

కరకరలాడే రుచికి
పాల సత్తువను పెంచే
న్యూట్రిన్ మిల్క్ బిస్కెట్స్







భారతదేశంలో అత్యధికంగా
అమ్మకమౌతున్న మిఠాయిలను
తయారుచేయువారు

ACIL/009/86 Tel

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

స్టేషన్‌లో వేసి నాలుగు బాదిం తరువాత కొంత సేపటికి మత్తు దిగింది పోలిగాడికి. వదరటం మానేసి లాకప్‌లో నిశ్శబ్దంగా పడున్నాడు.

"నమస్కారం సార్".

తలెత్తి చూశాడు ప్రణీత్. అతను పాపారావు అనుచరుడు గోపాలం బాబూరావు మూలవిరాట్టు.. పాపారావు పూజారి... వీళ్ళంతా ఉత్సవ విగ్రహాలు..

"ఏం కావాలి?" అన్నాడు ప్రణీత్.

గోపాలం వెనక బిత్తర చూపులు చూస్తూ చేతిలో సిల్వర్ క్యారేజీతో నిలబడి ఉంది గౌరి.

గోపాలం పక్కనున్న కుర్చీ చూపిస్తూ "కూర్చోమ్మా" అన్నాడు ప్రణీత్

గోపాలం కనుబొమలు ముడి పడ్డాయి గౌరికి తన పక్క సీటు ఆఫర్ చెయ్యటం ద్వారా ప్రణీత్ తనను అవమానిస్తున్నట్లు ఫీలౌతున్నాడతను

ప్రణీత్ లెక్క చెయ్యలేదుగానీ... గౌరి భయపడింది

"ఈడ నిలబడతాలేయ్యా " అన్నది వినయంగా.

"ఇది దీని మొగుడికి అన్నం తెచ్చింది " అన్నాడు గోపాలం

'అయితే మీరు దేని కొచ్చారు?' అన్నాడు ప్రణీత్.

మీరు అనుమతించరేమో నని..."

'మీరొస్తే అనుమతిస్తానా?"

"ఎక్కడో పిచ్చిముండా వాడిలా ఉన్నాడే వీడు తను దీన్ని అనుమతించమని రికమండ్ చెయ్యటానికి పాపారావు తరఫున వచ్చాడని తెల్ల బట్టలోళ్ళు ఖద్దరు బట్టలోళ్ళు అడుగు పెట్టందే పోలీస్ స్టేషన్‌లో ఏ పనీ జరగదని వీడికి తీలీదా? ఈ ఫోజులు దేనికి?" అనుకుంటూ "దాని మాట మీరు వినరని భయపడి గౌరే నన్ను తీసుకొచ్చింది బ్రతిమాలి అసహనంగా అన్నాడు గోపాలం

"ఆమెకా భయం అక్కర్లేదు ఇహ మీరెళ్ళండి." అన్నాడు ప్రణీత్. ఇంతకు ముందున్న ఎస్ ఐ అయితే తను రాగానే అగ్గగ్గలాడుతూ కుర్చీలో నుంచి లేచి నిలబడి ఆహ్వానించి, కుశల ప్రశ్నలు వేసి "మీరు స్వయంగా రావాలా? ఫోన్ చేస్తే చాలదూ! రాను రానూ పాపారావుగార్కి నా మీద నమ్మకం తగ్గి పోతున్నట్లుంది " అని నొచ్చుకుంటూ క్షణాల మీద తన పని చేసి పెట్టి గుమ్మందాకా సాగనంపేవాడు

ఈ ప్రణీత్ గాడుట్టి కొరివి చచ్చినాడు వీడికిక్కడ రోజులు దగ్గర కొచ్చినాయి

బాబూరావు అల్లుడని అహంభావమేమో! ఆయనకు వీడంటే గడ్డిపోచంత విలువ కూడా లేదని పాపారావు మాటే ఆయనకు వేదమని తెలియక మిడిసి పడుతున్నట్టున్నాడు .

ఇహ మీ రెళ్ళండి". అన్నాడు ప్రణీత్.

కందిన ముఖంతో బుసలు కొడుతూ వెళ్ళి పోయాడు గోపాలం

భయం భయంగా చూస్తోంది గౌరి...

"చూడమ్మా! నీకేం కావాలి?" మృదువుగా అడిగాడు ప్రణీత్

'నేనూ అది కన్నం పెడదామని . 'నసుగుతున్నట్లుగా అన్నది గౌరి

"అలాగే పెడుదు గాని నీతో పాటు గోపాలాన్నెందుకు తెచ్చావు? నువ్వు చెపితే నేను విననని ఎందుకనుకున్నావు?"

"అసలు నేనొచ్చి మీ కాళ్ళు పట్టుకుందామను కున్నానయ్యా మద్దెలో ఈ గోపాలంగారొచ్చి "నువ్వు చెపితే పోలీసు లింటారా? నిన్ను కూడా మక్కాలిరగదన్ని పోలీస్ స్టేషన్‌లో పారేసి అంతా కలిసి చెరుస్తారు. వాళ్ళ కాడికి ఒంటరిగా పోకు." అని చెప్పిండు. దాంతో భయపడి...." బెదురుగా చూస్తూ ఆగిపోయింది గౌరి.

తన లాంటి వాళ్ళు కష్టపడి నిర్మించుకున్న స్థాయిని... నైతిక విలువల్ని పాపారావు లాంటి వాళ్ళు తమ దుష్ప్రచారంతో ఎంత తేలికగా కూలగొట్ట గలరో... ప్రజలు వాళ్ళ మాటలకే విలువిచ్చి ఎలాంటి అభిప్రాయాలేర్పరుచు కుంటారో స్పష్టంగా చూడగలిగాడు ప్రణీత్.

"ఇంకెప్పుడూ ఇలా మధ్యవర్తుల్ని తీసుకు రాకు గౌరీ నీకేం కావాలన్నా

జరిగిన కథ-12 : బాబూరావు అహంకారంవల్ల ఆగిపోయిన ప్రణీత్, మంజీరల పెళ్ళి రాజకుమార్ సాయంతో జరుగుతుంది. నవవధూవరుల్ని బాబూరావు అవమానించి వెళ్ళగొడతాడు. మంజీరతో సంబంధాలు తెంచుకోవాలని బాబూరావు ఇంట్లో కట్టడి చేస్తాడు. బాబూరావుకు కుడిభుజంగా పని చేసే పాపారావు ప్రణీత్ మీద ద్వేషాన్ని పెంచేందుకు ప్రయత్నిస్తుంటాడు. పాపారావు మోసగించి తీసుకొచ్చిన దాక్షాయణిని ప్రణీత్ రక్షిస్తాడు. శర్వాణి మళ్ళీ గర్భవతయిందని తెలిసి మంజీరకు తల్లిని చూడాలని ప్రాణం కొట్టుకులాడుతుంది. ఒక పేరంటంలో తల్లీ కూతురు కలుసుకుంటారు. గూడెం వ్యవహారాల్లో పాపారావు వర్గంతో ప్రణీత్‌కు ఘర్షణ పెరుగుతుంది.

సరాసరి వచ్చి నన్నడుగు. సమస్య నీది. ప్రస్తుతం దాన్ని పరిష్కరించాల్సింది నేను. నేరుగా మనమే మాట్లాడుకుని దీన్ని పరిష్కరించుకోవచ్చు. ఇలాంటి పెత్తందార్లకి అనవసర మయిన ప్రాముఖ్యాన్నిచ్చి వాళ్ల చేతుల్లో పావుల్లా మారకండి మీరు."

ప్రణీత్ ఆవేశం గౌరికి సరిగ్గా అర్థం కాక పోయినా... తను గోపాలాన్ని తీసుకు రావటం అతని కిష్టం లేదని మాత్రం గ్రహించ గలిగింది.

"అట్లాగేలే దొరా! మరి.... అన్నం? వాడెక్కడున్నాడు?" అన్నదామె.

"చెపుతాగానీ.... ముందీ విషయం చెప్పు! నీ మొగుడు నిన్ను చెట్టుకు కట్టేసి చావ బాది సజీవంగా తగల బెట్టెయ్య టానికి సిద్ధపడ్డాడు గదా. మేము రావటం కాస్త ఆలస్య మయితే నువ్వు బూడిదగా మారి పోయి ఉండేదానివి.

ఇంత చేసినా నీ మొగుడు మీద నీకేం కోపం లేదా? వాడు అన్నం తినలేదని తహతహలాడుతూ ఎలా వచ్చావు?"

"ఎందుకు రానయ్యా! అడసలు మంచోడే! ఎప్పుడూ నామీద చెయ్యి చేసుకోడు. కానీ.... తాగితే మాత్రం ఆడికి ఒళ్ళు తెలీదు. అందుకని తాగుడు మానేస్తానని నాకాడ పెమాణం చేసి చాలా వరకూ మానేశాడు. ఈమధ్యన ఎవరో ఆడికి నా మీద లేనిపోనివి చెప్పి పురెక్కిస్తున్నారు. చివరికి వాడి చేత బాగా తాగించి, ఆడి మనసు విరిచేసి నా మీదకు తోలారు. ఆ కైపులో ఆడికి, ఒళ్ళూ పై తెలీలేదు.

దొరా! ఒకవేళ నేను సచ్చిఉంటే.... నిషా దిగాక ఆడు కూడా నాతో పాటు బలవంతాన సచ్చిపోయేవాడు.

ఆడికి నేనంటే అంత ప్రేమ!

తగాదాల దేమిటి! మొగుడూ పెళ్ళాల మధ్య అవి వస్తుంటయ్ పోతుంటయ్! ఆడి మనసు పాడు చేసి నోళ్ళ నవాలిగానీ.... ఆడి నంటే ఏం లాభం?" అన్నది గౌరి.

ఆమె అవగాహనకు ఆశ్చర్య పోయాడు ప్రణీత్.

"వాడి నలా తాగించి నీ మీదకుసి గొలిపిందెవరో తెలుసా?" అన్నాడు ప్రణీత్.

"తెలీద్దొరా! నిసా తగ్గితే ఆడే చెపుతడు." అన్నది గౌరి.

"తగ్గింది. అయినా చెప్పటం లేదు".

"నేనడిగితే చెపుతాడు".

"అయితే పద. అన్నం తీసికెళ్ళి పెడుదుగాని." అంటూ లేచాడు ప్రణీత్....

లాకప్‌లో నీరసంగా.... మోకాళ్ల మీద తలానించుకుని కూర్చున్న మొగుణ్ణి చూడగానే గుండె చెరువయింది గౌరికి. ఊచల మీద చేతులానించి లోపలికి చూస్తూ "మావా!" అన్నది ఆర్ద్రంగా.

చివ్వున తలెత్తి చూశాడు పోలిగాడు.

రేగిన జుట్టుతో.... ఏడ్చి ఎర్రగా ఉబ్బిన కళ్ళతో దీనంగా.... అమాయకంగా నిలబడ్డ గౌరిని చూడగానే ప్రాణం లేచొచ్చిందతనికి. ఒక్క ఉదుటున లేచొచ్చి "గైరీ" అన్నాడు ఆర్తిగా.

లోపలకు చాపిన చేతులతో అతని బుగ్గలు మృదువుగా రాస్తూ "మొహమంతా ఎట్ట పీక్కుపోయిందో చూడు! అన్నం తెచ్చా మావా! ఎస్. ఐ. బాబు నడిగి నీకు పెట్టటాని కొప్పించు కొచ్చాను. ఆ ముంతలో చెయ్యి తొలుపుకురా. నేను ముద్దలు చేసి అందిస్తా! తిందుగాని" ప్రేమగా అన్నది గౌరి.

కాస్త దూరంలో నిలబడి వాళ్ళను గమనిస్తున్నాడు ప్రణీత్.....

"గైరీ!" అంటూ మొహం చేతులతో కప్పుకుని ఏడ్చాడు పోలిగాడు.

"నేను పాపిష్టోడినే, ఒక్కరవ్వుంటే నిన్ను కాల్చి చంపుకునే వోడినిగదే! నా మీద కోపం లేదంటే నీకు?! నాకు కూడట్టు కొచ్చినవా! నువ్వసలేం తిని ఉండవు. ఇలా వస్తుంది నాకోసం ఏడుస్తున్నవా ఇంకా! నన్ను క్షమించు గైరీ. నా సేతులు నరికెయ్యి." అని లబలబలాడుతున్న పోలిగాడిని చూసి "చా! ఏం మాటలయ్యి? నాకు తెల్దామావా నీ సంగతి? ఎవురో దురమార్గులు నీ మనసిరిచేసి, నీచేత తాగించి ఇట్ట చేయించిన్రు ఇది నీకు పుట్టిన బుద్ధి కాదు". అన్నది గౌరి.

"ఔనే, ఆ గోపాలం గారూ పాపారావు గోరూ చేరి వారం రోజుల్నుంచీ నా బుర్ర సెడగొడుతున్రు. అసలు ఆళ్ళే రంగి గాణ్ణి నీ గుడిశ లోకి తోలి ఉంటరు. ఆడు బయట కొత్తుండగా నాకు చూపించిన్రు నాచేత బాగా తాగించి. నీగునం మంచిది కాదని నమ్మించారు "



# ఒడిలో చెలి మోహన రాగం

"అరంగిగాడొచ్చే సరికి నేను తానం జేసి కోక కట్టు కుంటన్నా.

"అయ్యో! మళ్ళీవస్తా_నే". అని జుట్టు రేపేసుకుంటూ బయిటికి పోయిండాడు....."

"అప్పటికే నాకు బాగా అనుమానం తల కెక్కింది. రేగిన తలతో ఆడు బయటికి రావటం... నన్ను చూసి పారిపోవటం చూసి నేను లోపలికొచ్చినా. నువ్వప్పుడే కోక కట్టుకుంటూ ఉండే సరికి.... నాకింక ఒళ్ళు తెలీలా.

నా గైరి ఎట్టాంటిది అనే ఆలోచన కూడా లేకుండా నిన్ను సంపుకోటానికి సిద్ధపడ్డా! చీ! ఇంకెప్పుడు తాగనే గౌరీ. బాట గంగానమ్మ తల్లి సాచ్చిగా... ఇంకెప్పుడూ తాగను. నీమాత్రం ఇంగితం నాకు లేకపోయింది...." గౌరి అందిస్తున్న అన్నం ముద్దలు తింటూ వాడు వాపోతుంటే గౌరి ఓదారుస్తోంది....

"మనకింత సెరుపు చేసింది చాలక... ఈ ఇనస్పెక్టర్ బాబు మీద నాకు లేనిపోనివి చెప్పి... మళ్ళీ ఆ గోపాలం గాడే నాతో వచ్చిండేడకి. ఈ బాబు ఆణ్ణి తరిమేసి, నన్నొచ్చి నీకన్న మెట్టుకోమన్నడు. ఈయన కాల్లట్టుకుంటే నిన్నొగ్గేస్తారు మావా! మనసున్న మారాజీయన" కృతజ్ఞతగా అన్నది గౌరి.

పశ్చాత్తాపంతో కుమిలి పోతున్న పోలిగాడిని చూస్తూ "వీడిని మార్చటానికిదే అదును" అనుకున్నాడు ప్రణీత్.

అప్పటికి కొందరు పోలిగాడు వర్గం వాళ్ళు కూడా అక్కడికి చేరారు....

"అయ్యా! ఆడినొగ్గెయ్యయ్యా! నీ కాళ్ళట్టుకుంటా". అని ముందుకు ఒంగ బోతున్న గౌరిని వారిస్తూ "మళ్ళీఎవరయినా ఇలాగే ఉసిగొలిపితే... ఏ అర్ధరాత్రో నువ్వు నిద్ర పోతున్న సమయం చూసి "రాములోరు సీతమ్మోర్ని అగ్గిలో పడదొయ్యలేదా?" అంటూ నిన్ను వీడు కాల్చి చంపేస్తే?" అన్నాడు ప్రణీత్.

"ఇంకెప్పుడూ ఇలాంటి యదవపని చెయ్యన్దొరా!" లెంపలేసుకుని ఏడుస్తూ ప్రమాణాలు చెయ్యసాగాడు పోలిగాడు.

"ప్రత్యేకంగా నీమీదే ఎందుకు కక్షగట్టాడు పాపారావు?" అన్నాడు ప్రణీత్.

"నా భార్య రాజకుమారయ్యా పార్టీకి సెందినోల్ల బిడ్డయ్యా....."

"అదా సంగతి! నీ చేత వాళ్ళ వర్గానికి చెందిన అమ్మాయిని చంపిస్తే.... వాళ్ళు పగతో నీమీద పడి నిన్ను చంపుతారు.

ఇహ.... ఇరువర్గాల మధ్య కసి.... వాళ్ళను వీళ్ళు వీళ్ళని వాళ్ళు చంపుకోటం... కొంపలకి నిప్పెట్టుకోటం....

మీరంతా నాశన మవుతారు. పాపారావు లాంటి వాళ్ళు బాగుపడతారు. అసలు... మీలో మీకెందుకీ తగాదాలు? ఒక గూడెం వాళ్ళు... బంధువులూ అయిఉండి మీలో మీరిలా కక్షలతో తన్నుకు చావబట్టే పరాయి వాళ్ళు మీ గొడవల్లో తల దూర్చి లాభం పొందగలుగుతున్నారు.




మీరంతా ఐకమత్యంగా ఉంటే.... వాళ్ళసలు మీ గూడెంలో అడుగుపెట్ట గలరా? ఇందువల్ల మీరేం నష్ట పోతున్నారో మీకర్థ మవుతోందా? కస్తుంటే నీ భార్య చచ్చూరుకునేది గదా!

నేను మీ అందర్నీ సమావేశ పరిచి రాజీ చేస్తాను నే చెప్పినట్టు వినండి. మి కేమన్నా గొడవలుంటే నాదగ్గరకు రండి. మధ్యవర్తులకూ, పెత్తందార్లకూ సందివ్వకండి.

గూడాన్ని ఇలా చీలగొట్టుకుని మీరేం సాధించ గలుగుతున్నారు? తల్లీ బిడ్డలకీ... మొగుడూ పెళ్ళాలకీ.... అన్నదమ్ములకీ.... స్నేహితులకీ మధ్య తగాదాలు. వర్గ భేదంతో చేతులారా సృష్టించుకున్న తగాదాలు. చంపుకోటాలు.... ఇంతేగా మీరు సాధించింది?"

"నిజమే గానీ దొరా. మేము అవతలి పార్టీ వాళ్ళతో కలిస్తే నాగులు గాడూ వాళ్ళు ఊరుకోరు." అన్నాడు పోలిగాడు.

"నాగులుగాడూ గూడెపు మనిషే. పాపారావుకి నమ్మిన బంటు... వాళ్ళ చేత పందెపు పుంజులా పోషింపబడుతూ.... తెగతాగి బేవార్స్‌గా తిరుగుతూ.... తన ఆకారంతో క్రూరత్వంతో అందర్నీ భయపెడుతూ.... పాపారావు అండ చూసుకుని ఎలాంటి ఘో రాల్నయినా అవలీలగా చేసేస్తూ ఉంటాడువాడు.

పాపారావు కోరితే.... తను పుట్టి పెరిగిన గూడాన్ని.... ఆ గూడెపు మనుషుల్ని ఒక్క తృటిలో తగల బెట్టి పారెయ్యటానిక్కూడా వెనుతియ్యడు వాడు. వాడికో ఇద్దరు అసిస్టెంట్లు.

గూడెంలో .... కాస్త ఆకారపుష్టితో ... నిర్లక్ష్యంగా మొండిగా బేవార్స్‌గా తిరిగే వాళ్ళని కొందర్ని అక్కడ నుంచి విడదీసుకొచ్చి బాగా మేపుతూ.... కల్లుతో పాటు క్రూరత్వాన్ని రంగరించి పోస్తూ.... డబ్బుఎర చూపి వాళ్ళలో ఎక్కడో దాగి ఉన్న మానవత్వాన్ని సమూలంగా నాశనం చేసి తమ అనుచరులుగా మార్చుకుని వాళ్ళనే తిరిగి ఆ గూడెం మీదకు ప్రయోగిస్తూ ఉంటాడు పాపారావు.

"ఎవరి వేలితో వాళ్ళ కన్నే పొడుచు కునేలా చెయ్యటం". అంటే ఇదే.

వాడు ఒక్కడు. మీరు వందల మంది. మీరంతా ఐకమత్యంగా ఉంటే వాడిని మీ గూడెం చాయలక్కూడా రానివ్వ కుండా చెయ్య గలరు మీరు. మీరెవరూ వాడితో కుమ్మక్కవ కుండా ఉంటే చాలు.... వాడు మిమ్మల్నేం చెయ్యలేడు. అక్కడికీ మించి పోతే వాడి సంగతి నేను చూసుకుంటాను."

"నువ్వు చెప్పినట్టే ఇంటాం దొరా". అన్నారు పోలిగాడు. అక్కడున్న వాళ్ళూ మనస్ఫూర్తిగా.

గూడెంలో ఇరు వర్గాల వాళ్ళనీ సమావేశ పరిచి. . ఇలాగే వాళ్ళందరికీ నచ్చ చెప్పి... భయపెట్టి.... హామీలిచ్చి... మొత్తానికి . . గూడేన్ని ఏకం చెయ్యటంలో విజయం సాధించాడు ప్రణీత్.

రాజకుమార్ అతన్ని అభినందనలో ముంచెత్తాడు....

గూడెంలో ప్రతి పది మందిని ఒక గ్రూప్‌గా తయారు చేసి, ఆ గ్రూప్‌లో వాళ్ళిష్ట పడ్డ వ్యక్తిని దానికి నాయకుడుగా చేసి మిగిలిన తొమ్మిది మంది బాధ్యతా అతని కప్పగించాడు ప్రణీత్. వాళ్ళేమయినా అపసవ్యంగా ప్రవర్తిస్తే ఆ నాయకుడిని శిక్షిస్తానని చెప్పాడు. ఈ గ్రూపులన్నీ ఐకమత్యంగా ఉంటూ నాగులు గాడి లాంటి రౌడీలను గూడెంలో అడుగు పెట్ట నివ్వకుండా చెయ్యాలి......

ఈరకంగా అందర్నీ ఒక తాటి మీదకు తెచ్చాడు ప్రణీత్. ఎప్పుడో విడిపోయిన గూడెం తిరిగి ప్రణీత్ నాయకత్వంలో ఒకటయి కళకళ లాడింది. వాళ్ళకో బడీ, గుడీ ఏర్పాటు చేసి, పరి శుభ్రంగా ఉండటం.... పరిసరాల్ని శుభ్రంగా ఉంచుకోటం నేర్పాడు ప్రణీత్. శ్రమపడి వాళ్ళే తమ గూడానికి చిన్న చిన్న వసతులు ఏర్పాటు చేసుకునేలా చేశాడు.

క్రమంగా వాళ్ళ చేత పూర్తిగా తాగుడు మాన్పించటానికి ప్రయత్నాలు చెయ్య సాగాడతను...

ఇదంతా చూసే సరికి కంట్లో కారం కొట్టుకున్నట్టయింది పాపారావుకి ప్రణీత్ రాజకీయాల్లోకి దిగాడంటే. . అతని నాయకత్వంలో ఊరంతా రాజకుమార్ వేపు తిరిగి పోతుంది అప్పుడిహ బాబూరావుతో పాటు . ఊరి మీద తన ఆధిపత్యపు పునాదులు కూడా కూలిపోతాయి

అర్జంటుగా బయల్దేరి రమ్మని రహస్యంగా బాబూరావుకు కబురంపాడు

# తను ఇచ్చే సలహా డాక్టరూ పాటిస్తారు!

డాక్టరు వృత్తి చాలా కష్టమైనది. తరచు అర్జంటు కేసులు వస్తాయి. రోగులని చూస్తూ అనేక గంటలసేపు పని చేయవలసి వస్తుంది. రాత్రనక, పగలనక రోగులు వస్తూనే ఉంటారు. కాదనకుండా వాళ్ళని చూడాలి. చెప్పలేనంత అలసట వస్తుంది.

అందుకే నేను హార్లిక్స్ మీదే ఆధారపడతాను.

హార్లిక్స్, పోషక శక్తినిచ్చే పదార్థాలు గల రుచికరమైన, ఉత్సాహాన్నిచ్చే పానీయం. రోజంతా పనిచేసి అలసిపోయిన తరువాత హార్లిక్స్ త్రాగితే ఆ అలసటంతా పోతుంది.

అందుకే నేను రోజుకి రెండు సార్లు హార్లిక్స్ త్రాగమని ఎప్పుడు సలహా యిస్తాను.

నాకు బాగా తెలుసు. నేనుకూడా త్రాగుతాను.



ప్రపంచ మంతటా డాక్టర్లు నమ్మినది.

మాల్టెడ్ బార్లీ, వెన్నతో కూడిన పాలు, బంగారు వన్నె గోధుమలలోని పోషక శక్తుల మంచితనమంతా చక్కగా రంగరించబడిన హార్లిక్స్ ఎంతో రుచికరమైన పానీయం. పోషక శక్తిని సమకూర్చేందుకు ఉత్తమ మార్గంగా అందరు నమ్ముతారు. 100 సంవత్సరాలకు పైగా ప్రపంచమంతటా లక్షలాది కుటుంబాలు హార్లిక్స్‌ని నమ్ముతున్నాయంటే ఆశ్చర్యం ఏముంది?




మంచి పుష్టికరమైనది

HMM-9239 TEL

## జడితో వెలి మోహన రాగం

పాపారావు ఆయన రాక కోసం ఆత్రంగా ఎదురు చూడ సాగాడు

బాబూరావు ఊళ్ళోకి రాగానే తనే ముందెళ్ళి ఆయన్ని కలుసుకున్నాడు అంతా వివరించి చెప్పి-

'మీ అల్లుడు పూర్తిగా రాజకుమార్‌కి దాసుడై పోయాడు ఊరి రాజకీయాల్లో కూడా కల్పించు కుంటున్నాడు ఇప్పటికే మంచివాడు, నిజాయితీ పరుడు గుడ్డూ గుడుసూ అంటూ ఊళ్ళో సగం మంది జనం రాజకుమార్ గాడి వేపున్నారు మనకు ఆయువు పట్టయిన గూడెం కూడా నీ అల్లుడి ద్వారా రాజకుమార్ గాడి పరమయి పోయినట్లే వాళ్ళందరికీ నీ అల్లుడి మాటే వేదంలా ఉంది

చిన్నా పెద్దా చూసుకోకుండా అన్నిటిలోకీ దూరేస్తున్నాడతను మనమన్నా మన మాటన్నా గడ్డిపోచంత కూడా విలువ లేదతనికి

నేనంటే సరే, పరాయి వాడిని నువ్వన్నా అంతే

'నేను బంధుత్వాలని కేర్ చెయ్యను నాకు నీతి అనిపించిందాన్ని నిజాయితీగా అమలు జరిపి తీరతాను ఈ విషయంలో బాబూరావుని కూడా లెక్క చెయ్యను' అంటున్నాట్ట నీ అల్లుడు బాబూరావు సమీపంలో కూచుని ఉన్నవీ లేనివీ కలిపి ఎగదోస్తున్నాడు పాపారావు

"నువ్వు పదే పదే అల్లుడు . అల్లుడు అనకు ఆ వెధవ నా అల్లుడని నేను కలలో కూడా అనుకోటల్లేదు ఇక్కడినుంచి ఏ శంకరగిరి మాన్యాలకో తోయించి పారేస్తానుండు వాడిని కోపంగా అన్నాడు బాబూరావు

'ఇదివరకొకసారి అయిందిగా ఊరి జనమంతా కలిసి రాజకుమార్‌గాడి వెంట హైదరాబాద్ దాకాపోయి గొడవచేసి తిరిగి నీ అల్లుడినీ ఊరికి తెచ్చుకున్నారు అందుకే అతనికి పొగరు కళ్ళకెక్కి ఉన్నాడు ఊళ్లోవాళ్ళు ముఖ్యంగా ఆడవాళ్ళు వాడంటే పడిచస్తున్నారు వాడొచ్చాక దొంగతనాలు గూండాయిజాలు అణిగిపోయి ఊరు కళకళలాడి పోతోందిట ఇహ ఇప్పుడు గూడెంకూడా అటువేపు తిరిగి పోయింది ఈ ప్రజలే నిన్ను నన్నూ ఈ ఊరు నుంచి గెంటేసి, నీ అల్లుడి నాయకత్వంలో రాజకుమార్‌గాడికి పట్టంకట్టేలా ఉన్నారు ఎలా మానేజ్ చేస్తావోమరి నీ ఇష్టం అంటూ బాబూరావు మనసునిండా విషంనింపి జారుకున్నాడు పాపారావు

అల్లుడిమీద కసితో ద్వేషంతో రగిలి పోతున్నాడు బాబూరావు

తన స్థానానికి పగులొచ్చే పరిస్థితి ఏర్పడితే అందుకు కారకుడైనవాడు అల్లుడయినా, కొడుకయినా వదలడు తను

ఆ ప్రణీత్‌గాడుదేనికీ లొంగడు మొండిముండా కొడుకు వాడిమీద మానసికంగా దెబ్బతియ్యాలి కుళ్లి చచ్చేలా చెయ్యాలి మామూలుగా ఇలాంటివాళ్లపట్ల తీసుకునే ఏ చర్యనీ వాడు కేర్ చెయ్యడు ఆఖరుకు సస్పెండ్




చేసినా చలించడు. అందుకే. . వాడి మనసుమీద చావుదెబ్బ కొట్టాలి కక్కలేక మింగలేక కుళ్లి చచ్చేలా చెయ్యాలి ఇందుకోసం జాగ్రత్తగా ఆలోచించి పథకం వెయ్యాలి." అనుకున్నాడు బాబూరావు

తన నియోజకవర్గాన్ని అభివృద్ధి చేసే నెపంతో బాబూరావు పైడిపల్లిలోనే మకాం పెట్టాడు.

మామా అల్లుళ్ళకు ముఖాముఖీ యుద్ధం ప్రారంభం కావటం పాపారావుకు పండగలా ఉంది

పాపారావుగాడిని దగ్గరకు చేరనివ్వకు. వాడుట్టి దగుల్బాజీ వెధవ అని తాతగారెంత నచ్చ చెప్పాలని ప్రయత్నించినా బాబూరావు వినలేదు

ఒకసారి శర్వాణి ఇదే మాట చెప్పబోతే "ఓహో నువ్వు కూడా నాకు నీతులు చెప్పేంత గొప్పదానివయ్యావా?

ఇంకెప్పుడూ ఇలాంటి అధికప్రసంగాలు చెయ్యకు ఎక్కడుండే వాళ్ళక్కడుండండి " అని విదిలించాడు బాబూరావు

ఆ మాటల్లో శ్లేష నర్మం చేసుకున్న తాతగారు తిరిగి తనుకూడా కొడుకుతో డైరెక్టుగా అనిపించుకోటం ఇష్టంలేక ఇహ ఆ ప్రసక్తి తేవటం మానేశారు

* * * * * *

బాబూ రావుకు కొడుకు పుట్టాడు

ప్రణీత్ కుటుంబం తప్ప మిగతా అందరూ బారసాలకు ఆహ్వానింపబడ్డారు మంత్రిగారి కొడుకును చూడ్డానికి అంతా ఆడంబరంగా బయల్దేరారు

ప్రణీత్ ఈ విషయానికి ప్రాధాన్యతనివ్వకపోయినా మంజీరకు మాత్రం చెప్పలేనంత బాధగా అసంతృప్తిగా అనిపించింది తల్లినీ, తమ్ముడినీ చూడాలనే కోరిక ఆమెను నిలవ నివ్వటంలేదు

తండ్రిని క్షమించమని కోరుతూ పరిపరివిధాల బ్రతిమాలుతూ ఒక్కసారి తనను రానివ్వమని అర్థిస్తూ ఉత్తరం రాసిపంపింది

'ప్రణీత్ ఊరి వ్యవహారాల్లో కలిగించుకోకుండా ఉంటే రాజకుమార్‌తో తెగతెంపులు చేసుకునివచ్చి తమ వర్గంలో చేరిపోతే మంజూ తన ఇంటికి రావటానికి అభ్యంతరమేంలేదని " బాబూరావు కబురంపాడు

ఆ కబురు తెచ్చింది పాపారావు

ప్రణీత్, వెంకట్రామయ్య ఇంట్లోలేని సమయం చూసివచ్చాడు పాపారావు

అమ్మాయ్!' ఎలా ఉన్నావమ్మా?' అంటూ వచ్చిన పాపారావుని సంభ్రమంగాచూసి రాబాబాయ్! కూర్చో నాన్నగారేమన్నా చెప్పమన్నారా?' అన్నది మంజీర ఆత్రంగా

అతన్ని చూడగానే తన పుట్టింటి బంధువును చూసినంత సంతోషం కలిగిందామెకు

'బాగున్నావామ్మా!' ఆప్యాయంగా అన్నాడు పాపారావు

బాగానే ఉన్నాను అమ్మా, తమ్ముడూ ఎలా ఉన్నారు? అన్నది మంజీర

"లక్షణంగా ఉన్నారు తల్లీ, మీ అమ్మ నిన్నేకలవరిస్తూ కంటికీ మంటికీ ఏకధారగా విలపిస్తోంది

ఆ మాట వినగానే మంజీర కళ్ళలోకి నీళ్లొచ్చాయి

పిచ్చితల్లీ ఎందుకమ్మా మీలో మీకీ కలతలు! నాన్న నీకో విషయం చెప్పమన్నాడు. అంటూ బాబూరావు కబురు ఆమె కందించాడు పాపారావు

అయినా మంజూ మీ నాన్నకి సంబంధించిన గొడవలు ఆయనకీ ఉంటాయి రాజకుమార్‌కీ మీ నాన్నకీ ఉన్న శతృత్వం నీకు తెలుసుగదా! మొదట మీ నాన్నను అర్థాంతరంగా పదవి నుంచి అన్యాయంగా ఊడబెరికింది రాజకుమార్ తండ్రే అలాంటప్పుడు తన పదవిని కాపాడుకోవాలనీ శతృవును దూరంగా ఉంచాలనీ మీ నాన్నకుండదా?

ఎవరికుండే లొసుగులు వాళ్ళకున్నాయి

పోలిగాడిని లాకప్‌లో వేసి మీ ఆయన వాడిని చచ్చేలా బాదలేదా? ఇరవై నాలుగ్గంటల్లో కోర్టులో హాజరు పరచకుండా వాడిని కొట్టే అధికారం మీఆయన కెక్కడిది? అన్నీ న్యాయబద్ధంగానే చేస్తున్నాడా మీ ఆయన?

గూడెం వాళ్ళందర్నీ ఉసిగొలిపి నాగులుగాడిని చచ్చేలా తన్నించలేదా? రాజకుమార్ ఆడమన్నట్టల్లా మీ ఆయన ఆడుతుంటాడు ఇంట్లో

# రచయిత్రి జవాబులు

### సులోచన బండారు, ఔరంగాబాదు

ప్ర : బాబూరావు లాంటి మినిస్టర్‌ను మంజీరకు తండ్రిగా ఇచ్చి ప్రణీత్ మంజీరల ప్రణయ గాథను విరహగాథ చేసి మాలాంటి పాఠకుల మూడ్ ఆఫ్ చేశారు.

జ : ఇప్పుడు మళ్ళీ 'ఆన్' అయి ఉంటుందను కుంటాను.

### ఎస్. వి. శ్రీనివాసరావు, నందిగామ

ప్ర : అనాదిగా జరుగుచున్న వరకట్న దురాచారం గురించి రచయిత్రిగా మీరేం సలహా ఇస్తారు?

జ : ప్రేమించటానికి ఎవరి పర్మిషనూ అక్కర్లేదు గానీ పెళ్ళి చేసుకోటానికి మాత్రం తల్లిదండ్రుల పర్మిషన్ కావాలి అనుకునే హిపోక్రసీ అబ్బాయిల లోనూ..... కట్నం తీసుకోలేదు కాబట్టి ఇతనిలో ఏదో లోపం ఉండి ఉంటుంది అనే అనుమానం అమ్మాయిలలోనూ.... కోడలు కట్న కానుకలు తేక పోతే తమ డిగ్నిటీకి భంగం అనే దురభి ప్రాయం అత్తగార్లలోనూ వేళ్ళు పాతుకుని ఉన్నంత వరకూ ఈ దురాచారం ఇలా వర్ధిల్లుతూనే ఉంటుంది.

మీ లాంటి యువకులు సలహాలు అడగటం మానేసి స్థిరమైన నిర్ణయాలు తీసుకోటం ప్రారంభిస్తే పరిస్థితి కొంత మెరుగు పడొచ్చు.

### జి. వి. రమణ, కంభం

ప్ర: ప్రణీత్ పాత్ర ద్వారా మీరు యువతరంలో శీలాన్ని, నిజాయితీని పెంపొందించటానికి కృషి చేస్తున్నారని నేనంటాను. మరి... మీరేమంటారు?

జ: మీ అభిప్రాయం సరైనదే అంటాను.



### ఉత్తమ ప్రశ్న

### పి. రాము, గుంటూరు

ప్ర: రచయిత(త్రు)లు తెలుగులో నవలలు రాస్తూ ఇంగ్లీషు కొటేషన్స్ వాడుతుంటారు. అంటే... తెలుగులో మంచి కొటేషన్స్ లేవనా? లేక... నిషిద్ధమా?

జ: పరాయి వారిమీద ఉండే ఆకర్షణ మన వారిమీద లేకపోవటం అనేది మనకు అనాదిగా వస్తున్న సంప్రదాయమేగా!

### గరిగనర్సయ్య, రామకృష్ణపూర్

ప్ర : "ఒడిలో చెలి మోహనరాగం" సీరియల్ మీరు ఊహించి రాశారా? లేక ఏదైనా జరిగిన సంఘటన ఆధారంగా రాశారా?

జ : నేను ఏ సీరియల్ రాసినా జరిగిన... జరుగుతున్న సంఘటనల ఆధారంగానే రాస్తాను. కేవలం ఊహ మీదే ఎప్పుడూ ఆధారపడి రాయను.

### కంచిపాటి సత్యనారాయణ, రావికమతము

ప్ర : ప్రస్తుత రాజకీయాల మీద మీ అభిప్రాయం?

జ : సదభిప్రాయం మాత్రం లేదు. కాకపోతే... గతంలో కన్నా ప్రజలలో రాజకీయ చైతన్యం ఎక్కువయింది.

ప్ర : 'ఒడిలో చెలిమోహన రాగం' తర్వాత?

జ : డి. ఎస్. పి. విజయ్!

### టి. హరిప్రసాదరాజు, బోధన్

ప్ర : మీ "ఒడిలో చెలి మోహనరాగం"లో కుటిల రాజకీయాలకు చక్కగా అద్దంపట్టారు. ఈ ప్రజలలో ఎప్పటి కయినా నవ చైతన్యం వచ్చి అలాంటి రాజకీయ వేత్తలకు బుద్ధి చెప్పే రోజు వస్తుందంటారా?

జ : రావాలనే నేనూ కోరు కుంటున్నాను.

### వై. సునీతాదేవి, బుచ్చినాయుడుఖండ్రిక

ప్ర : మీ మొదటి నవల ఏది?

జ : "అనురాగ సంగమం". □

కూచున్నదానివి నీ కివన్నీ ఏం తెలుస్తాయమ్మా!

అల్లుడిమీద ఆ మాత్రం ఆశపెట్టుకోటం మీ నాన్న తప్పా? కనిపెంచిన కూతురు తన అధికారాన్ని మన్నించలేదనే ఆవేశంతో అప్పుడు మీ నాన్న ఏదో అని ఉండవచ్చు. ఇప్పుడు తనే రాజీపడుతున్నాడుగా? తన అల్లుడు తనను కాదని తన శత్రువును బలపరచటం ఆయనకు బాధ కలిగించదా? నువ్వే ఆలోచించు మంజూ!

ఎలాగైనా మీరూ మీరూ ఒకటి. మీ ఆయన్ను మార్చటానికి ప్రయత్నించు. మీ మధ్యలో పాపం! ఆ పిచ్చితల్లి శర్వాణి నలిగిపోతోంది. కొడుకు పుట్టాడనే సంతోషంకన్నా నీ మీద బెంగ ఎక్కువగా ఉందామెకు.

నీకు మాత్రం మీ వాళ్ళ మధ్య సంతోషంగా తిరగాలనిలేదూ? నీ మొగుడిని మీ నాన్న మాట వినమను. ఇంటల్లుడిగా అక్కడ మర్యాదలందుకోమను. మీ ఇద్దరూ కలిసొచ్చి వాళ్ళకు కన్నులపండుగ చెయ్యండి.

అయినవాళ్ళని కాదని... కానివాళ్ళవెంట ఎందుకీ పరుగులూ! మీ ఆయనకు నీ మీద పిచ్చిప్రేమ కాబోలు నీ మాట వినడా? నీ సంతోషం కోసం ఆ మాత్రం చెయ్యడా? తన కీర్తి కాంక్ష, అందరూ తనను మంచివాడుగా పొగడాలనే తహ తహ తప్ప నీ గోడు వినిపించుకోడా?" అంటూ అనేక విధాలుగా మంజీరకు బ్రెయిన్‌వాష్ చేశాడు పాపారావు.

"చెప్పి చూస్తాను." అన్నది మంజీర.

"చెప్పి చూడ్డంకాదు. ఒప్పించాలి. నువ్వు అతనికోసం అందర్నీ కాలదన్నుకుని రాలేదూ? నీ కోసం అతనీమాత్రం చెయ్యడా? నువ్వు సంతోషంగా ఉంటటం ప్రధానమా. . అతని స్వార్థమే ప్రధానమా!

ఈ దెబ్బతో తేల్చేసుకో " అంటూ అన్నిపాయింట్లూ అందించి మరీ వెళ్ళాడు పాపారావు.

తమ ఇంట్లోనుంచి వస్తున్న పాపారావుని చూడగానే కామేశ్వరి మొహం అప్రసన్నంగా మారిపోయింది.

"ఈ గుంటనక్కగాడికిక్కడేం పని? ప్రణీత్ సంసారంలో నిప్పులు పొయ్యటానికొచ్చాడా?"

పాపారావు రాక కామేశ్వరి కిష్టంలేదు....

మంజీరకు పాపారా వెక్కించిన విషం కొద్ది కొద్దిగా తలకెక్కుతోంది. పుట్టింటి మీదున్న మమకారం ఆమెలో ఉండే విచక్షణా జ్ఞానాన్ని హరించి వేస్తోంది..

ఆమె మనసిప్పుడు తండ్రినే సపోర్ట్ చేస్తూ ప్రణీత్ చర్యల్ని తప్పుబడుతోంది. తన తండ్రి రాజీపడ్డాడు. ఇహ అంతా ప్రణీత్‌లోనే ఉంది.... తామంతా ఒకటి కావటమనేది అతని చేతుల్లోనే ఉంది. అనుకుంటోంది. ఇంతకన్నా విశాలంగా ఆలోచించగల వయసు మంజీరకులేదు. ఆమెకు నిండా పద్దెనిమిదేళ్ళు కూడాలేవు!

"పాపారావెందుకొచ్చాడు?" అన్నది కామేశ్వరి.

"నన్ను చూసి వెడదామని వచ్చాడు." అన్నది మంజీర.

"వాడీ ఇంటికి రావటం ప్రణీత్ కిష్టముండదు."

"ఆయనకీ సంగతెవరు చెపుతారు? మీరు చెపుతారా?"

"వాడికిష్టంలేని పనిని దొంగతనంగా మనమెందుకు చెయ్యాలి?"

"అందుకని? ఇంటికొచ్చిన మనిషిని గెంటియ్యాలా?

పాపారావు నా పుట్టింటి తరుపు మనిషి. నేనెలా ఉన్నానని చూసిపోవాలని వచ్చాడు."

"పాపారావు ప్రభావం ఈ అమ్మాయి లో అప్పుడే మొదలయింది." అనుకుంటూ ఆ విషయాన్నంతటితో వదిలేసింది కామేశ్వరి. కానీ.. ఈ పాపారావిలాగే పదేపదే వచ్చి, ఈ పిల్ల మనసు సాంతం విరిచెయ్యడుగదా? దీన్నెలా ఎదుర్కోవాలి? అనే భయం ఆమెను వదిలిపోలేదు.....

(ఇంకా ఉంది)



14 ఏళ్ళు ఏకాంతంలో కృషి సలిపి సృష్టించిన అపూర్వ కళాఖండం. ఇరానీ తివాసీ.

# అద్భుత ఇరానీ తివాసీ

ఇది 172 ఏళ్ళ క్రిందటి మాట. ఆ రోజు ఇరాన్ షా (చక్రవర్తి) యువరాజు, నగర ప్రముఖులు, ఒక మధ్య వయస్కురాలు, ఆమె పదహారేళ్ళ కొడుకు ఆ భవంతి ద్వారం వద్ద వేచి ఉన్నారు. ఇంతలో భవంతి ద్వారాలు తెరుచుకున్నాయి. దట్టంగా గెడ్డం, మీసాలు గల ఒక పల్చని వ్యక్తి బైట అడుగు పెట్టాడు.

షా ముందుకు నడిచి అతడితో, "జాఫర్, నా రాజ్యమంతా నీ కళతో సరితూగలేదు సుమీ. అని పలకరించి అతణ్ని కౌగలించుకుని అభినందించాడు. తర్వాత మిగతావారు అతణ్ని అభినందించారు. ఆ స్త్రీ కళ్ళంట ఆనంద బాష్పాలు ధారలు కడుతున్నాయి. ఆ వ్యక్తి ఆర్ద్రనయనాలతో ఆ స్త్రీని పలుకరించాడు.

"ఇదిగో ఇతడు మన అబ్బాయే" అని ఆమె ఆ కుర్రాణ్ని అతడికి పరిచయం చేసింది. అతడు ఆవేశంతో ఆ కుర్రాణ్ని కౌగలించుకుని ఆప్యాయంగా జుత్తు నిమిరాడు

ఆ వ్యక్తి మొహమ్మద్ బిన్ జాఫర్ అనే విశ్వ ఖ్యాతి గాంచిన తివాసీ నేతగాడు. అతడు పధ్నాలు గేళ్ళు పదహారుగురు తోటి నేతగాళ్ళతో ఆ భవంతిలో బంధితులై రాత్రింపగళ్ళు కృషి సలిపి ఒక అపూర్వమైన తివాసీని సిద్ధం చేసి ఇరాన్ షాకు బహూకరించాడు. అతడు ఈ రోజే తాను పూనుకున్న పనిని పూర్తి చేసి స్వేచ్ఛావాయువును పీల్చుకుంటున్నాడు. ఈ పధ్నాలుగేళ్ళలో అతడి దృఢకాయం శుష్కించి శల్యమైంది. గెడ్డాలు, మీసాలు సంస్కార విహీనంగా బలిసాయి. కాని అతడి మొహంపై విజయగర్వం తాండవ నృత్యం చేస్తోంది.

ఆ తివాసీని చూస్తేనే కాని దీని కళా సౌందర్యాన్ని ఆస్వాదించడం అసాధ్యం. ఆ తివాసీలో యూసా, ఏసు ప్రభువు, జరథుస్త్ర మొదలగు ప్రవక్తలు, అలగ్జాండర్, ఛంగిజ్ ఖాన్, బాబర్, అక్బర్, రాణా ప్రతాప్, నెపోలియన్ మొదలగు చారిత్రిక వ్యక్తుల చిత్రాలు నేతలో అంకితమై ఉన్నాయి.

ఆ తివాసీ ప్రస్తుతం గ్వాలియర్‌లో మహారాజా జీవాజీ రావ్ సింధియా మ్యూసియమ్‌లో భద్రపరిచి ఉంది. ఈ మ్యూసియమ్‌లో అనేక ఆసక్తికరమైన వస్తువులు ఉన్నాయి. వాటిలో డైనింగ్ టేబిల్ మీద నడుస్తూ అతిథులకు వంటకాలను సరఫరా చేసే చిన్న వెండి రైలు బండి కూడా ఉంది. సుమారు 65 ఏళ్ళ క్రితం ఇంగ్లీషు యువరాజు ఎనిమిదవ ఎడ్వర్డ్ సన్మానంలో తాను జరుపుతున్న విందులో అప్పటి గ్వాలియర్ మహారాజా ఈ రైలు బండిని యువరాజు ప్రక్కగా కూర్చుని మీట ద్వారా నడుపుతున్నాడట. అకస్మాత్తుగా పొరబాటు వలన వెండి రైలు బండి తిరగబడి దాంట్లో తినుబండారాలు ముఖ్య అతిథి, ఇతర అతిథులపైన పడగా గందరగోళం జరిగిందట. మ్యూసియమ్‌లో ఇంతేకాక అక్బర్, ఔరంగజేబు పాదుషాల ఆయుధాలు, రాణాప్రతాప్ బల్లెం, ప్రపంచంలో అతి విశాలమైన షాండలీర్ (కప్పుకు వ్రేలాడ దీసే కొమ్మలు గల గాజు సెమ్మె) మొదలగు వస్తువులు ఉన్నాయి. ఐతే వీటన్నిటి కంటె ఆశ్చర్యకరమైనది ప్లాస్టిక్ తొడుగులో గోడకు వ్రేలాడుతున్న ఈ తివాసీయే.

ఈ తివాసీలో సాటిలేని నేత కళ ఉంది. ఐతే అంతకంటె ఆసక్తి కరమైనది దీని తయారీ కథ. 1799లో జాఫర్ అప్పటి ఇరాన్ షా దర్బారులో హాజరయి సలామ్ చేశాడు. అతడు ఏమనిషి చిత్రాన్నైనా జీవకళ ఉట్టి పడేలా తివాసీలో నేయగలిగే వాడని ప్రతీతి. ఇది వరకు అతడు ఇరాన్‌కు చెందిన ప్రసిద్ధ వ్యక్తుల చిత్రాలను తివాసీలలో నేసి షా నుంచి మన్ననలు బహుమానాలు అందుకుని ఉన్నాడు. షా జాఫర్‌ని పలకరించి "ఏమిటి ఇలా వచ్చావు?" అని అడిగాడు.

"ఏం లేదు. మహాప్రభూ! నా జీవితానికి తలమానికమైన ఒక అద్భుత తివాసీని నేయాలని

నిశ్చయించు కున్నాను. ఈ తివాసీలో ప్రపంచంలో ప్రముఖ వ్యక్తుల చిత్రాలను నేయదలిచాను". అని జాఫర్ బదులు చెప్పాడు.

"భలే యోచన. మా దర్బారు నీకు అవసరమైన సదుపాయాలన్నీ సమకూరుస్తుంది ఏమి కావాలో చెప్పు".

"దీన్ని నేను పదహారుగురు నేతగాళ్ళ సహాయంతో నిర్జనమైన స్థలంలో నేస్తాను. అది పూర్తి చేయడానికి 15 ఏళ్ళు పట్టవచ్చు. ఐతే ఈ 15 ఏళ్ళలో నేత గాళ్ళు బైటకు రాకూడదు. కావలిస్తే వారి కుటుంబీకుల వాళ్ళను కలుసుకో గలరు. నేను మాత్రం ఎవరినీ కలవను".

"ఆశ్చర్యంగానే ఉంది. అది సరే కాని నీ పెళ్ళయి మూడేళ్ళగా అయింది. 15 ఏళ్ళు నువ్వు వేరెగా గడపగలవా?

"ఈ జీవితం క్షణ భంగురమే కదా, మహాప్రభు ఇరానీ తివాసీ నేత గాళ్ళ అపూర్వ కళకు నిదర్శనంగా శాశ్వతంగా నిలిచిపోయే ఒక అసమాన కళాఖండాన్ని సిద్ధం చేయదలిచాను. కళా పోషకులైన ఏలిన వారి అండదండలతో నేను ఈపనిని దిగ్విజయంగా పూర్తి చేయగలనని నమ్ముతున్నాను".

"నువ్వు అలాంటి కళాఖండాన్ని సృష్టిస్తానంటే నాకు మాత్రం మరేమిటి కావాలి నీకు, నీ తోటి కళాకారులకు, మీ కుటుంబాలకూ ఏ లోటూ రాకుండా చూసే బాధ్యత మా దర్బారుదే. ఐనా నువ్వు ఈ పనికి ఎంత మూల్యం చెల్లిస్తున్నావో తెలుసుకుని ఈ పనిని చేపడితే బాగుంటుంది", అని హెచ్చరించాడు షా జాఫర్ సడలలేదు.

"సరే అన్ని ఏర్పాట్లు చేయిస్తాను", అని షా ఆదేశాలు జారీ చేశాడు. రాజు గారు తలుచుకుంటే దెబ్బలకేమి కొరత అన్నట్టు షా ఆదేశాను సారం ఒక నిర్జన మైన ప్రదేశంలో ఒక విశాలమైన భవంతిలో తివాసీ నేతకు ఏర్పాట్లు జరిగాయి. దానికి తోడు నేతగాళ్ళ కుటుంబాల పోషణకు తగిన సదుపాయాలు కల్పించ బడ్డాయి నేత పనిలో అంతరాయం కలగకుండా భవంతి బైట పారావాళ్ళు నియమించబడ్డారు ఇరాన్‌లో అంతా ఈ వింత తివాసీ గురించే చర్చించసాగారు.

1799 అంత మవుతూండగా జాఫర్, అతడి తోటి కళాకారులు భవంతిలోకి ప్రవేశించారు. జాఫర్ భార్య షాహిదా బేగమ్‌కు వీడ్కోలు చెప్పి తన చిన్నారి కొడుకు నజీర్ బిన్ మొహమ్మద్‌ని చివరి సారి ఎత్తుకుని ముద్దు పెట్టుకుని భవంతి ద్వారంలోకి అడుగు పెట్టాడు. ద్వారం తలుపులు మూసుకున్నాయి. ఐదేళ్ళ వరకు జాఫర్ తోటి నేత గాళ్ళు ఏకాంతంలో పని సాగించారు కాని ఇహ వారు తమ కుటుంబాలకు, మిత్రులకు వేరుగా ఉండలేమని ప్రకటించారు అప్పుడు జాఫర్ ప్రతి రెండు నెలలకు నలుగురేసి నేత గాళ్ళకు ఐదు రోజుల పాటు సెలవు ఇవ్వ సాగాడు. కాని అతడు మాత్రం తివాసి పూర్తి అయే వరకు భవంతి బైటకు అడుగు పెట్ట లేదు

1814లో జాఫర్ అవిరళ కృషి ఫలించింది. అతడు సృష్టించిన పదహారు అడుగుల పొడవు, తొమ్మిది అడుగుల వెడల్పు గల ఆ అపూర్వ తివాసీపై 185 చక్రవర్తులు, ప్రవక్తలు, ప్రముఖుల చిత్రాలు నేసి ఉన్నాయి. ఆ కాలంలో ఇంకా ఫొటోగ్రఫీ కనుగొనబడలేదు ఐనా ఆ చిత్రాలలో మంచి ఫొటో గ్రాఫులంత జీవకళ ఉట్టి పడుతోంది.

ఈ తివాసీలో ఒక చోట 'తివాసీ పై అలగ్జాండర్ కూర్చున్నా తన అదృష్టానికి మురిసి పోతాడు" అని ఫార్సీలో ఉంది అలాగే 'ఈ తివాసీ వెల భూమ్యాకాశాలతో సమానం" అని ఉంది అడుగున చిన్న ఫార్సీ అక్షరాలలో మొహమ్మద్‌బిన్ జాఫర్ అని ఉంది తివాసి అంచులలో చక్రవర్తులు, ప్రముఖుల పేర్లు, మధ్యన వాళ్ళ చిత్రాలు ఉన్నాయి. తివాసీ మధ్య హారం లాంటి వలయంలో మరికొంతమంది, చారిత్రాత్మక వ్యక్తుల చిత్రాలు, పేర్లు ఉన్నాయి. ఇవన్నీ తివాసీలో నేసే ఉన్నాయి. ఐతే తివాసీలో తివాసీ నేయించిన షా పేరు మాత్రం లేదు.

జాఫర్, అతడి తివాసీ ఖ్యాతి ప్రపంచమంతా వ్యాపించింది. ఫ్రాన్సు చక్రవర్తి నెపోలియన్ బోనాపార్టే దాని గురించి విని దాన్ని సంపాదించ డానికి ఒక ప్రతినిధి మండలిని ఇరాన్ షా వద్దకు పంపాడు. షా ప్రతినిధి మండలిని ఆ తివాసీని మీ చక్రవర్తి ఏమి చేస్తాడని అడగ్గా "వారు దాని మీద కూర్చుని దాని గౌరవాన్ని పెంపొందిస్తారని" అని నెపోలియన్ దానిపై కూర్చోవడం వలన దాని వెల మరింత వృద్ధి చెందుతున్న భావంతో బదులు చెప్పారు.

'అది తివాసీ ఐనా అది కూర్చోదగినది కాదు. అది శిరస్సుపై పెట్టు కోదగ్గది" అని చెబుతూ, "ఆ తివాసీకి ఎంత ధర ఇచ్చినా ఇచ్చేది లేదు,' అని ప్రతినిధి మండలిని తిరిగి పంపాడు షా.

1858లో జాఫర్ మరణించాడు., 1860లో గ్వాలియర్ మహారాజు జీవాజీరావ్ సింధియాకు ఆ అద్భుత తివాసీ విషయం తెలిసి దాన్ని సంపాదించి తీసుకు రావడానికి ఒక ప్రతినిధి మండలిని అప్పటి ఇరాన్ షా వద్దకు పంపించాడు. "ఐతే మీ మహారాజా వారు దానిపై కూర్చుని తమ కోరిక నెరవేర్చు కుంటారా?" అని షా మండలిని అడిగాడు.

"కళా రాధ కులైన మా మహారాజు ఆ కళాఖండానికి కలలో కూడా అటువంటి అపచారం చేయలేరు దాన్ని వారు ఎంతో పవిత్రంగా, ఆదరంగా చూచుకుంటారు. అటువంటి కళాఖండం వారి దర్బారులో ఉందని గర్విస్తారు," అని ప్రతినిధి మండలి సభ్యులు షాకు చెప్పారు. గ్వాలియర్ మహారాజుకు ఆ తివాసీ సొంత దారు అయే అర్హత ఉందని తెలుసుకుని షా దాన్ని ప్రతినిధి మండలికి బహూకరించాడు జీవాజీరావ్ సింధియా జయ విలాస్ పాలెస్ కట్టించి దాంట్లో తివాసిని ఉంచి రోజూ దాన్ని తిలకించేవాడట అది వంశ పారంపర్యంగా అదే పేరు గల జీవాజీరావ్ సింధియాకు సంక్రమించింది అతడు చనిపోయాక అతడి భార్య మహారాణి విజయరాజే సింధియా 1964లో జీవాజీ రావ్ సింధియా మ్యూసియమ్ నెలకొల్పి గ్వాలియర్ రాజవంశానికి చెందిన ఇతర అద్భుత వస్తువులతో పాటు తివాసిని కూడా ప్రదర్శనకు పెట్టించింది □

## గడుసులోకం —బాబు






## కార్టూనిస్టులకు సూచనలు!

★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి

★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.

★ వ్యంగ్య చిత్రాలు స్పష్టంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి!

★ వ్యాఖ్య చిన్నదిగా క్లుప్తంగావుండాలి అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి! కార్టూన్ మీద పేరూ వూరు అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.

★ సొంత చిరునామా గల తపాలాబిళ్ళలు అంటించిన కవరుగల కార్టూన్‌లను తిప్పిపంపడంజరుగుతుంది దారిలో పోయేవాటికి మా బాధ్యతలేదు.

★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది పరిశీలనా ఐదారువారాలు పట్టవచ్చు.

★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.

★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.

★ మా కార్యాలయానికి స్వయంగావచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులంటించిన కవరు జతవేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

— సం॥

# వారఫలం

30-1-1987 శుక్రవారం మొదలు
5-2-1987 గురువారం వరకు

★ **మేషం :** అయినవారు మేలు చేయనున్నారనుకోటం పొరబాటు. పరిచితుల వలన ధనలబ్ధి. ఉత్తముల స్నేహం లభ్య మవుతుంది. ప్రసిద్ధుల పరిచయం ఉంటుంది. స్త్రీలకు, సాహితీ రంగాన ప్రసిద్ధులకు, పత్రికా విలేఖరులకు మేలైనవారం.

★ **వృషభం :** ధనార్జన నిమిత్తం చాల మంది దూర ప్రాంతాలకు పోగలుగుతారు. కృషి లోపం లేకపోతే ఒకటి రెండు రంగాలలో మేలున్నది. అపకారు లెవరో గుర్తించి మెలగడం అవసరం. స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు అవకాశం. ఉద్యోగ యత్నాలు ఫలించటం

★ **మిధునం :** డబ్బుకు తాపత్రయ పడనవసరంలేదు. వారఫలం ఉత్తమంగా ఉండటం గమనించ గలుగుతారు. వ్యర్థపు టాలోచనలతో వారం గడపకండి. కొందరకు వస్తు సేకరణకు తగిన డబ్బు అందుతుంది. స్త్రీలకు : కళారంగావకాశాలున్నాయి. అంతో యింతో ఆదాయమున్నది.

★ **కర్కాటకం :** అవసరాలకు ద్రవ్యం అందుతుంది. మీ మూలంగా ఇతరులకు కష్టం కలిగే ప్రమేయ ముంటుంది. స్థిరాస్తి పెంపు చేసే అవకాశమున్నది. గ్రహించి మెలగండి. వ్యాపారానుకూలత గల వారం. సుఖ శాంతులకు లోపంరాదు. స్త్రీలకు: దూరభారాలకు పోగల అవకాశాలుంటాయి.

★ **సింహం :** నూతన వ్యక్తుల పరిచయం అనర్థదాయకం. అలాంటి, వ్యవహారాలలో చిక్కుకోకండి. వస్తు విక్రేతలకు విజయవంతమైన వారం. శుభ కార్యాలో చనలు కొందరకు చెప్పవచ్చు. విధి నిర్వహణలో ఏమరుపాటు తగదు. స్త్రీలకు : ప్రయాణాలు సాగటం, తద్వారా ఆదాయం.

★ **కన్య :** అనవసర వ్యవహారాలలో జోక్యం అనవసరం. అలాంటి గ్రహస్థితి ఉన్నది. సులభ సుందరంగా ఒకానొక వ్యవహారం సానుకూల మవుతుంది. కొంత అనారోగ్యత కూడా కొందరకు చెప్పవచ్చు. రాజకీయంగా తిరుగాడే వారికి ఎలాంటి అనుకూలతలేదు. స్త్రీలకు: కళారంగావకాశాలున్నాయి గమనించి మెలగండి.

★ **తుల :** స్థితియందు పెంపు వున్నది. ధనాదాయమున్నది. 'శని గ్రహ' సహాయ మున్నది. అధికారమందు అభివృద్ధి, సుఖశాంతులు, కుటుంబానందానికి అవకాశమున్నది. స్త్రీలకు . చిత్ర, కళారంగావకాశాలుంటాయి, గమనించండి.

★ **వృశ్చికం :** అధికారుల వలన జరగవలసిన పనులు ఈ వారంలో సానుకూల మవుతాయి. ఉద్యోగమందు సదవకాశా లుంటాయి. అప్రయత్న ధనలబ్ధి. స్త్రీలకు . నగలు కొనుగోలు చేసే అవకాశాలుంటాయి. కొందరకు గృహ వసతి ఏర్పడవచ్చు. గమనించి మెలగండి.

★ **ధనుస్సు :** హాయి ఎక్కండని అనందిస్తారు. వ్యాపారం బాగా సాగిందని సంతోషిస్తారు. యత్న కార్య విజయం లభ్యమైనదని ఉబలాట పడతారు. అధిక విద్యా యత్నాలుంటాయి. లాభదాయక వారమే. స్త్రీలకు : విందు వినోదాలతో, పత్రికా గౌరవం కొందరకు చెప్పవచ్చు.

★ **మకరం :** విద్యా విషయంగా పెంపు గలవారం. వ్యాపారం సానుకూలం అగుటకు అవకాశం. వృత్తియందు పెంపు చేకూరుటకు తగిన ప్రోత్సాహం, సాహితీ రంగాన మేలు చేకూరటం గమనించదగిన అంశాలు. ఆదాయమున్నది. అనుకూల వార్త లందుతాయి. స్త్రీలకు: ఇల్లు మారటం, లేక నూతన గృహ వసతి ఏర్పడటానికి అవకాశాలుంటాయి.

★ **కుంభం :** వస్తు సేకరణకు, లాభసాటి వ్యాపారానికి అనుకూల సమయం. సుప్రసిద్ధులతో స్నేహానికి అవకాశమున్నది. వివిధ రంగాలలో పరిశ్రమించే వారికి అనుకూలం. స్థిరచరాస్థులు పెంపొందించుకొనే అవకాశమున్నది. స్త్రీలకు· గాయనీ మణులకు, చిత్ర రంగ పరిశ్రమలో పరిభ్రమించే వారికి అనుకూలం. గమనించాలి.

★ **మీనం :** చాల కాలంగా తాపత్రయపడిన వ్యవహారం వారాంతంలో సానుకూలం కాగలదు. వ్యాపారం చేసేలాగైతే మీకు మేలున్నది. కృషి లోపం లేకుండా డబ్బు చిక్కుతుంది. కొందరకు 'ఆకాశవాణి'లో అవకాశాలున్నాయి. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా చేసిన యత్నాలు సానుకూలం.

—విద్వాన్ కోట సత్య రంగయ్య శాస్త్రి

# ప్రతీకారం

## యర్రగుంట్ల వరలక్ష్మీదేవి

భీమారావు హౌరాకు పోయే మెయిల్లో తెనాలి నుండి ప్రయాణం చేసి విశాఖపట్నంలో మధ్యాహ్నం సుమారు రెండు గంటలకు దిగేడు, చేతిలో చిన్న సూటుకేసుతో. స్టేషను బైటకు రాగానే నాలుగు ప్రక్కలా ఓ సారి చూసి రిక్షాలున్న స్థలానికి వచ్చేడు.

"అయ్యా! రిక్షా కావాలా?"

"చూడు – నేను ఏదైన లాడ్జికి పోవాలి. దగ్గరలో ఏవైన మధ్య తరగతి లాడ్జీలున్నాయా?"

"లేకేం – ముందు రిక్షా ఎక్కండి. నేను తీసుకు వెళ్తా".

రిక్షావాడు స్టేషనుకు రెండు ఫర్లాంగుల దూరంలో నున్న మురళి లాడ్జింగుకు భీమారావుని తీసుకుని వెళ్ళేడు.

"సింగల్ రూము కావాలి".

"చార్జి రోజుకు ఇరవై అయిదవుతుంది".

"ఫరవాలేదు – ఇవ్వండి".

"ఎన్నాళ్ళుంటారు?"

"ఒక్క రోజే".

"అయితే అడ్వాన్సు ఇరవై అయిదిచ్చి, ఈ పుస్తకంలో మీ వివరాలు రాసి సంతకం చేయండి", అని లాడ్జి మేనేజరు పుస్తకాన్నిచ్చేడు.

అందులో –"కె. కృష్ణమూర్తి, రామమందిరం వీధి, విజయవాడ, వృత్తి వ్యాపారం", అని రాసి సంతకం చేసేడు భీమరావు.

భీమరావు ఒడ్డు, పొడవు, నిటారుగ నడిచేరీతి, మెలిత్రిప్పిన ఆ మీసాన్ని చూసి ఏ మిలిటరీ వాడో అనుకున్నాడు మొదట ఆ లాడ్జి మేనేజరు. అందుకే భీమారావు పుస్తకంలో రాసిన వివరాలను ఆశ్చర్యంతో చూసి, కాస్త తలపైకెత్తి భీమారావుని పరికించి 'దానికేంలే– మిలిటరీ వాడిలా ఉన్న వాడు వ్యాపారం చెయ్యొచ్చుగా' అని సర్దుకున్నాడు. భీమారావిచ్చిన పాతిక రూపాయల్ని అందుకుని అతనికి రూమునంబరు చెప్పి, రూము తాళా న్నిచ్చేడు.

భీమారావు రిక్షా వాడికి డబ్బులిచ్చి పంపించేసి, తాళాన్ని తీసుకుని మేడపైకి పోయేడు. వెంట రూము బాయ్ అతడి సూటుకేసుని తీసుకుని వచ్చేడు. గదిలోకి వచ్చేక రూము బాయ్‌కి రెండు సీసాలు చల్లని బీరు తెమ్మని చెప్పి, అక్కడున్న మంచంపై వాలేడు విశ్రాంతికి.

ఆ కుర్రాడు పది నిముషాలలో బీరు సీసాలు తెచ్చి టేబిలు మీద పెట్టి వెళ్ళి పోయేడు. భీమారావు లేచి గది తలుపు గడియ వేసి తన పెట్టిలో నుండి మేక్‌డవల్ విస్కీ సీసాను తీసి బీరుతో కలుపుకుని మెల్లగ త్రాగడం మొదలెట్టేడు ఏదో దీర్ఘంగ ఆలోచిస్తు.

మెల్ల మెల్లగ అతడి కళ్ళు మైకం వల్లనేమి, వృద్ధి చెందు తున్న క్రోధం వల్లనేమి ఎఱ్ఱ బడ జొచ్చేయి. తాపీగాలేచి పెట్టెలోంచి ఓ పెద్ద చాకును తీసి టేబిలు మీద పెట్టేడు. దానివైపే అదోలా చూస్తూ మరో అరగ్లాసు విస్కీ బీరు త్రాగి, ముందుకు వంగి ఆ చాకును విప్పేడు. ఆ కత్తి నాలుగు అంగుళాల పొడవు, అంగుళం వెడల్పుతో వాడికొనదేరుంది.

భీమారావు ఆ కత్తిని బిగువుగ పట్టుకుని కోపంగ చూస్తూ – "లంజ కొడకా నారాయుడా! ఒకే పోటుతో నిన్ను చంపేస్తారా", అని ఆ కత్తిని టేబిలు మీద గుచ్చబోయి అంతలోనే నిగ్రహించుకుని, మెల్లగ ఆ కత్తిని అలాగే టేబిలు మీద పెట్టేసేడు. కిటికీ లోంచి వస్తున్న కాంతిలో ఆ కత్తి పదును మెరుస్తూంది.

ఆసరికి త్రాగడం పూర్తయింది. అ కత్తిని తీసి ప్రేమగ ప్రియురాలిని తాకినట్లు ఆ పదునును వేలితో మృదువుగ తాకి, ఏదో ఆలోచన మదిలో మెదిలి చిరునవ్వుతో "నీకు నా వేలిరక్తం కాదు, ఈ రాత్రి నారాయుడి గాది గుండెలోని రక్తంతో అభిషేకం చేస్తా", అని తాపీగా ఆ చాకును మడచి పెట్టేసేడు.

తరువాత మైకంతో మంచం మీద వాలేడు. నిద్ర వచ్చినట్లే ఉంది గాని రావడం లేదు. అలా ఇటు అటు కాస్సేపు దొర్లేడు. మెల్లగ గత కాల స్మృతులు అతడ్ని పెనవేసుకున్నాయి.

* * * * * * *

భీమారావు నివాసం తండ్రి నాటి నుండి తెనాలిలోనే. భీమారావు తండ్రి నరసింహులు బ్రతికి చెడ్డరైతు. నరసింహులు అతడి తండ్రి నుండి సంక్రమించిన పదెకరాల పంట భూమిని సాగు చేసుకుని బ్రతుకుతుండేవాడు. కాని తన కాలంలో తన చేతకాని తనం వల్ల కొంత, దైవానుకూలత లేక కొంత, తన త్రాగుడు జూదంకు కొంత అలా ఆ భూమిని క్రమేపీ అమ్ముకుని ఆఖరిదశలో తెనాలి చేరేడు, ఓ చిన్న ఇల్లు అమ్మకానికి వస్తే కొనుక్కుని.

భీమారావు బాల్యం నుండి బలిష్టుడే. పైగ చురుకైనవాడు, బ్రతక కల్గిన నేర్పుకల వాడు. ఇరవై యేళ్ళకే తెనాలి బస్సు స్టాండు వద్ద ఓ కిళ్లీ బడ్డీ తెరచి ఆర్జించడం మొదలెట్టేడు. కాని కొన్నాళ్ళకు ఆ సంపాదన భీమారావుకి తృప్తిని కల్గించలేదు. ఆ సమయంలో ఓ మధ్య వయస్కుడు, దొంగతనంగ మద్యాన్ని అమ్మేవాడు తారసపడి రూపాయి సోడాలను అమ్మమని మంత్రోపదేశం చేసేడు. దొంగ బట్టీలలో తయారు చేసిన సారాని సోడా బుడ్లలో పట్టించి, రహస్యంగ కిళ్లీ బడ్డీల ద్వారా సోడా రూపాయి చొప్పున అమ్మించి లాభం చేసుకోడం అతడి వ్యాపారం.

భీమారావు ఆ వ్యాపారాన్ని చేపట్టిం తరువాత అతడి ఆర్జన బాగానే పెరిగింది. భీమారావు సారాని సేవించడం మొదలెట్టేడు. ఆ మద్య పానం మొదట సరదాకి, తరువాత అలవాటుగా, అటుపిమ్మట వ్యసనంగామారి భీమారావుని జలగలాపట్టుకుంది.

భీమారావుకి వయస్సు వచ్చేక, ఆ దగ్గరలో నున్న ఓ గ్రామం నుండి తెచ్చిన ఓ చక్కని చుక్కను ఇచ్చి అతడి తల్లి తండ్రులు వివాహం చేసేరు. పెండ్లి నాటిక ఆ పిల్ల ఇరవై యేళ్ళ వయస్సులో మంచి పొంకంగ నుండేది. భీమారావుకి భార్య మల్లమ్మంటే ఎంతో మక్కువ.

కాని ఆ మోజు ఎక్కువ కాలం నిలవలేదు. అతడికి మద్యం ఇచ్చిన మజా, మాధుర్యం భార్య ఇవ్వలేక పోతూందని అనిపించింది. సంవత్సరం కాపురం తరువాత శరీర తీటను తీర్చుకుందుకు భీమారావు ఆ చక్కని భార్యను బాగా త్రాగొచ్చి ఏదో నెపం పై కయ్యానికి కాలు దువ్వి కొట్టేవాడు. ఆ సంవత్సరమే తండ్రి నరసింహులు చనిపోయేడు. ఆ తల్లి జబ్బు మనిషైపోయింది. అప్పటికీ ముక్కుతు, మూలుగుతు ఇంట్లో ఏవో చిరుపనుల్ని చేస్తుండేది.

కొన్నాళ్ళ తరువాత ఓ ఉపద్రవ మొచ్చి పడింది. బస్సు స్టాండుని విస్తృత పరచే ఉద్దేశంతో మున్సిపాలిటీ వారు ఆ చుట్టూ ఉన్న కిళ్లీ బడ్డీల్ని, చిరుదుకాణాలను చాల మట్టుకు తొలగించేరు. వాటిలో భీమారావు బడ్డీ ఒకటి. చేసేదేమి లేక భీమారావు ఆ కిళ్లీ బడ్డీని, దూరంగనున్న ఓ సినీమా హాలు దగ్గర అయిదు వందలు ఖర్చు చేసి ఓ పెద్ద రౌడీ సహాయంతో ఓ చిన్న స్థలాన్ని పొంది, అక్కడ నిలబెట్టేడు.

కాని ఆ చోట రూపాయి సోడాల అమ్మకం బాగసాగలేదు. రోజుకి ఎంతో కష్టంపైన, అదిన్ని రాత్రి ఆట ముందరే ఓ నాలుగైదు సోడాలు అమ్ముడయేవి. దాంతో ఆ దొంగ వ్యాపారులు ఆ సోడాలను భీమారావుకి సరఫరా చేయడం మానివేసేరు. అప్పటికీ ఎలాగో ఆ కిళ్లీ బడ్డీ మీద వచ్చిన సంపాదనతో కాలం గడుపుకుంటు వచ్చేవాడు భీమారావు.

అట్లాంటి సమయంలో నారాయుడు వచ్చేడు అవనిగడ్డ గ్రామం నుండి. అతడు భీమారావు తల్లికి దూరపు బంధువు. తెనాలి రాగానే బస్సుస్టాండు వద్ద అతడికి తెల్సిన ఆ సామి ఒకడు టీ స్టాల్‌ని అమ్మేస్తే అది కొనుక్కుని వ్యాపారం మొదలెట్టేడు. భీమారావు తల్లి ఉనికిని తెల్సుకుని ఒక నాడి

ఉదయం వాళ్ళింటికి వచ్చేడు. ఆ మాటా ఈ మాటా అయినాక–

"పెద్దమ్మా! మరినీ ఆరోగ్యం బాగున్నట్లు లేదు, ఆసుపత్రికి వెళ్ళి చూపించుకో లేక పోయావూ?" అడిగేడు నారాయుడు.

"వైద్యాలు వైదూర్యాలు మరి నా కెందుకురా? కాలం మూడుతుంది. ఇకపైకి పోవడానికి దారి చూసుకోడమే", అని వేదాంతం వెళ్ళబుచ్చింది.

"పెద్దమ్మా – డబ్బు ఖర్చుకు జంకుతున్నావా? ఫరవాలేదు, నేను ఆ సంగతి చూసుకుంటాలే. బతికి నన్నాళ్ళు బాధలేకుండా ఉండాలిగా నాతో రేపురా తీస్కెళతా", అని వత్తిడి చేసేడు నారాయుడు.

"అయితే భీమన్నా నీ వ్యాపార మెలాగుంది?" అని కుశల ప్రశ్నలు వేసేడు.

భీమారావు నిట్టూర్పు విడచేడు. "ఏదో తిండికి వీధిన పడనవుసరం లేదు ప్రస్తుతానికి"; అని నిరాశతో మాట్లాడేడు.

మరో నెల్లాళ్ళు గడిచేయి. వారానికి ఓ సారైన నారాయుడు వచ్చి పోతుండేవాడు భీమారావింటికి. వట్టి చేతులతో వచ్చేవాడుకాదు. ఒచ్చి నప్పుడల్లా ఏవో బన్ను రొట్టిలో, పకోడీలో, ఖారం బజ్జీలో తెచ్చేవాడు. ఆ రాత్రి భీమారావు ఆ బజ్జీలను, ఆ పకోడీలను నంజుకుని ఇంట్లో నున్న మిగతా సారాను త్రాగేవాడు.

మరో రెండు నెలలు గడిచేయి. నారాయుడు భీమారావుని అన్న అని, భీమారావు భార్యను ఒదిన అని పిలవనారంభించేడు. నారాయుడు మహా ఉంటే భీమారావు కన్న సంవత్సరం, సంవత్సరంనర చిన్న ఉంటాడు. భీమారావు భార్య మల్లమ్మ చనువుగ నారాయుడిని మరిదీ అని పిలచేది.

ఒకనాడు నారాయుడు ధైర్యం చేసి భీమారావుతో తన మనస్సులోని మాటలను చెప్పేసేడు–

"అన్నా! నన్ను తిట్టు కొట్టు కాని నేను నామనస్సులోని మాటను చెప్పక తప్పదు. మనిద్దరి పరిస్థితులు బాగవాలంటే అదే నాకు తోచిన మార్గం. నాకు టీ స్టాల్‌లో సహాయం చేసే వారు ఎవ్వరూ లేరు. గ్లాసులు, ప్లేట్లు కడగడానికి, టేబిలు తుడవడానికి ఓ కుర్రాణ్ని నెల జీతంకు పెట్టుకున్నానంతే. ఇటు పొయ్యి పని, అటు అందించే పని నే నొక్కణ్ణీ చేసుకో లేక పోతున్నా. పకోడీలు, బజ్జీలు మరొకళ్ళ దగ్గర కొని కొట్టులో పెట్టుకుని టీ తో బాటు అమ్ముతున్న. వాటినే నేను నా కొట్టులో తయారు చేసి అమ్మితే ఎంతో లాభం. పైగ కోడి గుడ్లు అమ్ముతున్నానా, వాటినే కొట్లో ఆమ్లెట్లుగ తయారు చేసి అమ్మితే నాల్గింతల లాభం వస్తుంది. ఒదిన రోజంత ఏపని లేకుండ ఇంట్లో కూర్చుంటుంది. అందుకే నీకు అభ్యంతరం లేకపోతే ఒదిన వచ్చినాకు టీ స్టాల్‌లో సహాయం చేస్తే నా కొచ్చిన లాభాలలో సగం నీకిస్తా. నేనేం పరాయివాడిని కాను. నీకు తోడబుట్టిన లాంటి వాడిని. తొందరొద్దు– నువ్వు, ఒదిన, పెద్దమ్మ బాగా ఆలోచించుకుని రేపు చెప్పండి", అని నారాయుడు మెల్లగ జారుకున్నాడు. నారాయుడికి భీమన్నంటే ఎంతో బెదురు.

ఇంట్లో ఆరోజంత తర్జన భర్జన అయేక భీమారావు తల్లి ఒత్తిడి చేసింది.

"చూడు భీముడూ– నారాయుడు పైవాడు కాదు. నా దగ్గర బంధువు. నీకు తమ్ముడి లాంటి వాడు. వాడు మన కుటుంబానికి చెందిన మనిషే. వాడితో వాడి ఒదిన పని చేయడం ఆక్షేపణగ ఏమీ ఉండదు. వాడిది చాల మంచి మనసు. ఆవిధంగ మనకు కొంత కలసి వస్తుంది. మరే సందేహాలు పెట్టుకోక ఒప్పుకో."

"మరి నువ్వేటంటావ్ మల్లీ?" అని భార్య నడిగేడు.

"మరినీఇష్టమే నా ఇష్టం. నువ్వదంటే నే యెళ్ళి మరినీ చేత తన్నులు తినలేను," అని తన భయాన్ని, భర్త మీదున్న తన గౌరవాన్ని వెళ్ళబుచ్చింది.

"సరే – మీ అందరికి ఇష్టమైతే నాకే నేటి? అలాగే కాని," అని భీమయ్య ఊకొట్టేడు.

ఆమరునాటి నుండి మల్లమ్మ ఇంత వంట చేసేసి



భర్త కిర్లీ కొట్టుకు పోయేక తను బస్సుస్టాండు దగ్గరున్న టీ స్టాల్‌కి పోయేది. ఆ టీస్టాల్‌లో పని చూసుకుని, కాస్త ఉడకేసి తను కాస్త తిని నారాయుడి కింత పెట్టి మధ్యాహ్నం ఒంటి గంటన్నర కొచ్చి మళ్ళీ నాలుగుకి వెళ్ళి రాత్రి ఎనిమిది గంటల కింటి కొచ్చేది.

ఈ విధంగా కొన్ని మాసాలు బాగానే గడిచేయి. ఒకనాడు భీమారావు కిర్లీ బడ్డీ కెదురుగ నున్న సినీమా హాలు వద్ద సినీ హీరో కృష్ణ ఫాన్సు, హీరో శోభనబాబు ఫాన్సు ఏదో ఘర్షణపడి, కలబడి కొట్టుకుని సినిమా హాలుని కొంత పాడు చేసి, చుట్టూ ఉన్న కిర్లీ బడ్డీలను, చిల్లరదుకాణాలను తగలబెట్టేరు. ఆ గొడవలో కాలి బూడిదైంది భీమారావు కిర్లీ బడ్డీ ఒకటి. భీమారావు ఆ కోపంలో నలుగుర్ని చావబాది, తను నాలుగు తన్నులు తిని కుంటు కుంటు కళ్ళ నీళ్ళతో ఇంటికి చేరేడు రాత్రి ఏడున్నరకు.

తన గోడును చెప్పకుందుకు ఇంట్లో భార్యలేదు. టీ స్టాల్ కెళ్ళింది. ఆ రాత్రి ఆ విచారంలో పీక మొయ్యా త్రాగి, కసితీరక రాత్రి ఇంటికి వచ్చిన పెళ్ళాంతో ఏదో కీచులాడి ఆమెను చావ మోదేడు. ఆ తరువాత రెండు రోజులకు గాని మల్లమ్మ లేవలేక పోయింది.

మల్లమ్మ చాల దుఃఖించింది- ఏ ఆదరణకు నోచుకోక పోయిన ఈ తన్నుల బాధొకటి. ఆమె శారీరకంగ, మానసికంగ కృంగిపోజొచ్చింది.

అట్లాంటి సమయంలో మల్లమ్మకు మరిది నారాయుడి నుండి ఓదార్పు, ఆదరణ లభించేయి. నారాయుడు మంచివాడు, ఏ వ్యసనాలు లేనివాడు. మొదటి నుండి మల్లమ్మంటే వల్లమాలిన అభిమానం. ఆ అభిమానమే క్రమేపి ప్రేమగ మారి, ఆమె అందానికి ఆకర్షింప బడి ఆమెకు చేరువై పోయేడు.

మెల్లగ చేతుల్ని కలుపుకోడం, చాటు మాటుగ అక్కడో ముద్దు ఇక్కడో ముద్దు పెట్టుకోడం, ఎవ్వరు చూడకుంటే ఒకర్ని ఒకరు హత్తుకోడం చేస్తుండేవారు. కాని ఇంకా వ్యవహారాన్ని ముందుకు పోనివ్వ లేక పోయేరు. వారిరువురికి తెల్సు భీమారావు బలమైన రౌడీ అని ఈ చాటు ప్రేమ తెల్సిందంటే నరికి పోగులు పెడ్తాడని.

పరిస్థితులలా ఉంతగ, భీమారావు వ్యాపారం దెబ్బతిని చేసేదేమి లేక తెగించి మిలటరీలో చేరిపోయేడు. తల్లికి కోడలు బాధ్యత నప్ప జెప్పి మిలటరి ట్రయినింగుకు వెళ్ళి పోయేడు.

శిక్షణ పూర్తయి కాశ్మీరు సరిహద్దు రక్షణకు మిలటరి జవానుగ పంపబడ్డాడు భీమారావు. నెల నెలా ఇంటికి ఉత్తరాలు రాస్తుండే వాడు. ఇంటికి డబ్బు పంపుతుండేవాడు. భీమారావు కాశ్మీరులో నుండగ తల్లి చనిపోయింది. కాని సెలవు మంజూరు కాలేదు. రాలేక పోయేడు. నారాయుడే అతడి తల్లికి దహన సంస్కారం చేశాడు.

తల్లి పోయిన నాల్గు మాసాలకు సెలవు దొరకి ఇంటికి బయలు దేరేడు. ముందుగ వస్తున్నట్టు









# ప్రతీకారం

భార్యకు వ్రాసేడు. ఆ ఉత్తరాన్ని అందుకోగానే మల్లమ్మ భయంతో వణికి పోయింది. నారాయుడి భీతి సరేసరి.

దానిక్కారణం లేకపోలేదు- భీమారావు మిలటరికి వెళ్ళిం తరువాత కొద్ది మాసాలకు అతడి తల్లి బాగా జబ్బుపడి మంచమెక్కింది. నారాయుడు రాత్రుళ్ళు పిల్లిలా ఇంటికి చేరి మల్లమ్మ ప్రక్కలో చేరేవాడు.

ఈ చర్య మొదట్లో అతి రహస్యంగ సాగిన తరువాత ఇరుగు పొరుగుకి చూచాయగ తెల్సిపోయింది ఆఖరికి ఆ చుట్టుప్రక్కలవాళ్లకు, భీమారావు స్నేహితులకు కూడ ఆ సంగతి వ్యాపించింది అనుమానం పరిణామంచెంది, పొగనుచిమ్మి రాజుకుని మంటగ లేచి ఆఖరుకు మల్లమ్మను, నారాయుడిని దహించే స్థితికి వచ్చింది. అప్పుడే భీమారావు ఇంటికి వస్తున్నట్టు వ్రాసిన ఉత్తరం పిడుగులా వచ్చిపడింది. ఆ ప్రేమికు లిద్దరు భయంతో బిగుసుకుపోయేరు.

భీమారావు తెనాలి చేరేసరికి తనింటికి పైన గడియపెట్టిఉంది గడియ తీసుకుని లోనికి వెళ్లేడు. ఇల్లు బోసిగ తోచింది. అర్థంకాక బస్సుస్టాండుకు వెళ్లేడు. అక్కడ టీస్టాల్‌లో కొత్త యజమాని ఎదురయ్యేడు.

"నారాయుడు వారం రోజుల క్రితం నాకీ టీ స్టాల్ అమ్మేసిపోయేడు. ఎక్కడకు పోయింది నాకు తెలియదు."

ఆసరికి భీమారావు మనస్సులో ఏదో అనుమానం జనించింది ఇంటికి తిరిగొచ్చి ప్రక్కింటావిడను పల్కరించే -

"పెద్దమ్మా! మల్లమ్మఏదీ?ఎక్కడ కెళ్లిందేమిటి?" అని యధాలాపంగ అడిగేడు. ఆవిడ భీమారావుని ఇంట్లోకి తీసుకెళ్లి కూర్చొబెట్టింది.

ఆవిడ భీమారావు రాకను అడిగి, క్షేమ సమాచారాలు కనుక్కొని అసలు కథను చెప్పేసింది-

"ఏం చెప్పను నాయనా- ఆ వగలాడి నిన్ను మోసం చేసి ఆ నాయుడితో లేచిపోయింది."

"ఆ!" భీమారావు తలమీద ఎవరో బలంగ [illegible] దిగ్భ్రాంతి [illegible] ఓ నిమిష మయితేగాని తేరుకోలేకపోయేడు.

ఆ పెద్దావిడే చెప్పుకుపోయింది-

"నువ్వు మిలటరికి పోయింతరువాత ఆ నారాయుడు నీ ఇంట్లోనే పక్క వేసేవాడు. ఒకటే సరసాలు; ఒకటే ముచ్చట్లు మీ అమ్మ జబ్బుతో మంచమెక్కిందా, వాళ్ల విరగబాటుకి మరి అడ్డే లేకపోయింది తరువాత మీ అమ్మ చచ్చిపోయేక ఇద్దరు మరింత బరితెగించేసేరు అందరికి క్రమేపి వాళ్ల రంకు వ్యవహారం తెల్సిపోయింది. కాని వాళ్లేమి జంకిపోలేదు హఠాత్తుగ అయిదు రోజుల క్రితం ఇద్దరు డబ్బు, ధైర్యం కూడదీసుకుని ఎక్కడికో లేచిపోయేరు ఇంటికి తాళమేనా వేయకుండా గడియపెట్టి ఎవ్వరికి తెలియనియ్యక రాత్రి ఏ ట్రయినుకో పోయేరు"

భీమారావు రక్తం క్రోధంతో అవమానంతో ఉడుకెత్తిపోయింది తనకు తెల్సిన వాళ్లందర్ని కలిసేడు కానిఎవ్వరు నారాయుడి గురించిగాని, మల్లమ్మ గురించిగాని వారెక్కడకు పోయిందీ చెప్పలేక పోయేరు భీమారావు అత్తవారి గ్రామం వెళ్లేడు వారెవ్వరికి మల్లమ్మ ఆచోకి ఏమీ తెలియదు నారాయుడి గ్రామంవెళ్లి వాకబు చేసేడు. వాడి జాడ వాళ్ళు చెప్పలేకపోయేరు.

ఆనాటి నుండి భీమారావు ధ్యేయ మొకటే - మల్లమ్మను, నారాయుడిని వెదక పట్టుకుని ఇద్దర్ని నరకి పారేయడమే అప్పటికి గాని తన హృదయంలో రగిలిన మంట చల్లారదు ఇది జరిగి ఆరేళ్ళు కావస్తుంది

భీమారావు తిరిగి మిలిటరిలోకి పోయేడు ప్రతి సంవత్సరం ఓ నెల్లాళ్లు సెలవు మీద తెనాలి వచ్చి మల్లమ్మ గురించి, నారాయుడి గురించి తెల్సిన అందర్ని అడిగి వారి జాడను కనుక్కొందుకు ప్రయత్నించేవాడు అత్తవారి బంధువుల్ని, నారాయుడి స్నేహితుల్ని, బంధువుల్ని కలిసి వారెక్కడకు పోయింది తెల్సుకుందుకు ఎన్నో ప్రయత్నాలు చేసేడు. అలా ఆరేళ్ళు గడచి పోయేయి భీమారావు మరి పెండ్లి చేసుకోలేదు. అలాగని [illegible] వదలు కోలేదు. బజారు [illegible] శారీరక [illegible] వాడు. ఒంటరివాడు. [illegible] జేబులో ఆడుతుంటే, మరి [illegible] తనకు అత్యంత ప్రియమైన [illegible] మిక్కుటంగానే [illegible]



# విజయవాడ పర్యాటక విశేషాలు, సౌకర్యాలు

ఇప్పుడు విజయవాడ విశేష ఆకర్షణలతో పర్యాటకులకు వినూత్న సౌకర్యాలను అందిస్తోంది

**విజయవాడ నగర సందర్శకులకు ప్రత్యేక యాత్రా సదుపాయము**

ప్రతిరోజు ఉదయం 8 గంటలకు మొదలై సాయంత్రం 6 45కి ముగిసే యీ యాత్రలో ఆంధ్ర ప్రదేశ్ టూరిజం వారు మీకు ప్రఖ్యాతి గాంచిన కనకదుర్గ ఆలయం, పడవలో భవానీపురం ద్వీపమునకు మ్యూజియం, గాంధీ హిల్, మంగళగిరి నరసింహ స్వామివారి ఆలయం, కొండపల్లి కోట మొదలగు విశేష స్థలములు చూపించెదరు కృష్ణా నది తీరాన వున్న ఆంధ్ర ప్రదేశ్ టూరిజం వారి కృష్ణవేణి మోటల్ నందు భోజనమునకు విరామం

**యాత్ర ఖర్చు ఒకరికి 40/- రూ ***

**ఆంధ్ర ప్రదేశ్ టూరిజం వారిచే నిర్వహించబడే నాగార్జున సాగర్ మరియు తిరుపతి విహార యాత్రా కార్యక్రమములలో చేరండి**

**నాగార్జున సాగర్** ప్రతి మంగళవారం మధ్యాహ్నం విజయవాడ నుండి బయలుదేరి బుధవారం రాత్రికి తిరిగి వచ్చును

**యాత్ర ఖర్చు ఒకరికి . 100 రూ. (ఏ.సి వసతితో) 90 రూ (సాధారణ వసతితో)**

**తిరుపతి .** ఈ మూడు రోజుల యాత్ర విజయవాడ నుండి ప్రతి శుక్రవారం రాత్రి బయలుదేరి, సోమవారం ఉదయం తిరిగి వచ్చును

**యాత్ర ఖర్చు : ఒకరికి 220/- రూ. ***

* (భోజనం ఖర్చు యాత్రికులవే)

**కృష్ణవేణి మోటల్‌లోని సదుపాయాలను చవి చూడండి**

మద్రాసు-కలకత్తా జాతీయ రహదారిలో నిర్మించబడ్డ కృష్ణవేణి మోటల్ విజయవాడ మీదుగా ప్రయాణించు యాత్రికులకు ఒక చక్కటి విశ్రాంతి విడిది కృష్ణా నది తీరమునున్న ఈ కృష్ణవేణి మోటల్ ఆ నది ప్రవాహ సోయగాలను తిలకిస్తున్నట్లుంటుంది మీ సౌకర్యార్థం అత్యంత ఆధునిక రీతిలో ఆరు ఏ.సి. గదులు మరియు రెండు సాధారణ గదులు యిందులో ఏర్పాటుచేయబడ్డాయి ఇక్కడ ఫలహారశాల శాకాహార మరియు మాంసాహార పదార్థములను విడిది చేయుచున్న పర్యాటకులకే గాక బయటవారికి కూడా సరఫరా చేస్తుంది

**'భవానీపురం ద్వీపం' యొక్క ప్రత్యేక ఆకర్షణలను తిలకించండి**

ప్రకృతి అందాలను సంతరించుకున్న కృష్ణా నదిలో పడవ ప్రయాణం ద్వారా భవానీపురం ద్వీపం చేరుకోండి ఇక్కడ పారా సైలింగ్ విండ్ సర్ఫింగ్, పడవ షికారు మొదలైన మరెన్నెన్నో రకములైన జలక్రీడా విన్యాసములు గలవు

ప్రకృతి సౌందర్య పరిసరాలలో యున్న ఈ ద్వీపం నిజంగా పర్యాటకులకు ఒక విహార విడిది

**ఆంధ్ర ప్రదేశ్ టూరిజం రవాణా విభాగము వద్ద కారు అద్దెకు తీసుకొనే సదుపాయం మరియు జట్టుగా ప్రయాణం చేయదలచుకున్న వారి కొరకు 'విలాస సౌకర్యములు' అమర్చబడిన బస్సుల సదుపాయములు అందుబాటులో గలవు**



వివరములకు సంప్రదించండి

**ఆంధ్ర ప్రదేశ్ టూరిజం**
ఎ. పి. ఎస్. ఆర్. టి. సి. బస్ స్టాండ్,
విజయవాడ

**ఆంధ్ర ప్రదేశ్ టూరిజం**
కృష్ణవేణి మోటల్ సీతా నగరము
ఫోన్ 63270



# ప్రతీకారం

ఇమారు సెలవు తీసుకుని ఇంటికి వచ్చిం తరువాత ఓ నాడు విజయవాడలో ఓ పరిచయస్తుడు ఎదురు పడి, ఏవో మాటల మీద – "భీమన్నా! నీ భార్య మల్లమ్మను చూచానోయ్", అని చెప్పేసేడు.

భీమారావు ఆత్రంగ అతడి భుజాన్ని పట్టుకుని– "ఎప్పుడు? ఎక్కడ?" అని అడిగేడు.

"ఈ మధ్యకాదులే. అయిదారు నెలలై యుంటుంది. నేను బస్సులో విజయనగరం నుండి విశాఖపట్నంకు మా బామ్మరిదింటకి వెళ్తుంటే చిట్టివలస గ్రామం వద్ద నీ భార్య మల్లమ్మను బస్సు పక్కనే మరో కావిడతో మాట్లాడుతుంటే చూసేను. నేను బస్సులో కూర్చుని ఉన్నాను. మల్లమ్మ ఆవిడతో 'మాఆయన జ్యూటు మిల్లు నుండి వచ్చే టైమయింది. మరి వెళ్తానమ్మా' అని చేతిలోని కూరగాయల సంచితో కదిలింది. అప్పుడు చూచి పోల్చుకున్నాను మల్లమ్మేయని. నేను పిలిచేలోగా బస్సు కదలి పోయింది

భీమారావు ఆ సాయంత్రమే విజయవాడలో పొడుగాటి పదునైన చాకును కొన్నాడు. తరువాత తెనాలి తిరిగొచ్చిం తరువాత ఓరోజంత దీర్ఘంగ ఆలోచించి ఓ పథకం వేసుకుని-బయలు దేరేడు. తన సెలవు అయిపోయిందని, డ్యూటీలో చేరాలని తెల్సిన వాళ్ళందర్కి చెప్పి ట్రయినెక్కేడు.

* * * * *

భీమారావు ఆలోచనల నుండి నిద్రలోకి జారుకున్నాడు. తరువాత నిద్రనుండి మేల్కొని రిస్టు వాచి చూసుకుంటె సాయంత్రం అయిదు గంటలయింది. లేచి స్నానం చేసి బట్టలు వేసుకుని చాకుని పాంటు జేబులో పెట్టుకుని బయలు దేరేడు.

రిక్షా ఎక్కి బస్సుస్టాండుకు చేరేడు. అక్కడ వాకబు చేయగ విజయనగరంకు, శ్రీకాకుళంకు పోయే బస్సులన్ని చిట్టివలస మీదుగ పోతాయని తెల్సి ఆరూటు బస్సు ఒకటి ఎక్కేడు. భీమారావు తన ప్రతీకార వాంఛ తీరుతున్నందుకు ఒక విధంగ ప్రశాంతంగానే ఉన్నాడు.

భీమారావు ప్లానంత చిట్టివలస రాత్రి చేరింతరువాత మెల్లగ నారాయుడు ఉంటున్న ఇంటిని కనుక్కొని ఆ ఇంటిలోకి ప్రవేశించి ముందు నారాయుడ్ని, తరువాత భయంతో బిక్క చచ్చి పొయున్న మల్లమ్మను పొడిచి చంపి, ఆ ఇంటి తలుపుల్ని వేసేసి తన జేబులో నున్న కొత్త తాళం కప్పను వేసెయ్యాలి తరువాత మెల్లగ విశాఖపట్నం వచ్చేసి ఆ తాళం చెవుల్ని ఏ కాలువలోనో పారేసి, ఆ రాత్రి లాడ్జిలో పడుక్కొని మరునాడు తెల్లవారు ఝూమున బయలు దేరి జనతా ఎక్స్‌ప్రెస్‌లో కలకత్తాకు చేరి అక్కడ నుండి తను డ్యూటీ చేస్తున్న పంజాబుకు పోదలచేడు

ఇంటికి తాళం వేసెయ్యడవల్ల లోన ఏమైంది తెలిసే సరికి ఓరోజు పట్టొచ్చు. ఆసరికి తను సురక్షితంగ కలకత్తాకు చేరుకుంటాడు. ఇంత దూరం వచ్చేసి అజ్ఞాతంగ ఇక్కడ జ్యూటు మిల్లులో పని చేస్తున్న నారాయుడే ఆ అవని గడ్డ గ్రామ వాసి నారాయుడని ఎవరికి తెలియగలదు? ఈ విధంగ తన ప్రమేయం తెల్సిరాదు. ఒక వేళ పోలీసులు తెలివిగ తనే ఆ హత్యలను చేసిన వ్యక్తని ఆరా తీసి పట్టుకుంటె పట్టుకోనీ తన ప్రతీకార వాంఛ తీరేక తనేమై పోయిన ఫరవాలేదు అంతకు తెగించే బయలు దేరేడు భీమారావు.

భీమారావు చిట్టి వలస చేరినప్పటికి రాత్రి ఏడు దాటింది. చిట్టివలస చిన్న గ్రామమైన అది లేబర్ ఏరియా గనుక, అందునా ఆంధ్రదేశంలోని గ్రామం గనుక తినుబండారాల దుకాణాల కన్న ఎక్కువగ బ్రాంది షాపులు, సారాయి దుకాణాలున్నాయి.

భీమారావు మొదట నాటు సారాతో పెరిగిన వాడైనా మిలిటరీలో చేరింతరువాత కంపెనీ విస్కీకి అలవాటు పడ్డ వాడయేడు. అందుకే కాలం గడపడానికి, మరి కాస్త ఒళ్ళు వేడెక్కించడానికి ఓ బార్‌లోకి వెళ్ళేడు.

పెగ్గు పెగ్గుతో బాటు మనసులో రగిలున్న క్రోధాగ్ని మెల్లగ ప్రజ్వరిల్లడం మొదలైంది. సరిగ్గా ఎనిమిది గంటలకు బార్ నుండి బయటకు వచ్చేడు. మెల్లగ, గంభీరంగ అడుగులు వేసుకుంటు లేబర్ కాలనీ వైపుకు బయలు దేరేడు.

'ఈ జూట్ మిల్లులో నారాయుడనే అతడు పని చేస్తున్నాడు. అతడిల్లు మీకు తెల్సునా?" అని ఒక రిద్దర్ని భీమారావడిగేడు

"ఆరెండో వరుసలో చిట్టచివరిల్లే" అని ఒకడు చెప్పగల్గేడు.

ఆ కాలనీలో దీపాలు మాంద్యంగ, మసకగ ఉన్నాయి. అదీ ఒకందుకు మంచికే అనుకున్నాడు భీమారావు. మెల్లగ జేబులో నున్న కత్తిని, తాళం కప్పను తడిమి చూసుకున్నాడు. పుచ్చుకున్న విస్కీ మెదడుకు క్లైమాక్సుకెక్కుతుంటే హృదయంలో రగిలిన అవమాన జ్వాల అతడి పట్టుదలను సడలించక ఆకట్టుకునుంది.




ఆ ఇంటిని చేరేడు. ఆ ఇంటికి కాస్త దూరంలో దీపపు స్తంభముండడం వల్ల ఆ ఇంటి మీద కాంతి పడడంలేదు ముందు వరండా గది తలుపులు దగ్గరగా వేసున్నాయి. ఆ తలుపుల్ని మెల్లగ తీసి వరండాలోకి ప్రవేశించి, తలుపుల్ని మూసి చప్పుడు కానివ్వకుండ గడియ పెట్టేడు లోన గది తలుపుల్ని చేరేడు ఆ తలుపులు చేరుపగ మాత్రం వేసున్నాయి లోనుంచి మాటలు వినవస్తున్నాయి–

'మల్లమ్మా' నా మాట ఇనవే".

అనుమానం లేదు– అది నారాయుడి గొంతుకే! ఆ స్వరం వినేసరికి భీమారావు రక్తం ఉడుకెత్తి పోయింది. పాంటు జేబులోంచి చాకును తీసి తెరిచాడు. తలుపు సందులోంచి వస్తున్న సన్నని కాంతిలో ఆ కత్తి పదును ఆత్మాశతో మెరిసింది.

మెల్లగ తలుపుల్ని కాస్త తెరచి ఆ సందులోంచి భీమారావు లోనకు చూచేడు గదిలో పెద్దగ సామానేమి లేదు. గది మధ్యన పై నుంచి ఓ ఇరవై అయిదు వాట్ల బల్బు చిన్నగ వెలుగుతూంది. ఆ సన్నని వెలుగులో ఆగది లోని దృశ్యాన్ని చూసి భీమారావాగిపోయేడు.

గదికి ఓ ప్రక్కన చాప మీద మల్లమ్మ పడుక్కొని ఉంది బాధతో మూలుగుతూంది. ఆమె ప్రక్కన కూర్చుని నారాయుడు గ్లాసులో నున్న మందును త్రాగమని యెంతో ఆదరంతో బ్రతిమాలుతున్నాడు.

"మల్లీ – నా మాటిను. ఈ మందు తాగు, నీజ్వరం తగ్గిపోతుంది. రేపు డాక్టరు బాబును కలసి కొత్త మందును తెస్తాలే".

ఏంటయ్యా – నన్ను బాధిస్తావు. ఈ మందుల వల్ల నాకేంకాదు. కాటికి దగ్గరపడినదానను..ఇన్ని నెలలై వదలని జబ్బు ఇప్పుడీ మందుతో పోతుందా – నీ వెర్రిగాని? మరినా గురించి డబ్బు తగలేయకు. ఇప్పటికే నా వైద్యానికి చాల అప్పులు చేసేవు. మరెందుకయ్యా ఈ ఖర్చు?" అని బాధతో మిళితమైన హీన స్వరంతో పల్కింది

భీమారావు శ్రద్ధగ చూచేడు మల్లమ్మను. తను ఎరిగున్న మల్లమ్మకు ఈ మల్లమ్మకు సామ్యమే లేదు. పచ్చగ, మంచి పొంకంగ నిగారింపుతో నుండే తన చక్కని భార్య మల్లమ్మ ఇప్పుడు మసి బారి, వ్యాధితో కృసించి ఎండు పుల్లలాఉంది. అల్లాంటి జీవత్శవంపై నారాయుడికింకా ప్రేమ చావక పోవడం భీమారావుకు అంతుబట్టని విషయమై అత్యం తాశ్చర్యాన్ని కల్గించింది.

"మల్లీ! అలాంటి మాటలనకే. ఎలాగైన నిన్ను బతికించుకుంటానే. నామాటినే. ఈమందుతాగే", అని కంట నీరు చిమ్మగ వ్యాకుల పడి పోయేడు నారాయుడు.

భీమారావు ఈ మారు నారాయుడిని గమనించేడు. నారాయుడూ చిక్కిపోయేడు కాని ఆ ముఖంలో కళ, ఆ సౌమ్యత తరగలేదు.

"నన్ను ఇలా చావనీయవయ్యా రోగిష్ఠి దానితో నీకేం సుఖం? మన వీధి చివర్నున్న రామస్వామి కూతురు రాజ్యం, నువ్వు వచ్చి పోయేటప్పుడు ఇంతేసి కండ్లు చేసుకుని చూస్తుంటుంది నీకోసమే మనింటికి అప్పుడప్పుడు నన్ను చూసే నెపంపై వస్తూంటుంది. దానిని నువ్వు కట్టుకో – సుఖపడు".

"ఏంటీ నీమాటలు! విడ్డూరంగ, వికృతంగ ఉన్నాయి. నువ్వు చచ్చిపోతే నేనూ నీతోనే చచ్చిపోతానే", అని చేతుల్లో ముఖం దాచుకుని మౌనంగ రోదించడం మొదలెట్టేడు.

అప్పుడు చూచేడు భీమారావు, నారాయుడి ఎడం చేతి నాల్గు వేళ్ళు చచ్చు పడుండడం. బహుశా అవి జూటు ప్రెస్సులో నలగి పోయుండొచ్చు.

"ఎందుకయ్యా నారాయా నీకు నా మీదింత ప్రేమ?" అని మల్లమ్మ మెల్లగ వంగి నారాయుడి తలను తన గుండెకు హత్తుకుని కన్నీరు కార్చ నారంభించింది.

భీమారావు అడుగు ముందుకు పడడం లేదు.

చిన్న చప్పుడు విని గదిలోని మరో పక్కకు భీమారావు చూచేడు. అక్కడ ఓ నాలుగేళ్ళ పిల్లడు బొమ్మలతో ఆడుకుంటున్నాడు. వాడిని చూడగానే భీమారావు గతుక్కుమన్నాడు. వాడు అచ్చు తన భార్య మల్లమ్మ కాపురాని కొచ్చినప్పుడుండే రూపాన్ని పుణికి పుచ్చుకున్నాడు. అవేకళ్ళు, అవే చంపలు, అదే శరీర కాంతి!

ఈ ఏడుపులు రొదలు, ఈ క్రోధాలు కావేషాలు వేటితో సంబంధం లేకుండ ఉల్లాసంగ ఆ బొమ్మల ప్రపంచంలో విహరిస్తున్నాడు ఆ పిల్లడు.

భీమారావు హృదయంలో ముల్లుగుచ్చుకున్నట్లయింది. ఏదో అనిర్వచనీయమైన బాధతో హృదయం మూల్గింది. తను ఆ వాత్సల్యాన్ని, ఆ నిస్వార్థ ప్రేమాను రాగాలను యెరుగడు. తను దురదృష్ట వంతుడు. చేజేతులా తను చేసుకున్న కర్మ అది!

'నీకే జబ్బులేదే. భీమన్నకు మన ఆచూకి తెలిసి పోతే వచ్చి మనల్ని చంపేస్తాడన్న భయంతోనే కృంగి ఈ కష్టాన్ని తెచ్చుకున్నావు. చంపుతే చంపనీయే– ఒక సారే ముగ్గురం చచ్చిపోదాం. ఇలా భయంతో రోజు చచ్చేకన్న అదేనయం కాదే?"

నారాయుడి మాటలతో భీమారావు మళ్ళీ ఈ లోకంలోకి వచ్చి పడ్డాడు. ఆ పిల్లడి నుండి దృష్టిని మరల్చి ఇటు చూచేడు. నారాయుడు అందించిన మందును గోడకు జేరగిల పడి మల్లమ్మ త్రాగుతుంది.

భీమారావు మరి ఆవేశాన్ని ఆపుకో లేక పోయేడు. తలుపుల్ని త్రోసుకుని గదిలోకి ప్రవేశించేడు. నారాయుడు, మల్లమ్మ అతడిని చూచి భయంతో బిగుసుకు పోయేరు

నారాయుడు ముందు తేరుకుని – భీమన్నా' నన్ను చంపు మల్లమ్మ దేమి తప్పులేదు నేను మీ ఇద్దర్ని మోసగించి ఆమెను తెచ్చా, అని వణుకుతున్న స్వరంతో అన్నాడు

ఈ లోగా మల్లమ్మ కాస్త ధైర్యాన్ని తెచ్చుకుని – 'భీమయ్యా! ముందునన్ను పొడిచి చంపు. నారాయుడి దేమి తప్పులేదు. వాడు అమాయకుడు. నేనే వాడ్ని నావలలో వేసి ఇక్కడకు తీసుకొచ్చా. వాడ్ని, నాకొడుకుని ఏమి చేయకు. నన్ను చంపి, నీ కక్ష తీర్చుకో", అని వేడుకుంది.

ఆ ఇద్దరు భీమారావు చేతిలోని అపదును కత్తిని చూచి వణికి పోతూన్నారు భీమారావు చేతిలోని కత్తిని దీర్ఘంగ ఓసారి చూచి దానిని గదిలో ఓ మూలకు విసరి వేసేడు ఆ బాలుడి దగ్గరకు వెళ్ళి, వాడ్ని ఎత్తుకుని ముద్దాడి క్రిందకు దించేసేడు జేబులోని పర్సును తీసి అందులో పద్దెనిమిది వంద రూపాయల నోట్లుంటే, ఓ రెండింటిని మాత్రం తీసి తన జేబులో పెట్టుకుని, మిగతా పదహారు వందల రూపాయలతో నున్న ఆ పర్సును నారాయుడి వడిలోకి విసరి–

'మల్లమ్మకు సరైన వైద్యం చేయించు. బాబుకి మంచి బట్టల్ని కొను." అని చెప్పేసి చటుక్కున వెనుదిరిగి వచ్చేసేడు.

మల్లమ్మ, నారాయుడు కృతజ్ఞతలను చెప్పు కుంది కైన నోట మాట రాక దిగ్భ్రాంతులై అలా ఉండి పోయేరు ఆ రాత్రి లాడ్జిలో భీమారావు ఇన్నాళ్ళకు విస్కీ సహాయం లేకుండా ప్రశాంతంగ నిద్ర పోగల్గేడు □

# ఈ వేమన పద్యాలు




కోరిన కోరికలెల్లను
మేలిమిగా జరుగునటర మెచ్చరు భువిలో
కారణ కర్మ ప్రకారము
కోరిన కోరికెలు జరుగు గొబ్బున వేమా.

కేశవ, అమృతలూరు

★ ఈ దేశంలో నిరుద్యోగులకి మీ సలహా?

● సలహాలు పనిచెయ్యవు. .డిగ్రీల వ్యామోహానికి స్వస్తి చెప్పి- శ్రమకి నాంది పల్కి గర్వంగా బ్రతకనేర్వండని చెప్తే వూరుకుంటారా? 'కట్నం కోసమైనా చదవాలి' అన్నట్టు- దొనేషన్లు కట్టి కాలేజీలలో చేరతారు!

సి. హెచ్. ఎస్. దగదర్తి

★ సముద్రమైనా ఈదవచ్చుగాని సంసారం యీదలేం అంటారు దేనికి?

● దానికి గమ్యం – మునగడమో తేలడమో కాని- దీనికి గమ్యం చివరిదాకా తెలియదు కదా.

★ పెండ్లికూతురి మెడలో మూడు ముళ్ళు వేయడం ఎందుకు?

● ఒకటి. పుట్టినింటికి స్వస్తి, రెండు పౌరుషానికి స్వస్తి, మూడు: వ్యక్తిత్వానికి స్వస్తి 'మనిషిని 'వస్తువుగా' మార్చేసాయి – మూడు ముళ్ళు!

ఎన్. ఎస్. పి. రాయచూరు

★ ఈ కాలంలో మంచి కంటే చెడు ఎక్కువగా వుంటుంది.

● కాలాన్నిబట్టి నడుచుకోవాలన్న నీతికి నిదర్శనం అది!

జి. డి. డి. ఖర్గపూరు

★ నవమాసాలు మోసి కని పెంచిన పసి కందును మరుక్షణం పెంట కుప్పలపై విసిరిన స్త్రీలు యీ లోకంలో చాలా మంది ఉద్భవించి వున్నారు. వీరికి మీరిచ్చే సలహా?

● ఎందుకు? ఈ దరిద్రపు సమాజం స్త్రీపై మోపిన భారం పురుషునిపై మోపలేదు. ఎంత క్షోభ పడి పసికందులను విసిరి వేస్తారో మీరు ఊహించను కూడా వూహించ లేరు. అంచేత మామూలుగా ఆలోచించకండి అలాంటి వారిని గురించి సమాజం అంతా ఉత్తమ నైతిక విలువలు పాటించిన వారే అయితే- అనాధ శరణాలయాలింత లుకలుక లాడుతూ వుంటాయా? అది ఆలోచించండి. బిడ్డ




పుట్టుకకి తల్లి ఒక్కతే_నా కారణం?

ఎన్. ఎస్. కోటబొమ్మాళి

★ కొన్ని ప్రశ్నలకు జవాబులిస్తున్నప్పుడైనా అవి వేసిన వారిని చూడాలని పించదా మీకు?

● అనిపించదు అసలే నాకు సహనం చాలా తక్కువ. కొట్టానేమో నని భయం వేస్తుంది- అటువంటి సంకుచితంగా ఆలోచించే వారిని చూస్తే

ఎమ్. ఆర్. కె. సికింద్రాబాదు.

★ కొందరు అరిచేత వైకుంఠం చూపుతారు. కాని చిన్న మెత్తు పని చేయరు వీరి నేమనాలి!

● ప్రామిసెస స్నేహితులని సంపాదిస్తే సంపాదించ వచ్చు గాని – పని చేయని ప్రమాణాలు – విరోధులని పెంచుతాయని గ్రహించని – అమాయకులు- అనండి.

డి.వి. ఎమ్. విజయవాడ

★ తమ స్వంత కొడుకులనీ అల్లుళ్ళనీ అలా పొగుడుకుంటూ మాట్లాడుతారు కొందరు వారికి కాస్తైనా మొహమాటంగా వుండదా?

● సిగ్గు పడితే పబ్లిసిటీ ఎలా వస్తుందండీ మూర్తిగారూ! ఈ రోజుల్లో ఎవరి భజన కూటాలు వారి కుంటేనే. లేక పోతే- కలికంలోకి కనబడరు. .

ఎ. ఎ. సి. బళ్ళారి

★ వరకట్న సమస్యను రూపు మాపడం ఎలా?

● అబ్బాయిలూ అమ్మాయిలూ సంపాదనా పరులయ్యే దాకా పెళ్ళి గురించి ఆలోచించ కుండా వుండడం తరవాత- తమ అభిరుచుల కనుగుణంగా- నచ్చిన వారిని -పెళ్లి చేసుకోవడం ఇది కుదరదు అనకండి- కాస్త పట్టుదల వుంటే సాధ్యమే-

★ దీపం ఆరిపోతే వెలుగు ఎక్కడికి పోతుంది?

● ఎక్కడికీ పోదు- మళ్ళీ దీపం వెల్గించేదాకా అలముకొని వుంటుందంతే

సి. హెచ్. ఆర్. ఆర్. హైదరాబాదు

★ అందరితో క్లోజ్‌గా వుండాలనుకుంటాను కాని కొందరు నన్ను తప్పించుకుంటున్నారా అని పేలవుతూ వుంటాను ఎలా?

● అందరితో స్నేహం – కాని కొందరితోనే మైత్రి అదీ వారి తత్వం తెలిశాకనే- అదీ విజ్ఞుల లక్షణం వీడెక్కడి వాడు జలగలా పట్టాడు' అనుకునే చోట, (అనుకునేలా) స్నేహం ఎలా కుదురుతుంది?'

ఎ. కె. ఎమ్. విజయవాడ.

★ మీరు స్నేహాన్ని ఎలా నిర్వచిస్తారు కె రా?

● స్నేహం ఆత్మావిష్కరణ లాంటిదే ఒక్క రోజులో ఏర్పడేది కాదు నిజమైన స్నేహం నెమ్మది మీద ఎదిగే మొక్కలాంటిది వాతావరణపు ఒడిదుడుకులను దాటి పెరుగుదల ప్రారంభిస్తుంది స్నేహం కూడా అంతే

సి. హెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ 21-8-86 తేదీన మద్రాసు కేంద్ర సమర్పణగా విజయవాడ కేంద్రం నుండి జీవనమే పోరాటం అను మంచి నాటకం ప్రసారమైంది దీని రచయిత కె రామలక్ష్మి అని ప్రకటించారు అది మీరేనా?

● సాక్షాత్తూ నేనేస్వామీ ఆ కె రామలక్ష్మిని కాని ఏంలాభం? విజయవాడ రేడియోవారు ప్రసారం చేస్తారే గాని 'ప్రసాదం' పంపరు' కిందటి సారీ దినదినగండం రి బ్రాడ్ కాస్ట్ ఫీ పంపనే లేదు''

★ దైవ భక్తుడిని నాస్తికుడిగా మార్చడం కష్టమా. నాస్తికుడిని దైవ భక్తునిగా మార్చడం కష్టమా?

● ఎందుకా కష్టం? ఎవరి నమ్మకంలో వారిని బ్రతకనిస్తే ఏం పోతుంది?'

పి. ఆర్. ఆర్. విజయవాడ

★ గుంపులో గోవిందా- అంటే?

● గుంపులో – నువ్వూ ఒకరు' కాని ఒకటి మరిచి పోకూడదు- గుంపులో బ్రతక వలసి రావచ్చు గాని గుంపులో వారి లాగ బ్రతకాలని రూలు లేదు''

డి. ఆర్. బళ్ళారి

★ నిరుద్యోగులే తీవ్రవాదులైతే?

● దొంగాడికి తాళం చెవి యిచ్చినట్టు- బద్రంగా వుండవచ్చు

టి. ఎ. లో గుమ్మి

★ ఈ రోజులలో చుట్టాల కన్న స్నేహితులే మేలు అంటాను మీరేమంటారు?

● ఎదుటి వాడి కష్ట సుఖం గురించి ఆలోచిస్తే – చుట్టమే స్నేహితుడవ వచ్చు □



# పినాకినీ తీరాన రమణీయ క్షేత్రం పుష్పగిరి



శిల్ప సంపద



పుష్పగిరి ఆలయం

కడప మండలంలోని పుణ్యక్షేత్రాలలో పుష్పగిరి ప్రముఖమైనది చోళుల కాలం నాటి వైద్యనాధస్వామి ఆలయం, చాళుక్యుల కాలం నాటి శివకేశవుల ఆలయాలలో పుష్పగిరి చరిత్రాత్మకమైనది ఈ శైవ పీఠం కడపకు 16 కి మీ దూరంలో ఉంది ఈ గ్రామాన్ని అనుకొని అర్ధచంద్రాకారంగా ఉత్తర దక్షిణాలుగా పినాకినీ నది ప్రవహిస్తుంది ఇందువల్ల ఈ పుణ్య తీర్థాన్ని దక్షిణ కాశి అని కూడ పిలుస్తారు ఇక్కడే పినాకినితో పాపాఘ్ని కుందు వల్కల మాండవ్య నదులు సంగమిస్తున్నందు వల్ల పుష్పగిరిని పంచనదీ సంగమం అని కూడ పేర్కొంటారు

ప్రస్తుతం పినాకినీ ప్రవాహం బక్కచిక్కినప్పటికీ కనుల పండుగ కల్పించే కొండలు ప్రకృతి సౌందర్యం ప్రశాంత వాతావరణం పుష్పగిరి సందర్శకులను ఎంతో ఆకర్షిస్తాయి మనశ్శాంతిని ఆహ్లాదాన్ని ప్రసాదిస్తాయి పుష్పగిరిలోని శిల్పసౌందర్యం సందర్శకులకు ఆశ్చర్యం గొలిపి పరవశింప జేస్తుంది

దేశంలోని పీఠాలన్నిటిలోకి అతి ప్రాచీన మైనదైన పుష్పగిరి రాష్ట్రంలోని ఏకైక అద్వైత పీఠం ఇది ఒకప్పుడు గొప్ప విద్యాకేంద్రం

పుష్పగిరిలో రామాయణ మహాభారతాలను కనులకు కట్టే చక్కని శిల్పసంపద ఉన్నది చెన్నకేశవస్వామి ఆలయం మొదలు పుష్పేశ్వరుని ఆలయం వరకు గయాక్షేత్రం అని పేరు పుష్పగిరిలో కాశి గయ ప్రయాగ అని పిలవబడే ప్రాంతాలుండేవని కైఫియతుల వల్ల తెలుస్తున్నది కొండపైన చెన్నకేశ్వర ఆలయం సంతాన మల్లేశ్వర ఆలయం సాక్షి మల్లేశ్వర కమలేశ్వర ఆలయాలు ఉన్నాయి ఇక్కడ నూటొక్క దేవాలయాలుండేవని ప్రజలు భావిస్తారు దీనికి నిదర్శనంగా పుష్పగిరి చుట్టూ శిథిల లింగాలు పాణి వట్టములు, వృషభములు ఆంజనేయ, గణపతి శివ దుర్గ విగ్రహాలు విస్తరించి ఉన్నాయని 1811 మేలో ఈ ప్రాంతాన్ని సర్వే చేసిన మెకంజీ పేర్కొన్నారు

ఈ క్షేత్రానికి పుష్పగిరి అని పేరు రావడానికి అనేక ఇతిహాసాలు ఉన్నాయి శ్రీ రామచంద్రుడు రావణాసురుని వధకై పోతూ మార్గ మధ్యమున ఈ గ్రామంలో ఆగి వైద్యనాధ స్వామిని పుష్ప గుచ్ఛాలతో



పుష్పగిరిపీఠం చంద్రమౌళీశ్వరుని అర్చన్న చేస్తున్న శ్రీమద్ అభినవోద్దండ విద్యా నృసింహ భారతీ స్వాములవారు

పూజించాడనీ ఆ పుష్పాలను కొలనులో వేయగా అవి కొండవలె తేలాయని అందువల్లనే పుష్పగిరి అనే పేరు వచ్చిందని పేర్కొంటారు

గరుత్మంతుడు తల్లి విమోచనకై అమృతం తీసుకు వెళుతుండగా కొన్ని అమృత బిందువులు ఇక్కడి కొలనులో పడినాయని అందువల్ల కొలనులో స్నానం చేసిన వారు ఆరోగ్య వంతులూ నిత్యయవ్వనులు అవుతారని ఒక ఇతిహాసం ఉంది భూలోక వాసులు ఇలా నిత్యయవ్వనులు కాగూడదని దేవతలు ప్రార్థించిన మీదట శివుడు కైలాస పర్వత పాదం ఒక దానిని ఆ కొలనులో వేయించాడని, అది పుష్పం వలె తేలి పుష్పగిరి అయినదని మరొక కథ ఉంది

శివకేశవుల పాదముద్రలున్న ఈ ప్రాంతాన్ని పితృకార్యాలు చేయువారు పవిత్ర స్థలంగా భావిస్తారు

త్రేతాయుగంలోనే పుష్పగిరిఉన్నదని సుందరకాండలో వాల్మీకి ఈ ప్రదేశాన్నిపేర్కొన్నారని అంటారు పుష్పగిరిలో దిక్షువుగా పెన్నేరు అవతలి కొండపై పరదేవతకు అభిముఖంగా హనుమంతుడు ప్రతిష్ఠింప బడ్డాడు ఆంజనేయ స్వామి సన్యసించి ఉండడం అన్నది ప్రపంచంలో మరెక్కడా లేదని విజ్ఞులు చెపుతారు పుష్పగిరిని శ్రీకృష్ణదేవరాయల వారు సందర్శించారని అర్చకులుగా ఉండిన తంబళులను తొలగించి బ్రాహ్మణులను నియమించారని వారికి అగ్రహారాలను దానం చేశారని తెలుస్తున్నది

ఇక్కడి పుష్పగిరి పీఠం ఆదిశంకరాచార్యుల కంటె ముందు నుండే హిందూపీఠంగా ఉండినదని పేర్కొంటారు పుష్పగిరి లోని చంద్రమౌళీశ్వరుని లింగం నాలుగు పీఠాలలోని లింగాల కంటె పెద్దది ఆదిశంకరాచార్యుల వారు పుష్పగిరిని సందర్శించి శ్రీచక్రాన్ని నిర్మించారు చంద్ర మౌళీశ్వరుని లింగం కైలాసం నుండి నేరుగా ఈ పీఠంలో వెలసిల్లిందని ప్రతీతి

విద్యారణ్య స్వామి వారి చేత నెలకొల్పబడిన మఠాధిపతుల పరంపర ఈ నాటికిని ధర్మ ప్రచారంలో కనిపిస్తున్నది నిత్య అన్నదానాలు కొనసాగుతున్నాయి

పుష్పగిరి అద్వైత పీఠం టిప్పుసుల్తాను నుండి ఇతర నవాబుల నుండి కూడా జాగీరులను పొందింది పుష్పగిరి పీఠానికి ప్రస్తుతం 3215 ఎకరాల భూమి ఏడుకిలోల బంగారు ఆభరణాలు 16 లక్షల రొక్కం ఉన్నాయి

చైత్ర బహుళ త్రయోదశి మొదలుకొని వైశాఖ శుద్ధ సప్తమి వరకు ప్రతి సంవత్సరం ఇక్కడ జరిగే ఉత్సవాలలో ఆబాల గోపాలం పాల్గొంటారు ఈ క్షేత్రాన్ని మంచి యాత్రా కేంద్రంగా తీర్చి దిద్ద వలసిన బాధ్యత ప్రభుత్వంపై ఎంతగానో ఉంది

—వ్యాసం ఫోటోలు,
లాల్‌మహమ్మద్‌యాకూబ్




(గత సంచిక తరువాయి)

రాజేష్, జరిగిన విషయమంతా తన ఫ్రెండ్సందరికీ చెప్పాడు. ఎలాగైనా సరే రంగాను ఎలక్షన్లలో ఓడించాలని నిశ్చయించారు అంతా. ఒంటరిగా రాజేష్‌ను ఎక్కడికి వెళ్ళొద్దని చెప్పారు.

ఎలక్షన్ల ప్రచారం ముమ్మరంగా సాగుతోంది.

రంగా దుశ్చర్యలు అందరికీ తెలుసు కాబట్టే చాలామంది విద్యార్థులు రాజేష్‌ను సపోర్టు చేస్తున్నారు.

కాని రంగాకు భయపడి ఎవ్వరూ బయట పడటంలేదు.

రంగా విపరీతంగా డబ్బు వెదజల్లుతున్నాడు. ప్రతి విద్యార్థికి సుష్టుగా మేపటం, అడిగినవాడికీ అడిగినంత డబ్బు ఇస్తూ అందర్నీ బ్రాందీలో ముంచెత్తుతున్నాడు.

రంగా గెలుపు ఖాయమనుకొన్నాడు. ఎవరు చూసినా రంగా ముందు గ్యారంటీగా ఓటు వేస్తామంటున్నారు.

రేపే ఎలక్షన్ జరిగే రోజు.

ఎలక్షన్ ముందు రోజు తమ ప్రచారం అంతా ముగించుకొని రాజేష్ మరియు అతని మిత్రులు రాత్రి 9 గంటలకు ఇంటికి బయలు దేరారు.

రాజేష్ ఇంటికి ఒక ఫర్లాంగ్ ఇవతల ఒక సందులో మిత్రులు చీలిపోయారు.

రాజేష్ ఒంటరిగా ఇంటికి బయలుదేరాడు. ఇంటిదాకా మిత్రులు తోడు వస్తామన్నా ఫరవాలేదని చెప్పి వారిని పంపివేశాడు, అనవసరంగా వారికి శ్రమఎందుకని.

హఠాత్తుగా ఇద్దరు వ్యక్తులు తలనిండా ముసుగు ధరించి, వెనక నుంచి వచ్చి రాజేష్ తలపై కర్రలతో కొట్టారు.

"అమ్మా" అంటూ రాజేష్ కుప్పకూలిపోయాడు

క్రిందపడ్డ రాజేష్‌ను ఇష్టం వచ్చినట్టు కొట్టసాగారు ఆ వ్యక్తులు

ఇంతలో రాజేష్ కేకవిని ప్రక్కనుండే ఇళ్ళనుంచి మనుషులు వస్తున్న చప్పుడు వినపడేసరికి ఆ ఇద్దరు వ్యక్తులు రాజేష్‌ను కొట్టడం ఆపి పారిపోయారు.

**జరిగిన కథ-2 :** సలీం, జావేద్ అనే ఆగంతకులు గణేశ్ ఇంట్లో జొరబడి గణేశ్‌ను చంపేస్తారు 'సంతోష్ ఎంటర్ ప్రైజెస్'లో విజయకుమార్‌కు జరిగిన ఇంటర్వ్యూ విఫలమవుతుంది. విచారంతో ఉన్న విజయ్‌ని తల్లి సుందరమ్మ, ప్రేయసి నర్మద ఓదారుస్తారు. కొంత కాలానికి విజయ్‌కు ఎస్ ఐ ఉద్యోగం వస్తుంది ట్రయినింగ్‌కు వెళ్ళిపోతాడు కాలేజీ విద్యార్థుల బలవంతం మీద రాజేష్ పేరుమోసిన రౌడీ రంగాపై పోటీకి నిలబడతాడు

వచ్చినవారు రాజేష్‌ను చూసి గుర్తుపట్టి రాజేష్‌ను ఇంటికి చేర్చారు

రాజేష్‌ను చూస్తూనే సుందరమ్మ ఏం జరిగింది బాబూ అంటూ అక్కడున్న వార్ని అడిగింది

జరిగిన విషయమంతా వారు చెప్పారు

సుమతికైతే ఏడుపొక్కటే తక్కువైంది ముఖంలో

నెత్తురు ముద్దలా తయారయ్యాడు రాజేష్

"బాబూ తొందరగా హాస్పిటల్‌కు వెళ్ళాలి సహాయం చేయండి" అంటూ ప్రాధేయపడింది వారిని సుందరమ్మ.

వారందరి సహాయముతో రాజేష్‌ను హాస్పిటల్‌లో జేర్పించింది సుందరమ్మ.

బ్లడ్ చాలా పోయిందని చెప్పి బ్లడ్ ఎక్కించారు డాక్టర్‌గారు

ఏం ఫర్వాలేదు. ప్రాణానికేమీ అపాయంలేదని చెప్పారు డాక్టరుగారు

ఆ రాత్రంతా సుందరమ్మకు, సుమతికి నిద్రలేదు

ఇద్దరూ రాజేష్ బెడ్ కిరువైపులా కూర్చున్నారు

ఉదయానికల్లా జరిగిన విషయమంతా రాజేష్ మిత్రులకు తెలిసిపోయింది

అందరూ హాస్పిటల్‌కు వచ్చారు

ఇదంతా రంగా చేసిన పనేనని వారు గట్టిగా నిశ్చయించుకొన్నారు

అప్పటిదాకా సుందరమ్మకు రాజేష్ ఎలక్షన్లలో పోటీ చేసిన విషయమే తెలీదు.

"చూడండి బాబూ అనవసరంగా మా రాజేష్‌ను ఆ రొంపిలోనికి లాగకండి చూడండి ఎంత పని జరిగిందో హాస్పిటల్‌కు రావటం కొంచెం లేటయితే మా రాజేష్ మాకు దక్కేవాడుకాదు' అంటూ ఏడ్చింది సుందరమ్మ

అందరూ సుందరమ్మని ఓదార్చారు

మధ్యాహ్నం 12 గంటలకు రాజేష్ పరిస్థితి నార్మల్‌కొచ్చి డిశ్చార్జ్ అయ్యాడు

అప్పుడు వెళ్ళారు విద్యార్థులందరు పోలింగ్‌కి

అప్పటికే కాలేజి విద్యార్థులకి, స్టాఫ్ మొత్తానికి తెలిసిపోయింది రాజేష్‌ను రంగా కొట్టించాడని.

దీనివలన ఒకరిద్దరు రంగాకు ఓట్లేద్దాము అనుకొన్న వాళ్ళు కూడా రాజేష్‌కే ఓటేశారు.

ఫలితం..

డిపాజిట్టు కూడా రాకుండా ఓడిపోయాడు రంగా

రాజేష్‌ను మిత్రులందరూ అభినందించారు

* * * * * *

బేగంపేట విమానాశ్రయం అంతా ప్రయాణీకులతో కళకళ్ళాడుతూంది

సెండాఫ్ ఇవ్వటానికి వచ్చిన వాళ్ళతో, వచ్చిన వారిని ఆహ్వానించటానికి వచ్చిన బంధువులతో విమానాశ్రయం అంతా చాలా సందడిగా ఉంది

ఇంతలో -

ఢిల్లీ నుంచి వచ్చే విమానం 5 నిముషాల్లో రన్‌వే మీదకు దిగబోతుంది అని అనౌన్సర్ ఇంగ్లీష్, హిందీ, తెలుగు భాషలలో అనౌన్స్ చేసింది

గాలరీలో ఆ అనౌన్స్ వినగానే కలకలం బయలుదేరింది అందరూ లాండ్ అవబోతున్న విమానం కోసం ఎదురుచూడసాగారు

అంతలో ఢిల్లీ నుంచి వచ్చే విమానం రన్‌వేమీద లాండ్ అయింది.

ఒక్కొక్కరుగా లాడర్‌పైనుంచి దిగసాగారు

ఆఖరుగా దాదాపు 25 సంవత్సరాల వయసుగల ఓ యువకుడు దిగాడు గ్రీన్ ఫుల్‌సూట్లో గాగుల్స్ పెట్టుకొని దాదాపు ఆరు అడుగుల పొడవు ఉన్నాడు ఆ యువకుడు.

చకచకా ప్లేన్‌దిగి ఎంట్రన్స్ వైపు నడుస్తున్నాడు ఆ యువకుడు

"ఎక్స్క్యూజ్ మి"

ఎవరో తనను పిలిచినట్టవటంతో చటుక్కున ఆగి వెనక్కి తిరిగాడు ఆ యువకుడు.

ఎదురుగా పోలీస్ యూనిఫాంలో ఇన్‌స్పెక్టర్ నిలబడి ఉన్నాడు

"వాట్!?" ప్రశ్నార్థకంగా ఇన్‌స్పెక్టర్ మొఖంలోకి చూశాడు ఆ యువకుడు

"సారీ ఫర్‌ది ట్రబుల్‌సార్ ఢిల్లీ నుంచి వజ్రాలు ఈ ప్లేన్‌లో నుంచి వచ్చే వ్యక్తుల ద్వారా స్మగ్లింగ్ అవుతున్నాయని మా డిపార్టుమెంట్‌కు ఇన్ఫర్మేషన్

అందింది. అందుకని అందర్నీ చెక్ చేస్తున్నాము. మిమ్మల్ని కూడా చెక్ చేయాలి" అన్నాడు ఇన్స్పెక్టర్.

"వైనాట్ ఇటీజ్ యువర్ డ్యూటీ! చెక్ చేయండి" అన్నాడు ఆ యువకుడు.

"బైదిబై మీ పేరు" అడిగాడు ఇన్స్పెక్టర్ ఆ యువకుడి బ్రీఫ్‌కేస్ చెక్ చేస్తూ.

"ఆనంద్" బదులిచ్చాడు ఆ యువకుడు.

బ్రీఫ్‌కేసులో ఒక జత బట్టలు, టూత్‌పేస్ట్, బ్రష్ తప్ప ఇంకేమీ కన్పించలేదు ఇన్స్పెక్టర్‌కి.

బ్రీఫ్‌కేస్ చెక్ చేయటం పూర్తయిన తర్వాత ఆ యువకుడిని చెక్ చేశారు ఇన్స్పెక్టర్.

ఫాంట్ జేబులో పర్సు తప్ప ఇంకేమీ కన్పించలేదు. షర్ట్ జేబులో నవాల్జిన్ టాబ్లెట్స్ అట్ట కన్పించింది. దానిని బయటకు తీశారు ఇన్స్పెక్టర్.

"నాకు జర్నీలో ఎప్పుడూ తలనొప్పి వస్తుంటుంది. అందుకని ఎప్పుడూ నావెంట నవాల్జిన్ టాబ్లెట్స్ తెచ్చుకుంటాను" అన్నాడు ఆ యువకుడు ఆ టాబ్లెట్స్‌ను చూపిస్తూ.

"ఇప్పుడుకూడా కాస్త తలనొప్పిగా ఉంది" అంటూ ఒక టాబ్లెట్‌ను చేతిలోకి తీసుకొని నోట్లోవేసుకొని ప్రక్కనే ఉన్న కుళాయి దగ్గర గ్లాసులో మంచినీళ్ళు పట్టుకొని మింగాడు టాబ్లెట్‌ను ఆనంద్.

"ప్లీజ్ యుకెన్‌గో సర్. సారీఫర్‌ది ట్రబుల్" అన్నాడు ఇన్స్పెక్టర్.

"ఇట్సాల్‌రైట్.... ఇట్సాల్‌రైట్". అంటూ ముందుకు నడిచాడు ఆనంద్.

ఎయిర్‌పోర్ట్ బయటికి వచ్చి "టాక్సీ" అని పిలిచాడు ఆనంద్.

ఒక టాక్సీ వచ్చి ఆనంద్ ముందు ఆగింది.

వెనక డోర్ తెరచుకొని కూర్చుంటూ 'హోటల్ క్లాసిక్' అన్నాడు ఆనంద్ డోర్ వేస్తూ.

టాక్సీ ముందుకు దూకింది.

సీటు వెనకాల జారగిలబడి హైదరాబాద్ అందాలను చూడటంలో మునిగిపోయాడు ఆనంద్.

ఆనంద్ ఎక్కిన టాక్సీ బయలు దేరగానే వెనకాలే ఒక టాక్సీ బయలుదేరి వెంటాడసాగింది ముందు పోతున్న టాక్సీని.

వెనక వస్తున్న టాక్సీని గమనించాడు ఆనంద్ రివర్‌వ్యూ మిర్రర్‌లో నుంచి చూసి.

మొదట చూసి కాజువల్‌గా ఏదో టాక్సీ వస్తుందనుకొన్నాడు. కాని ఆ టాక్సీ విడవకుండా వెంటాడటంతో అనుమానం ధృవపడింది ఆనంద్‌కు.

అదీగాక వెనక వస్తున్న టాక్సీ డ్రైవర్ ఇందాక ఎయిర్‌పోర్టులో తనను ఆపి చెక్ చేసిన ఇన్స్పెక్టర్ మాదిరిగా ఉన్నాడు అనుకొన్నాడు ఆనంద్.

ఇంతలో డ్రైవర్ రూట్ మార్చాడు.

క్లాసిక్ హోటల్‌కు వెళ్ళేదారిగాక ఇంకొకదారి వైపు మళ్ళించాడు టాక్సీని డ్రైవర్.

అది గమనించి కూడా గమనించనట్లే ఏం జరుతుందోనని చూస్తూ ఊరుకున్నాడు ఆనంద్.

ఇంతలో వెనక వస్తున్న టాక్సీ ముందు పోతున్న టాక్సీని క్రాస్ చేసి టాక్సీ ముందుకొచ్చి ఆగింది.

అది చూసి ఈ టాక్సీని కూడా ఆపాడు డ్రైవర్.

ముందు ఆగిన టాక్సీలోంచి ఇద్దరు వ్యక్తులు దిగి ఆనంద్ దగ్గరకొచ్చారు.

"మిస్టర్ ఆనంద్ కారు దిగండి"

"ఎందుకు?"

"మేము మీ దగ్గరున్న వజ్రాల కోసం వచ్చాం. అవి ఇవ్వండి. మేము వెళ్ళిపోతాము" అన్నాడు ఇన్స్పెక్టర్ వేషం వేసుకొని ఇందాక చెక్‌చేసిన వ్యక్తి.

"ఇందాక చెక్‌చేశారుగా ఉంటే అప్పుడే దొరికేవిగా? అన్నాడు ఆనంద్ కారు దిగుతూ.



## ఆశయం

"చెక్ చేస్తేనే దొరికితే మాకీ శ్రమంతా ఎందుకు? మిస్టర్ ఆనంద్ మర్యాదగా ముందు వజ్రాలు బయటకు తీయండి" అన్నాడు ఆ వ్యక్తి రివాల్వర్ బయటకు తీస్తూ

అంతే.....

సడన్‌గా ఎప్పుడు తీశాడో ఏమో రివాల్వర్ తీసి ఆ వ్యక్తి రివాల్వర్‌కి గురిపెట్టి కాల్చాడు ఆనంద్

అబ్బా అంటూ రివాల్వర్‌ను క్రింద పడేసి చేయి పట్టుకొన్నాడు ఆ వ్యక్తి

"మిస్టర్స్ ముందు మీరెవరో చెప్పండి? ఆ తర్వాత నా విషయం ఆలోచిద్దాం" అన్నాడు ఆనంద్ చిద్విలాసంగా నవ్వుతూ రివాల్వర్ గురిపెట్టి

"మేము ఇక్కడ నివసించే గూండాలం మీదగ్గర డబ్బు ఏమన్నా ఉంటుందేమోనని అనుమానంతో వెంటాడాము" అన్నాడు ఆ వ్యక్తి.

"నేనేమీ చెవిలో పువ్వు పెట్టుకోలా! మీరు చెప్పేవన్నీ నమ్మటానికి సాధారణ గూండాలకి ఇన్ని తెలివి తేటలుంటాయని నేననుకోను. చెప్పండి మీరెవరు? మీ బాస్ ఎవరు? లేకుంటే ఇక్కడికిక్కడే కాల్చిపారేస్తాను" అన్నాడు ఆనంద్.

"నాపేరు సలీమ్. నా ఫ్రెండ్ జావేద్ మీ దగ్గర వజ్రాలున్నాయని మాకు తెలిసి మిమ్మల్ని వెంటాడాము. కాని బాడ్‌లక్ మా లక్ బాగాలేదు. మీ చేతిలో దొరికి పోయాము" అన్నాడు సలీమ్

"అంతేనా. . ఇంకా మీ వెనక ఎవరన్నా ఉన్నారా?"

"నో .. నో. .. ఎవ్వరూలేరు. మాకు మేమే బాసులం" అన్నాడు సలీమ్

సలీమ్ జావేద్‌లకు అంతకు ముందే "ముసుగు మనిషి" ఇన్ఫర్‌మేషన్ అందిచ్చాడు ఆనంద్ వజ్రాలతో వస్తున్నాడని అందుకని ప్లాన్‌చేసి ఆనంద్‌ని పట్టుకొన్నారు. కాని ప్లాన్ ఫలించలేరు.

"సరే మీరు ఎవరైనా అమాయకులను చూసుకోండిగాని నాలాంటివాడి వెంట పడకండి. ఈసారి ఎక్కడైనా తారసపడ్డారంటే మీ ప్రాణాలు తీస్తాను. జాగ్రత్త" అంటూ ముందు ఆగిఉన్న టాక్సీలో ఎక్కి డ్రైవింగ్‌సీటో కూర్చొని వెనుక ఉన్న టాక్సీ టైరును బరస్ట్ చేశాడు రివాల్వర్‌తో కాల్చి ఆనంద్

'గుడ్‌బై' అంటూ క్లాసిక్‌హోటల్ కెళ్ళే దారి మళ్ళించాడు టాక్సీని ఆనంద్.

టైరు బరస్ట్ కావటంతో వెంటాడటానికి అవకాశం లేకపోయింది సలీమ్ జావేద్‌లకు

వీడెవడో మనల్ని మించిన గూండా లాగున్నాడే అన్నాడు జావేద్ వెళ్ళిపోతున్న ఆనంద్ నుద్దేశించి

* * * * *

టాక్సీవచ్చి హోటల్ క్లాసిక్ ముందాగింది

హోటల్ క్లాసిక్ ఆరు అంతస్థులతో 120 రూములతో నిర్మించబడిన అధునాతనమైన బిల్డింగ్. డబ్బు పారేస్తే అక్కడ దొరకని వస్తువేలేదు. మందు నుంచి మగువ వరకూ అన్నీ దొరుకుతాయి అక్కడ.

టాక్సీ డోర్ మూసి హోటల్లోకి నడిచాడు ఆనంద్.

"వేరీజ్ రూం నెంబర్ 116?" అడిగాడు ఆనంద్ రిసెప్షన్‌లో నున్న యువతిని.

"సిక్త్ ఫ్లోర్" జవాబిచ్చింది ఆ యువతి.

"థాక్యూ" అంటూ లిఫ్ట్‌లోనికి ప్రవేశించి సిక్త్ ఫ్లోర్‌లో ఆగాడు ఆనంద్

రూమ్ నెంబర్స్ చూసుకొంటూ ముందుకు కారిడార్‌లో నడిచాడు ఆనంద్

రూమ్ నెంబర్ 116 ముందు ఆగాడు ఆనంద్.

డోర్ లోపలవైపు నుంచి లాక్ చేయబడి ఉంది

కీ హోల్‌లో నుంచి చూశాడు ఆనంద్

లోపల ఇద్దరు వ్యక్తులు కూర్చొని బీర్ త్రాగుతూ ఉన్నారు

ఆనంద్ కాలింగ్ బెల్ బటన్ నొక్కాడు

ఎవరో తలుపు తీస్తున్న చప్పుడయ్యింది

డోర్ తీసి పట్టుకొని "ఎవరూ?" అన్నాడు ఓ నలభై సంవత్సరాల వ్యక్తి.

"ఐయామ్ ఆనంద్."

"ఓ! మీరా మీ కోసమే ఎదురు చూస్తున్నాం" అంటూ ప్రక్కకు తొలగి దారిచ్చాడు అతను.

థాంక్యూ అంటూ రూమ్‌లోనికి ప్రవేశించాడు ఆనంద్.

టేక్ యువర్ సీట్ అంటూ సీట్ ఆఫర్ చేశారు రెండో వ్యక్తి.

"థాంక్యూ" అంటూ ప్రక్కనే ఉన్న ఛైర్‌లో కూర్చున్నాడు ఆనంద్.

'హాట్ డ్రింకా? కూల్ డ్రింకా?' అడిగారు ఆ వ్యక్తి.

నో నో... ఇప్పుడేమీ వద్దు ముందు పనికానివ్వండి. నేను అర్జంటుగా వెళ్ళాలి అన్నారు ఆనంద్.

'సరే ముందు వజ్రాలివ్వండి'.

'బైది బై మిస్టర్...'

"చిదానందం" అందిచ్చాడు ఆ వ్యక్తి.

"యస్ మిస్టర్ చిదానందం నేను వజ్రాలు తెస్తున్నట్టు మీకు కాక ఇంకెవ్వరికైనా తెలుసా?"

"నో మిస్టర్ ఆనంద్. మాకు తప్ప ఇంకెవరికీ తెలియదు. ఏం అలా అడిగారు?"

"ఏంలేదు. ఎక్కడ క్యాష్".

ప్రక్కనే ఉన్న బ్రీఫ్‌కేస్ అందిచ్చాడు చిదానందం.

బ్రీఫ్‌కేస్ తెరిచి చూపిస్తూ "ఇవిగోండి. 10 లక్షలు హార్డ్‌క్యాష్ చెక్ చేసుకోండి" అన్నాడు.

"నో.... చెక్ చేసుకోవటం దేనికి. పగవాడినైనా నమ్మటం నాకలవాటు. అటువంటిది మిత్రులైన మీపైన నాకు నమ్మకముండదా" అంటూ పాకెట్‌లో నుంచి నవాల్జిన్ టాబ్లెట్స్ పాకెట్ తీసి ముందున్న టేబిల్‌పై పెట్టాడు.

"ఇదేమిటి నవాల్జిన్ టాబ్లెట్స్ ఇచ్చారు" అడిగాడు ఆశ్చర్యంగా చిదానందం.

"మిస్టర్ చిదానందం అవే 10 లక్షల విలువ చేసే వజ్రాలు" అన్నాడు ఆనంద్.

"వాట్"!?

"యస్" అంటూ పాకెట్ చేతోతీసుకుని చింపి చూపించాడు. చుట్టూ టాబ్లెట్స్ ఉన్నాయి. మధ్యలో మాత్రం టాబ్లెట్స్ ఉండవలసిన స్థానంలో ఒక్కొక్క వజ్రముంది. మొత్తం పది వజ్రాలు. ఒక్కొక్కటి ఒక్కొక్క లక్ష విలువ చేస్తుంది.

"రియల్లీ యువార్ ఎగ్రేట్ మిస్టర్ ఆనంద్", అభినందించాడు ఆనంద్‌ని చిదానందం.

పది లక్షలు క్యాష్ తీసుకుని "గుడ్‌బై" అంటూ వెళ్ళిపోయాడు ఆనంద్.

* * * * *

"పోస్ట్"

"నర్మదా ఏదో లెటరొచ్చింది చూడు" అంది సుమిత్రమ్మ

నర్మద లోపలనుంచి వచ్చి లెటరు అందుకొంది.

ఫ్రమ్ అడ్రస్ చూసింది. విజయ్ దగ్గర నుంచి వచ్చింది లెటరు

"ఎక్కడనుంచి అమ్మా లెటరు" అడిగింది సుమిత్రమ్మ

"విజయ్ దగ్గరనుంచి అమ్మా" అంటూ తన రూమ్‌లోకి వెళ్ళింది నర్మద తనలో తనే నవ్వుకుంటూ.

అప్పటికి లెటర్ వచ్చి విజయ్ దగ్గరనుంచి దాదాపు వారం రోజులయింది. కనీసం వారానికొక్క ఉత్తరమైనా వ్రాయాలని వాగ్దానం చేయించుకొంది విజయ్‌చేత నర్మద ట్రైనింగ్‌కి పోయేముందు.

రూమ్‌లో బెడ్‌పైపడుకొని లెటరు విప్పింది నర్మద.

ప్రియమైన నర్మదాదేవి గారికి-

నీ ప్రాణ సఖుడు, మనో వల్లభుడు మానస చోరుడు అనేక ముద్దులతో వ్రాస్తున్న ప్రేమలేఖ. ఈ లేఖ ఎప్పటి మాదిరి సాధారణమైన ప్రేమలేఖకాదు. దీనిలో ఒక శుభవార్త వ్రాస్తున్నాను. అది ఏమిటో నువ్వే ఊహించుకో.

నిన్ను చూడాలని నీ సన్నిధిలో వాలాలని ఈ దీనుడు ఎంతగానో అనుకుంటున్నాడు. కాని ఈ ట్రైనింగ్ ఒకటి, నా ప్రాణానికి. అందుకే వద్దంటే నువ్వు విన్నావు కాదు. ఈ వెధవ ఉద్యోగంలో కుదిర్చావు.

ఇంతకీ నేను చెప్పబోయే శుభవార్త ఏమిటో తెలుసా? ఈ లెటర్ చేరిన రెండో రోజుకు అంటే 20వ తేదీ 3 గంటలకల్లా నీ ముందు వాలతాను. రైల్వే స్టేషన్‌కు వస్తావని ఆశిస్తున్నాను. ఇంటికి కూడా లెటరు వ్రాస్తున్నాను.

ఇట్లు,

అనేక ముద్దులతో నీ

విజయ్ కుమార్

లెటరు చూసి నవ్వుకొంది నర్మద. విజయ్‌కుమార్ అని ఉన్న చోట పదేపదే ముద్దులు పెట్టుకొంది.

"ఏమని వ్రాశాడమ్మా" అడిగింది సుమిత్రమ్మ అక్కడికి వచ్చి.

"20 వ తేదీ వస్తున్నాడని వ్రాశాడమ్మా" చెప్పింది నర్మద.

"అలాగా" అంది సుమిత్రమ్మ.

విజయ్ ఊహలతో, తలపులను మధురంగా ఊహించుకొంటూ బెడ్‌మీద అలాగే పడుకొంది నర్మద.

* * * * * * *

విజయ్ ఫ్రెండ్సుందరి దగ్గర వీడ్కోలు తీసుకొని ట్రైన్ ఎక్కాడు.

విజయ్ ఆ రోజు ఊరికి వెళ్తున్నాడని దాదాపు ట్రైనింగ్ సెంటర్‌లో పరిచయమయిన ఫ్రెండ్సందరూ సెండాఫ్ ఇవ్వటానికి రైల్వేస్టేషన్‌కి వచ్చారు.

గార్డ్ వచ్చి జెండా ఊపి గ్రీన్ సిగ్నల్ ఇచ్చాడు. ట్రైన్ బయలు దేరింది.

విజయ్ కిటికీ ప్రక్కగా కూర్చొని కదిలే చెట్లను, పర్వతాలను చూస్తూ ఉన్నాడు.




అంతలో...

ధన్‌మనే పెద్ద శబ్దమయింది. ఏం జరిగిందో ఊహించే లోపల పెద్దగా భూకంపం వచ్చినట్టు కంపార్ట్‌మెంటంతా అదిరింది. కంపార్ట్‌మెంట్ ఎడమ ప్రక్కకు వాలిపోయింది. ట్రైన్ ఎదురుగా వస్తున్న ఇంకో ట్రైనుకు గుద్దుకొని పట్టాలు తప్పి ప్రక్కకు తిరగబడింది.

కిటికీ ప్రక్కన కూర్చొని ఉన్న విజయ్ ఎగిరి ఇవతల పడ్డాడు. పైన బెర్త్‌పై ఉంచిన లగేజి అంతా విజయ్‌పై పడింది.

"అమ్మా" అంటూ మూలిగాడు విజయ్.

* * * * *

"విజయ్" అంటూ పెద్దగా అరిచి ఉలిక్కిపడి లేచి కూర్చుంది నర్మద.

"నర్మదా ఏమిటి అంతలావున కేక పెట్టావు?" అంటూ గదిలోకి వచ్చింది సుమిత్రమ్మ.

"ఏంలేదు. ఏంలేదు." సమాధాన మిచ్చింది నర్మద.

"ఏమిటో ఈ మధ్య అదోలాగున్నావు". అంటూ పని చూసుకోవటానికి వెళ్ళిపోయింది నర్మద.

అబ్బ ఎంత భయంకరమైన పీడ కల? ఎప్పుడూ లేంది పగలు ఇలా నిదరపోవటం? ఇలా పీడకల రావటం... తనను తానే తిట్టుకొంది నర్మద.

(ఇంకా ఉంది)

# మాయమైన శిద్ధవటం కాయలు



శిథిలమైన శిద్ధవటం కోటవద్ద నీరు లేక ఎండిన పెన్నానది. ఒకప్పుడు ఈ ఏరంతా దోస తీగలతో కళకళలాడుతూ వుండేది

రాయలసీమలోని నల్లమల కొండలు అంతమయ్యే చోట కడపజిల్లాలో లంకమలలు ప్రారంభమౌతాయి కడప జిల్లా నదిబొడ్డులో వున్న ఎన్నద్ది కొండ క్రింద శిద్ధవటం క్షేత్రం వెలసి వుంది. దక్షిణాన పెన్నా నది, ఉత్తరాన లంకమలల పర్వతశ్రేణి ఏటి ఒడ్డున మట్టిరాజులు నిర్మించిన అతి పురాతనమైన కోట "స్విట్జర్లాండ్ ఆఫ్ ఇండియా" అని సీమ దొరలచే కొనియాడబడిన కమనీయ దృశ్యం ఇప్పుడు సీమతుమ్మ చెట్లతో కొండల్లో, కోనల్లో కలిసిపోయిన విషాద స్మృతి. దక్షిణ భారత (ద్రవిడ) రాజుల, తురుష్కుల, ఆంగ్లేయుల సంస్కృతి మేళవింపబడిన (ఎత్నిక్ సింథసిస్) ప్రదేశం

జ్యోతి గ్రామం నుండి గొల్లపల్లె వరకు దాదాపు నలభై దశాబ్దాల క్రితం వరకు పెన్నా నదిలో దోసకాయలు, కరబూజ కాయలు విశేషంగా పండించేవారు. శిద్ధవటం దగ్గర పెన్నా నదిలో వేసే తీగ కాపంతా "శిద్ధవటం కాయలు"గా పేరుగాంచింది అప్పట్లో లారీలలో దోసకాయలు మద్రాసు, తిరుచునాపల్లి, బెంగుళూరు, హైదరాబాదు మొదలగు నగరాలకు ఎగుమతి జొతూ వుండేవి కాయ తింటే తీపికి పెదాలు అతుక్కుపోయేవి వాటి పేర్లు కూడ అలాగే వుండేవి లద్దు కిర్ని, జామ్ కిర్ని, బత్తాస, దోసకాయ, కరబూజకాయ, బుడంకాయ, కీరకాయ, కంకిడికాయ, నామాలకాయ, హింగన్, బురకాయ కిర్ని, షిరంజ్, షర్బత్ అనార్' శిద్ధవటం కరబూజకాయ ఒక గజం పొడవు వుండేది

ముఖ్యంగా ఈ కాయలను పెన్నా నది ఇసుకలో బడుగు వర్గాలవారు మాత్రం సాగు చేసేవారు పంట చేతికంది వస్తే ఈ భూమి పుట్ర లేని పేదలకు కాస్త ఆధారం కానీ పంటంతా కాపు కాసి కోతకు సిద్ధంగా వున్న తరుణంలో వరదల వల్ల కాని లేదా పైనెంచి ఏటికి నీరు వదలడం వల్ల కానీ మొత్తం పంటంతా కొట్టుకపోయే ప్రమాదముండేది అందు వల్ల ఏట్లో నీరు లేని పరిస్థితి ఒక వేళ వున్నా, ఎప్పుడు నీరు వచ్చి కొట్టుకుపోతుందోనని భయం. గుంతలు తీసిన నాటి నుండి ఏట్లో కాపురం వుండి పసి బిడ్డలను చూసినట్లు సాకిన పంట ఏటి నీటికి కొట్టుకు పోతే ఆ బాధ పాపం వర్ణింపనలవి కాదు పోగా, పోగా ఏటిలో నీళ్ళు ఎండిపోగా ఈ కాపు ఏటిని వదలి, గడ్డపైని పంట పొలాలకు వలసపోయింది అంచేత కాయ నాణ్యం తగ్గింది, కాపూ తగ్గింది.

బడుగు వర్గాల వారు ఏటికి నీరు తగ్గు ముఖం పట్టగానే మొల లోతు నీళ్ళలో వెళ్ళి వెదురు కట్టిలు నాటి యిసుక నేలను నిల్వ చేసుకొనే వారు. తర్వాత అందరూ తమ స్తోమతకు తగినన్ని చెట్లు వేసుకొని ఒకటే ముళ్ళ కంచె వేశేవారు అందరూ సమిష్టిగా సాగు చేసేవారు (కో-ఆపరేటివ్ ఫార్మింగ్). ఈ జాగాకు భూమి శిస్తు లేదు.

శిద్ధవటం కాయల విత్తనాలను బూడిదలో కలిపి ఇసుకలో ఎండబెట్టేవారు పెట్టిలలో, తట్టలలో, బుట్టలలో, కుండలలో, చట్లలో భద్రపరచేవారు. డిశంబరు నెల (సీజన్) రాగానే ఈ బడుగు వర్గాలన్నీ పిల్లా, జెల్లాతో, ఏటిలోనే బోద కొట్టం వేసుకొని అక్కడే మకాం పెట్టేవారు పంట చేతికంది వచ్చే వరకూ అక్కడే కాపురం సాప్ బెండూ విత్తనాలకో కుండ, కత్తి, చాకూ, జాకు అన్నీ వుండేవి. రాత్రులు అడవి పందులూ, నక్కలూ, తోడేళ్ళులాంటి వన్య మృగాలు రాకుండ జాగ్రత్త పడాల్సి వచ్చేది వారికి.

ఈ దోసకాయలు తీగ జాతికి చెందినవి, అవి మూడు నెలలు మాత్రం బ్రతుకుతాయి పైన మాత్రం ఒక అంగుళం మందం గల ఎండు ఇసుక వుండాలి. క్రింద ఎప్పుడూ నీరు వుండాలి. ఆ వాతావరణ పరిస్థితులలోనే (హబిటాట్) దోసకాయలు పండుతాయి

దోస విత్తనాలను గుడ్డలో మూట కట్టి నీళ్ళలో ఒక రోజు నానబెడ్తారు మూడవ రోజు ఒక అడుగు వెడల్పు, వీలైనంత పొడవూ కొలతలతో, చెమ్మ అగపడే వరకూ గుంత తీస్తారు. గుంత మధ్యలో రెండు చదరపు అంగుళాల ఇంకో చిన్న గుంత తీస్తారు. అందులో రెండు చటుకుల (అరపావు) పేడ ఎరువు వేస్తారు. తర్వాత మూటలో నుండి మొలకెత్తిన ఒక విత్తనాన్ని అందులో నాటి పైన అరచటాకు పేడ ఎరువును చెమ్మ ఇసుకతో కలిపి దానిపై చల్తారు

మూడు, నాలుగు నాళ్ళలో విత్తనం మొలకెత్తుతుంది. తర్వాత మూడు రోజులకు చెట్టుకు చుట్టూ కొంచెం ఇసుక తీస్తారు దాంట్లో గవ్వెరువు వేస్తారు. దీనినే కొద్దిగా వేయడం వల్ల "చిన్న ఎరువు" అని, మొలక చుట్టూ వేయడం వల్ల "చుట్టెరువు" లేక "చిట్టెరువు" అని పిలుస్తారు మెత్తగా దంచి జల్లెడ పట్టి వేయడం వల్ల దీనిని "చక్కెర ఎరువు" అని కూడ అంటారు.

తర్వాత వారం రోజులకు పెద్ద ఎరువు కడ్తారు, దీన్ని దిబ్బ ఎరువు. చనక్కాయ పిండి, వేప పిండి, కానుగ పిండి, ఆముదం పిండి మొదలగు క్రిమిసంహారక పదార్థాలు కలిపి పొడి చేసి తయారు చేస్తారు. చెట్టు చుట్టూ గుంత తీసి, అందులో వేసి, పూడుస్తారు, అందుకే అచ్చమైన శిద్ధవటం కాయలకు తెగులు పట్టేది కాదు. తర్వాత ఇసుకను దిన్నెలుగా, ఏటవాలుగా అమర్చుకొంటారు. ఎందుకంటే, చెట్టు పై భాగానికి ఏ మాత్రము చెమ్మ తగిలినా కుళ్ళిపోతుంది. ఇంత పకడ్బందీగా పెంచితే తర్వాత వారం రోజులకు చెట్టు జానెడు తీగ వేస్తుంది ఆ తీగలను సరి దిద్దుతూ, వేరే తీగలతో కలువకుండా జాగ్రత్త పడాలి. ఈ పని కాపు కాసేంత వరకు వుంటుంది.

తర్వాత అరవై, డెబ్బై రోజులకు కాయలు తినే దానికి తయారౌతాయి. కాయ చాల తియ్యగా వుంటే అది చెట్టుకు కాసిన ఒకే ఒక కాయ అని చెప్పవచ్చు. మామూలుగా ఒక చెట్టు మూడు కాయలకు మించి కాయదు.

ఈ కాపు తోటి కాయకూరలు, ఆకు కూరలు కూడా వేసేవారు చుక్క కూర, పాయలాకు, బేండేసే కాయ, గుత్తి బీర, ఇంకా ఎన్నో రకాల కూరకాయలూ, ఆకు కూరలు.

ఇలా మూడు నెలలు ఇసుకలో, ఎండలో ఎంతో శ్రమించి, అదొక కళగా సాగు చేశాక ఎంతో నాణ్యత కల శిద్ధవటం దోసకాయలు, కరబూజకాయలు ఉత్పత్తి అయ్యేవి. ఆ కాలంలో కాయల ధర బంది ఒకటికి (నూరు కాయలు) పది రూపాయలకు లోపు వుండేది. కాపు మొదలవగానే ఏటి ఒడ్డున వచ్చే పోయే వారికి అర్ధణా, అణాకు అక్కడికక్కడే 'టాకా (శాంపిల్) వేసి రుచి చూపించి చప్పరించాకే చిల్లరగా అమ్ముకొని బ్రతికేవారు టోకుగా ఎగుమతి చేసేవారు ఆ తీపి తలచుకుంటే నోరూరుతుంది.

కాలం మారే కొద్దీ సంకర జాతి (హైబ్రీడ్) పుణ్యమా అని ఆనాటి శిద్ధవటం కాయలు, ఈనాటి బూడిద గుమ్మడి కాయలతో కలిసి, ఇప్పుడు మనం తినే నాసి రకం కాయలుగా తయారయ్యాయి వాటినే ఇప్పుడు మనం పప్పాయి, నామాల కాయ అని అంటున్నాం, తింటున్నాం. ఇవి కాపు ఎక్కువ తీపు తక్కువ. ఈ కాయల ధర ఇప్పుడు బంది ఒకటికి నూరు రూపాయల నుండి, నూట యాభై రూపాయల వరకూ పల్కుతూ వుంది పైగా కేజీల లెక్కన తూకం వేసి అమ్మడం!

కాలక్రమేణా పెన్నా నది పైన కట్టలు, ఆన కట్టలు, పట్టణాలకు రక్షిత నీటి సరఫరా పథకాలు, కట్టడముతో ఈ బడుగు వర్గాల పుట్టి మునిగిపోసాగింది. పై పెచ్చు వరద వస్తే, అంతా నదీనాం సాగరే' అన్నట్లు శిద్ధవటం కాయలూ పిల్లా, జెల్లా, పురుగు, పుట్రా, పాములు, తేళ్ళు, జెర్రులు, పుర్రెలు, పుడకలు నెల్లూరు వద్ద బంగాళాఖాతంలో తేలేవి.

ఇప్పుడు పెన్నా నదిలో ఆ నీరు పూర్తిగా మాయమైంది రాయలసీమ క్రమేణా ఎడారిగా మారసాగింది. నీటితో పాటు ఆనాటి శిద్ధవటం కాయలుకూడా మాయమైనాయి కడకు మనకు సంకర జాతి మాత్రమే మిగిలింది. రత్నాల సీమ అని కొనియాడబడిన రాయలసీమ, రాళ్ళసీమగా మారి, ఏరులు ఎండిపోగా, నీరు లేక ఎడారిగా మారిపోసాగింది. శిద్ధవటం కాయలేం చేస్తాయ్. మాయంగాక! ప్చ్!

వ్యాసం, ఫోటో
శిద్ధవటం నరస రామకృష్ణమూర్తి నాయుడు




"పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చదుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సమ్భవామి యుగేయుగే
సర్వాంతర్యామి అయిన భగవంతుడు ఈ భూమి మీద అవతారాలెందుకు దాల్చవలసి వస్తోందో ఈ శ్లోకాన్నిబట్టి మనకు చక్కగా విదితమౌతుంది.

ఎప్పుడు ధర్మానికి హాని కలుగుతుందో, అధర్మం పెచ్చు పెరిగిపోతుందో ఆయా సమయములందు నేను దుష్ట శిక్షణా, శిష్ట రక్షణా ధర్మ సంరక్షణార్థం అవతారమెత్తుతాను అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. ఈ అవతారాలన్నీ మానవుని బోధ కొరకై పరమాత్ముడు చేసిన లీలలు".

రాత్రి కురిసిన భారీ వర్షానికి ఆ మురికివాద బురదతో మరింత రోతగా తయారైంది. పెంట కుప్పల మీద పడి ఊర పందులు రాసకేళీ విలాసాలు సాగిస్తున్నాయి. మురికి నీటి గుంటల్లో దోమలు పెట్టిన గ్రుడ్లు బాల భాస్కరుని లేత కిరణాలకి మిల మిలా మెరుస్తున్నాయి.

శరీరంపై ఏ ఆచ్ఛాదన లేని పసి పిల్లలు ఆ నీట్లో రాళ్ళు విసురుతున్నారు. మురికి నీరు ఉవ్వెత్తున ఎగురుతూ వుంటే కేరింతలు కొడుతున్నారు. దోమలు ఝుమ్మంటున్నాయి

అదో లోకం కూలి నాలి చేసుకునే జనం, బీదా బిక్కి బ్రతికే ప్రపంచం. వారి స్థితిగతులను కనుక్కునే నాథుడే లేడక్కడ.

శరవేగంతో దూసుకొస్తున్న జీపు ఆ వాడలో కొచ్చి తక్కున ఆగింది.

పిల్లలు ఆటకు స్వస్తి చెప్పి జీపు చుట్టూ చేరారు.

ఫుల్ యూనిఫారంలో పోలీసు ఇన్స్పెక్టరు క్రిందికి దిగి నల్ల కళ్ళద్దాలలోంచి నలువైపులా కలియజూసాడు.

బావి దగ్గర నీళ్ళు తోడుకుంటున్న పడతులు భయంతో బిడియంతో కుండలు తీసుకుని పాకల్లోకి పరుగులు తీసారు.

ఆ దారంట పోతున్న మరో ఆసామి పోలీసు ఆఫీసర్ని యగాదిగా చూసాడు కాలుతున్న చుట్ట పీకను నోట్లోంచి బయటకు తీస్తూ.

"రామం మాష్టారెక్కడుంటున్నారో నీకు తెలుసా?"

ఇన్స్పెక్టరు ప్రశ్నకు తెలుసునన్నట్లుగా తలూపి "అదిగో ఆ మర్రిసెట్టుకాడ కానొచ్చే పాకలో" అన్నాడా వ్యక్తి.

జీపు అక్కడే విడిచిపెట్టి నడుచుకుంటూ ముందుకు సాగాడు ఇన్స్పెక్టరు.

పోలీసోడి రాకకు కారణం తెలియని ఆ చుట్ట పీక ఆసామి అతడు వెళుతున్న వైపు కన్నార్పకుండా చూస్తూ నిలబడిపోయాడు.

మర్రి చెట్టు ప్రాంతం కాస్త శుభ్రంగా వుంది. ముంగిట్లో రంగవల్లులు కానవస్తున్నాయి. అక్కడ ఒక చిన్న కమ్మరిల్లు గట్టిగా గాలి వీస్తే పడిపోయేటట్లుగా వుంది. దాని ముందు రెండు కుక్క పిల్లలు కూర్చుని కుయ్ కుయ్ మంటూ బలహీనంగా మొరుగుతున్నాయి.

పోలీసు ఇన్స్పెక్టరు బూట్లు విప్పి, కళ్ళజోడు తీసి జేబులో పెట్టుకుంటూ లోపలకు చూసాడు-

భగవద్గీతోపన్యాసం చేస్తున్న ఆ వ్యక్తిని చూసి నివ్వెరబోయాడు. పచ్చటి శరీర ఛాయ, నల్లటి గెడ్డం, నుదుట తిలకం, చేతులపై విభూతి రేఖలు, మెడలో రుద్రాక్షమాల వున్న ఆ వ్యక్తి 'రామం మాష్టారేనా?' అన్న సందేహం కలిగింది.

"నమస్కారం మాష్టారూ!"

సుపరిచిత కంఠం కర్ణభేరిని తాకడంతో గీతా పఠనం ఆపి ఆ వచ్చిన వ్యక్తిని పరిశీలనగా చూసాడు

పోలీసు ఆఫీసర్ని చూసి అక్కడ కూర్చుని గీతామృతాన్ని ఆస్వాదిస్తున్న కొంత మంది లేచి వెళ్ళిపోయారు.

"నేను మాష్టారు... మీ శిష్యుడు శేషు" చేతులు జోడించాడు ఇన్స్పెక్టరు.

వెంటనే స్ఫురణకు వచ్చింది. పది సంవత్సరాల క్రితం తన వద్ద చదూకున్న విద్యార్థి అని గుర్తుపట్టగలిగాడు.

అంతే, గతం కళ్ళముందు మెరుపులా మెరిసింది.

* * *

జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో లెఖ్ఖలు మాష్టారుగా అపాయింటయ్యాడు రామం.

ఆ వూరు చిన్నదేగాని రాజకీయాలకు మాత్రం పెద్దదే. అసూయా ద్వేషాలు ఆ వూరి ప్రజల సొత్తు. కక్షలు కావేశాలు పుట్టుకతో వచ్చిన లక్షణాలు. మూర్ఖత్వం వాళ్ళ వూపిరి. నిందారోపణలు వారి హాబీ.

రామానిదదో విధమైన మనస్తత్వం రాజకీయాలంటే పడవు. మిత భాషి. తన పనేమో

తనది. అవసరమున్నంత వరకే తప్ప ఎవ్వరితోను అధిక ప్రసంగం చేయడు. ఒంటి గట్టు రామలింగంలా వున్న అతడిని వాదాలలో దించాలని, పేకాటలో కూర్చోబెట్టాలని శత విధాలా ప్రయత్నించి విఫలులయ్యారు తోటి ఉపాధ్యాయులు.

ఆ వూళ్లో సరియైన వసతి సౌకర్యం లేనందున ప్రక్క వూళ్లో కాపరం పెట్టాడు రామం. బడిలో ఖాళీ దొరికినప్పుడెల్లా పేపర్లు దిద్దుకోవడమో, కాంపోజిషన్లు చూడడమో చేసేవాడు. సాయంత్రం ఐదయేసరికి బస్సెక్కి వెళ్ళిపోయేవాడు.

ఓ రోజు ఆ వూరి రచ్చ బండ దగ్గర గ్రామస్థుల చర్చలో రామం మాష్టారి ప్రసక్తి కూడా వచ్చింది.

"ఈ మధ్య మన బళ్లో కొత్త మాష్టర్ని ఏసారంట నీకేపైనా తెలుసా?" శేషాద్రి ప్రశ్న.

శేషాద్రి అంటే ఆ వూళ్లో కలిమి, పలుకుబడి వున్న వార్డు మెంబరు.

తెలీదన్నట్టు ముఖం పెట్టాడు నాగరాజు.

నాగరాజు ఆ వూరి మోతుబరి. అంతే కాదు పదిహేను సంవత్సరాల నుండి పోటీ లేకుండా ఆ గ్రామ సర్పంచిగా కొనసాగుతున్నాడు. పేరుకు తగ్గట్టే పగ అతడి ప్రవృత్తి. చెప్పుడు మాటలు వినే చెడు అలవాటు కూడా వుంది.

"అప్పుడే రెండు నెలలు అవబోతూ వుంటే"

"ఏ బడి పంతులొచ్చినా ప్రెసిడెంటుగార్ని కలుసుకోవడం, మంచి చెడు మాట్లాడుకోవడం రివాజు. మిమ్మల్ని ఇంత వరకు కలవకపోవడం

## "అమ్మ"

వేధించినా బాధించినా
శపించడం తెలియని
వట్టి వెర్రి బాగులమ్మ –
జీవన తరుశాఖాగ్రంపై
అమిత సహనంతో కూర్చుని
కడుపుతీపి రాగాలను
ఆలపించే కోకిలమ్మ-

–వీరపల్లి వీణా వాణి

## గురుర్బ్రహ్మ

ఆశ్చర్యమే" ఒక వుపాధ్యాయుని ఉవా చ.

"వాడు మీకాడకెందుకొస్తాడు. నేనెదుట పడ్డా ముఖం చాటేసుకుపోతే. ఓ నమస్కారం పారేస్తే అది సొమ్మేం పోయిందవి" అక్కసుగా పలికాడు మల్లునాయుడు

మల్లు నాయుడు నాగరాజు కుడి భుజం

"ఒరే ఈరయ్యా!"

గంభీరమైన నాగరాజు పిలుపుకు చేతులు కట్టుకు నిలబడ్డాడు ఈరిగాడు.

"మనం పిలిసామని సెప్పి ఆ పంతుల్ని ఈడకు తోలుకురా" ఆజ్ఞాపించాడు నాగరాజు.

"అదీ వూళ్లో ఉండేనా?" అన్నాడు మెంబరు.

"హెడ్ క్వార్టర్సులో వుండకపోవడం చాలా అఫెన్సు" అగ్నికి ఆజ్యం పోసాడు మరో వుపాధ్యాయుడు.

సాయంత్రం పూట గ్రామస్థులతో పాటు కొందరు ఉపాధ్యాయులు కూడ అక్కడకు చేరి వారి సంభాషణలో పాల్గొనడం వారి అలవాటు.

"ఇంతకూ ఊళ్లో వుండకపోడానికి కారణ ఏటంటా?"

"మనమన్నా, మన వూరన్నా ఆడికో లెక్కేటి?" అన్నాడు శేషాద్రి.

"మీ అందరి మాటలు ఇంటుంటే ఆడికి తల బిరుసని తెలుస్తానే వుండాది. మనల్ని కాదని ఆడెంత కాలం మన వూర్లో మనగలుగుతాడు"

నాగరాజు మాటలకు గంగిరెద్దుల్లా తలలు వూపారంతా.

ఇలా అకారణంగా ఆ వూరి పెద్దలకి, తోటి ఉపాధ్యాయులకి కూడా అయిష్టుడయ్యాడు రామం

నాగరాజుగారబ్బాయి శేషు ఎనిమిదవ తరగతి చదూతున్నాడు తండ్రికి రామం మాష్టారిపై కోపం వుందని గ్రహించి కావాలని క్లాసుకు ఆలశ్యంగా వచ్చాడు

"ఫస్టు వార్నింగుగా నిన్నీ రోజు లోపలకు పంపిస్తున్నాను రేపటి నుండి లేటవడానికి వీల్లేదు"

రామం మాష్టారి మాటలకు తల ఎగరేసుకుంటూ

నిర్లక్ష్యంగా వెళ్ళి సీట్లో కూర్చున్నాడు శేషు.

మరో రోజు హోం వర్కు చేయలేదేమని శేషుని గదమాయించారు రామం మాష్టారు.

"నా ఇష్టం" అన్నాడు శేషు.

అతడి సమాధానానికి అవాక్కయిపోయిన రామం మాష్టారు వెంటనే తేరుకుని, "ఏమిటా తలబిరుసు సమాధానం" అనాాడు కోపంగా.

"నేనెవర్నో తెలిస్తే మీరట్లా మాట్లాడరు"

"నువ్వు నా శిష్యుడివి. నేను నీకు గురువుని గురువు పట్ల శిష్యుడు విధేయత ప్రకటించడం వాడి కర్తవ్యం.

"మా నాన్న వూరు సర్పంచని తెలీనట్లుంది" శేషు మాటలకి పిల్లలంతా నవ్వారు.

శేషు ప్రవర్తన గురించి ప్రధానోపాధ్యాయులకు చెప్పి వాడిమీద సరియైన క్రమశిక్షణ చర్య తీసుకోమని కోరారు రామం మాష్టారు.

అతడి మాటలు విని ఓ వెకిలి నవ్వు నవ్వారు హెడ్‌మాష్టారు.

ఆ నవ్వులోని అంతర్యం అర్థంగాక అయోమయంగా చూసారు రామం మాష్టారు.

"తరగతి ఉపాధ్యాయుడుగా పిల్లల్ని అదుపులో పెట్టడం చేతగాక నన్ను యాక్షన్ తీసుకోమని అడగడానికి మీకు సిగ్గు వేయడం లేదూ" అన్నారు హెడ్ మాష్టారు ఎగతాళి చేస్తున్నట్లుగా.

ఆ రోజు అతని మనసంతా గజిబిజిగా తయారైంది. ఒకప్పుడు ఉపాధ్యాయ వృత్తి ఎంతో పవిత్రంగా పరిగణించబడేది. గురువు దైవంగా పూజింపబడేవాడు. శిష్యులు ఎంతో నమ్రతగా వుండి గురు శుశ్రూష చేస్తూ జ్ఞానోపార్జన చేసుకునేవారు. రాను రాను అట్టడుగుకు దిగజారిపోతున్న గురు శిష్య సంబంధం దాని కనుగుణంగా మారిపోతున్న వుపాధ్యాయుల ప్రవృత్తి గమనిస్తూ వుండే తన వృత్తి మీద తనకే గౌరవం సన్నగిల్లిపోతోంది. ఉపాధ్యాయుని స్థితి ఇలా దిగజారిపోవడానికి కారణం ఎవరు? తోటి వుపాధ్యాయులా? సమాజమా? రాజకీయాలా?... సమాధానం దొరకలేదతడికి. ఏది ఏమైనా ముక్కుకు సూటిగా పోయే వ్యక్తి ఈనాడు ఈ పనికి అనర్హుడు.

శేషు వల్ల తరగతిలోని మిగతా విద్యార్థులలో కూ క్రమ శిక్షణ లోపించింది. మరి ఆ వూళ్లో పని చేయలేక బదిలీ కోసం విశ్వ ప్రయత్నం చేసారు రామం మాష్టారు. కాని అక్కడ కూడా చుక్కే ఎదురైంది.

మరో రోజు....

రామం మాష్టారు పిల్లల నోట్సులు చెక్ చేస్తున్నారు.

అందరితోపాటు శేషును కూడా నోట్సు చూపించమని అడగక తప్పలేదు.

"మమ్మల్ని ఇది చూపించు, అది చూపించు అని వేధించుకు తినటానికి కాదు ప్రభుత్వం మీకు జీతాలిచ్చేది"

పిట్ట కొంచెం కూత ఘనంలా వున్నాయి శేషు మాటలు. వాడి మాటలకు మిగిలిన పిల్లలంతా గొల్లుమని నవ్వారు.

ఇవి వాడంటున్న మాటలు కావు. వెనుక నుండి అనిపించే మాటలని అర్థమైపోయింది రామం మాష్టారికి.

"నువ్వు విద్యార్థివి. నేను గురువును, నేను చెప్పినట్లు నడుచుకోవడం నీ ధర్మం. వినయం లేని విద్య రాణించదు" అన్నారు వాడినింకా మార్చే ప్రయత్నంలో.

"నేను నోట్సు రాయలేదు, రాయను" అన్నాడు నిర్మొహమాటంగా.

శేషు మాటలకు మళ్లీ నవ్వారు విద్యార్థులు.

దాంతో అతని అహం దెబ్బ తింది. సహనం కోల్పోయి ఉద్రేకంతో రెండు లెంపకాయలు కొట్టారు. దాంతో అతడు స్పృహ తప్పి పడిపోయాడు.

ఇదంతా నాగరాజు ఆడిస్తున్న నాటకమని తెలియని రామం మాష్టారు స్పృహ కోల్పోయిన శేషుని చూసి భయపడిపోయారు. మాష్టర్లంతా చేరారు. తలొకరూ తలో రకంగా మాట్లాడారు.




ఊళ్ళోకి కబురెళ్ళింది. గ్రామస్తులు గుమిగూడారు.

నాగరాజు రామం మాష్టారిపై చేయి చేసుకోవడమేగాకుండా చాట భారతమంత పిటీషను వ్రాసి ఉపాధ్యాయులందరి చేత సంతకాలు చేయించి జిల్లా విద్యాశాఖాధికారి గారికి, మేనేజ్‌మెంట్‌కు పంపించాడు.

తత్ఫలితంగా అతడి వుద్యోగం వూడింది. పదిమందీ నవ్వారు, హేళన చేసారు. వెక్కిరించారు, కక్ష తీర్చుకున్నామని విర్రవీగారు, ఇలా ఆ వూరి నుండి పిచ్చి కుక్కను తరిమేసినట్లు తరిమేసారు.

* * *

"నన్ను క్షమించగలరా మాష్టారూ!" రామం మాష్టారి పాదాలను స్పృశించాడు శేషు.

"క్షమా గుణం గురువుకి ఎప్పుడూ వుంటుంది నాయనా. శిష్యుడెంత ఆకతాయివాడైనా వాడిలో మార్పు రావాలని, వాడు వృద్ధిలోకి రావాలనే ఏ గురువైనా కోరుకుంటాడు. నువ్వింతవాడవైనందుకు నాకెంతో గర్వంగా వుంది బాబూ!" చమర్చిన నేత్రాల్ని చేత్తో తుడుచుకుంటూ అన్నారు రామం మాష్టారు.

"నేనింతవాడినవడానికి కారణం మీరే మాష్టారు. ఆనాడు అజ్ఞానంలో మీ వ్యతిరేకుల మాటల్ని విని మిమ్మల్ని ఎదిరించాను. మీ వుద్యోగం పోయి ఆ వూరు విడిచి పెట్టి వెళ్ళిపోయాక నాకు కను విప్పు కలిగినట్లయింది. నాలో ఎనలేని మార్పు వచ్చింది. నేను చేసిన తప్పు నాకర్థమైంది. మిమ్మల్ని ఎలాగైనా కలుసుకుని క్షమించమని అడగాలనిపించింది. మీ గురించి ఎంత వాకబు చేసినా మీ జాడే కరువైంది. ఆనాటి నుండి బుద్ధిగా చదువుకోవడం ప్రారంభించాను. బి.ఎ. పాసయ్యాను. పోలీసు ట్రైనింగుకు వెళ్లాను, ఇప్పుడు నన్నీ వూళ్లో యస్.ఐ.గా పోస్టు చేసారు. మీరీ వాడలో వుంటున్నట్లు సత్యం చెప్పాడు ప్రప్రథమంగా, మీ ఆశీర్వాదం పొందాలని పరుగు పరుగున మీ దగ్గర కొచ్చాను".

"చాలా సంతోషం నాయనా"

"మాష్టరూ! అమ్మగారు కనిపించరేం!... పిల్లలు ఎక్కడికైనా, వెళ్లేరా?" నలువైపులా దృష్టి సారించాడు శేషు. ఆ ఇంట్లో మాష్టారు తప్ప మరెవరూ కనిపించకపోవడంతో.

"వెళ్ళిపోయింది".

"ఎక్కడికి?"

"ఎక్కడికేమిటి చూస్తున్నావుగా నా వునికి ఇలాంటి వాడితో జీవితాన్ని పంచుకోవాలని ఏ స్త్రీ కోరుకుంటుంది? అందుకే తనకు నచ్చినవాడితో వెళ్ళిపోయింది"

"అమ్మగారలాంటి పని చేసారంటే నమ్మలేకపోతున్నాను"

"ఈ పుడమిపై మనిషికి మనిషికి వున్న సంబంధం ఇచ్చి పుచ్చుకోవడమే. ఇవ్వలేనప్పుడు పుచ్చుకునే అర్హతను కోల్పోతాడు. ఆమె చేసిన పనికి నాకూ కోపం వచ్చింది. నిదానంగా ఆలోచిస్తే ఆమె తప్పేమీ లేదనిపించింది. మా పరిస్థితులే ఆమె చేత అలా చేయించాయి. అందుకే నా కోపం మీదే కోపం తెచ్చుకున్నాను. మానవుడు తను చేసుకున్న కర్మలననుసరించే పుట్టడం, పెరగడం, నశించడం జరుగుతోంది. బ్రతుకులో మాధుర్యం కోసం

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## పాఠకులకి మరో సరికొత్త శీర్షిక

## చిన్నారి బాలల దీన గాథలు

మన భారతీయ సంస్కృతిలో పసి పిల్లలని దైవ స్వరూపులుగా భావిస్తారు. వారిపట్ల అంతులేని ప్రేమాభిమానాలని ప్రదర్శిస్తారు. వారిపై అత్యాచారాలు జరగటం అన్నది పూర్వం ఎంతో అరుదుగా ఉండేది. కానీ ఇటీవల పరిస్థితి కొంత మారింది. ముక్కుపచ్చలారని చిన్నారి బాలలని వెట్టిచాకిరీకి వాడుకోవటం, వారి బంగారు భవిష్యత్తుని మొగ్గలోనే తుంచివెయ్యటం జరుగుతున్నది. చిన్న పిల్లలని అత్యంత ప్రమాదకరమైన వృత్తులలో, పనులలో అతి తక్కువ వేతనానికి నియమించటం జరుగుతున్నది. వారు ప్రమాదాలకి గురై మరణించటమో, శాశ్వతంగా వికలాంగులై పోవటమో జరుగుతున్నది. ఎందరో పసివారు పెద్దల నిరాదరణ కారణంగా అనాథ శరణాలయాల పాలవుతున్నారు. తలి దండ్రుల నీడలో ప్రేమాభిమానాలతో పెరగవలసిన ఆ వయసులో వారు పెద్దల నిరాదరణకి, క్రౌర్యానికీ దారుణంగా గురవుతున్నారు. అద్దంలాంటి స్వచ్ఛమైన వారి లేత మనస్సులపై అటువంటి అకృత్యాలు తీవ్ర ప్రభావాన్ని చూపిస్తాయి. భవిష్యత్తులో వారేవిధంగా మారతారో, వారి మనః ప్రవృత్తులు ఏ విధంగా ఉంటాయన్నది ఊహించటం కష్టం.

పసి పిల్లలపై జరుగుతున్న ఈ దారుణాలకి గల కారణాలని, వాటిని నివారించే పరిష్కార మార్గాలని చర్చించే సహేతుకమైన రచనలని పంపవలసిందిగా పాఠకులని కోరుతున్నాము.

పరిశీలనకి పంపే రచనలు స్వంత రచనలై ఉండాలి. ఒక అరఠావు పేజీ మించకుండా కాగితానికి ఒకవైపే రాసి పంపాలి. రాసిన వారి పేరు, పూర్తి చిరునామా వ్రాత ప్రతిపై స్పష్టంగా రాయాలి. రచనతోపాటు అది రాసిన వారి ఫొటో కూడా జతపరచి పంపవచ్చు. ప్రతి రచనతో కింద ఇచ్చిన కూపన్ జతపరిచి పంపాలి.

ప్రచురణకి స్వీకరించిన రచనలని అవి రాసిన వారి ఫొటోలతో (పంపి ఉంటే) వీలువెంబడి ప్రచురిస్తాము. ప్రచురణకి స్వీకరించని రచనలని తిప్పి పంపగోరేవారు స్వంత చిరునామాకల, తగినన్ని తపాలాబిళ్లలు అతికించిన కవరు జతపరిచి పంపవలసి ఉంటుంది. వాటిపై ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు. ప్రచురించిన ప్రతి రచనకూ పారితోషికం ఉంటుంది.

పాఠకులు తమ రచనలని "చిన్నారి బాలల దీన గాథలు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ–520003 అనే చిరునామాకి పంపాలి.

–సంపాదకుడు

---------- కూపన్ ----------

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు :..........................................

పూర్తి చిరునామా :..........................................

..........................................

..........................................

పిన్ కోడ్ :

## గురుర్బ్రహ్మ

ప్రేమతో అనేక బంధాలేర్పరచుకుంటాడు పోయేటప్పుడు కట్టుకున్న భార్య గుమ్మం వరకు, కన్న కొడుకు కాటి వరకే సాగనంపుతాడని తెలుసుకోలేకపోతాడు" అన్నారు రామం మాష్టారు.

అతని పలుకుల్లో వైరాగ్యం, నైరాశ్యం మిళితమై వున్నాయి.

"మాష్టారూ! నాదో చిన్న కోరిక" ఆశగా చూసాడు శేషు.

ప్రశ్నార్థకంగా ముఖం పెట్టారు మాష్టారు.

"మరేం లేదు. చెప్పుడు మాటలకు చెవులొగ్గి మా వూరి జనం ఒక మంచి ఉపాధ్యాయుణ్ని పోగొట్టుకున్నారు. బడిలో చదూకుంటున్నారన్న మాటేగాని ఎవ్వరికీ ఒక అక్షరం ముక్క కూడా రావడం లేదు. ఎంతో మంది మాష్టర్లు వస్తున్నారు. బదిలీల మీద వెళ్ళిపోతున్నారు. బాధ్యతతో పిల్లల శ్రేయస్సును దృష్టిలో పెట్టుకుని చదువు చెప్పే టీచరే కరువయ్యాడు. ఈనాడు విద్యా సంస్థలు రాజకీయాలలో పడి మసైపోతున్నాయి. అందుకే మా వూళ్లో ఒక కాన్వెంటు టైపు స్కూలొకటి ప్రారంభించాలని తలపెట్టాను. దానికి మీరే సారథ్యం వహించాలి. మీ పాలనలో విద్యార్థులు క్రమ శిక్షణతో మెలుగుతారన్న నమ్మకం నాకు వుంది. అంతే కాదు నా వల్ల మీకు జరిగిన అన్యాయానికి ఈ విధంగానైనా ఋణం తీర్చుకుని కాస్త మనశ్శాంతిని పొందనీయండి" మాష్టారి చేతులు పట్టుకుని ప్రాధేయపడుతున్నట్టుగా అన్నారు శేషు.

"ఇప్పుడు నా రాత నా చేతుల్లో లేదు బాబూ!" వేదాంతిలా అన్నారు రామం మాష్టారు.

"ఔను మాష్టారు, మీరెలా వస్తారు?... మా వూరి వాళ్ళంతా మిమ్మల్ని పిచ్చి కుక్కను కొట్టినట్టు తరిమి తరిమికొట్టారు. మరి మీరా ఛాయలకు కూడా రాలేరని నాకు తెలుసు ఐనా...."

"నాకు మీ వూరి మీద కక్ష లేదు. ఎవ్వరి మీద ద్వేషమంతకన్నా లేదు. నేను సర్వం పోగొట్టుకున్నవాణ్ని. అలా అని నాకు నేనుగా ఎక్కడికీ వెళ్ళలేను. నా చుట్టూ వున్న ఈ బడుగు జీవులు నన్ను వెళ్ళనివ్వరు. ఒక మంచికైనా చెడుకైనా నేను వాళ్ళకు కావాలి. వాళ్ళ శ్రేయస్సు నాకు కావాలి. అందుకే ఈ గీతా పఠనం. మా మధ్య పెన వేసుకున్న ఈ బంధాన్ని త్రెంపే శక్తి నీకే కాదు, ఆ భగవంతుడికి కూడా లేదు.

మాష్టారి మాటలకు మూగవాడయ్యాడు శేషు. మౌనంగా గురువుగారి పాదాలను స్పృశించాడు.

ఉన్నతమైన భావాలు, ఉత్కృష్టమైన వ్యక్తిత్వంతో మూర్తీభవించిన మాష్టార్ని చూస్తూ వుంటే దేవుడు ప్రత్యక్షమైనట్టుగా అనుభూతిని పొందాడు.

రామం మాష్టారిలాంటి మహా మనిషికి అన్యాయం చేసిన తనకు, తన వూరి ప్రజలకు మరి నిష్కృతి లేదని అతడి హృదయం ఘోషిస్తోంది. □

# బాలరంజని

చిన్నపిల్లల మాసపత్రిక

(పెద్దవారు కూడా చదవవచ్చు!)



# టాక్స్‌లెస్ ఇన్‌కం!

## వడ్లమన్నాటి కుటుంబరావు

కృష్ణా ఎక్స్‌ప్రెస్ అప్పుడే బారెడీ దాటి గుంటూరు వేపుకు దూసుకు పోతోంది. బయట ఎండగా ఉన్నా చల్లని గాలి వంటికి తగులుతూ హాయిగా ఉంది.

"మీరేం చేస్తుంటారు మాష్టారూ!" అనడిగాడు నా పక్కన కూర్చున్న పెద్దాయన. వయస్సు యాభై లో వుంటుంది నా మెదడులో ఏదో మెరిసినట్టయింది "మీరన్నారే ... మాష్టారూ అని..' అదే ఉద్యోగం చేస్తున్నానండీ ఏలూరులో" అని జవాబిచ్చాను వినయంగా. "మరి గుంటూరు వస్తున్నట్టున్నారు" అన్నాడు సంభాషణ పొడిగిస్తూ "ఈ జిడ్డు జగన్నాథం ఎక్కడ దొరికాడురా బాబూ!" అనుకుంటూనే "మా మరదలు ఎం బి బియస్ చదువుతోంది. ఒకసారి చూసి వెళదామని" అన్నాను

ఇల్లు గట్రా ఏమన్నా ఏర్పాటు చేసుకున్నారా మేష్టారూ? మళ్ళీ అడిగాను. ఈ జలగగాడు [illegible] తప్ప గత్యంతరం [illegible] మీకు తెలి[illegible] ఏముంది అన్నాను

'ఒక్క రహస్యం చెపుతాను ఎక్కడా అనకూడదు' గొంతు తగ్గించి అన్నాడు ఈ జీడిగాడికి తోడు రహస్యాలు కూడాను లోపల తిట్టుకుంటూ "చెప్పండి'' అన్నాను సభ్యత కోసం.

నేను రాజమండ్రిలో తహసీలుదారుగా చేస్తున్నా గదండీ జీతం కన్నా గీతం ఎక్కువ. డబ్బు కొల్లలుగా వచ్చి పడుతుంటే ఏం చెయ్యాలి చెప్పండి' అందుకని గుంటూరులో ఓ రాజభవనం లాంటి ఇల్లు కట్టించి పారేశాను

'ఖరీదు ఎంతుంటుంది సుమారు?" యదాలాపంగా అడిగాను

'యాభై లక్షలు' నిరామయంగా అన్నాడాయన.

పక్కలో బాంబు పడ్డట్టు అదిరిపడ్డాను "నిజం అన్నాను ఎంతో ఉత్సాహం చూపిస్తూ.

"తోటి ప్రయాణీకుడయిన మీకు అబద్ధం చెపితే ఏమొస్తుంది మాష్టారూ?"

"మరి ఫర్నీచరు..... అదీ"

"అయ్యో! అవి లేకుండా ఎలాగండీ. ఫ్రిజ్.. మిక్సీ. గ్రైండరు.. డైనింగు టేబుల్. రేడియో .. టి.వి ఒకటేమిటి అన్నిరకాల ఆధునికమైన వస్తువులు అమర్చి పారేశానండి.. "ఇల్లు ఎ. సి. కూడా చేయించాను'

"వాటి ఖరీదు?" కృత్రిమంగా మార్చు ముఖం పెట్టాను.

"లేకేమండీ కనీసం రెండు లక్షలు. అంతా ఇంపోర్టెడ్ బ్రాండ్ కదండీ మరి."

'కారు కొన్నారా?"

"ఇంత భవంతి కట్టించి .. కారు లేకపోతే షికారు ఎలాగండి? అందుకని ఒక ఎంబాసెడర్ కారు... ఒక బుల్లెట్ మోటారు సైకిలు.. ఒక చేతక్ స్కూటరు కూడా కొనేశాను."

"ఇవన్నీ ఎందుకు?"

"వంకాయ కూర.. వంకాయే.. బీరకాయ పులుసు బీరకాయ పులుసే కదండీ! నాకు సరదా పుట్టినప్పుడు ఆ... యా.. వాహనాన్ని వాడతాను."

"టి.వి కొన్నారుగా' వి సి ఆర్. కూడా కొన్నారా?"

"అయ్యా అది లేకపోతే... కావాలనుకున్న సినిమా చూడటం పడదు కదండీ' అందుకని అది కూడా లాగించేశాను నాకన్నా చిన్నవారు మీకు చెప్పటానికి సిగ్గేస్తోంది [illegible] ఆపాదాయన

ముద్దుకీ [illegible] ఆయన గొంతు నులమాలనిపించింది నాకు. పైకి మాత్రం ఫరవా లేదు చెప్పండి అన్నాను.

'చెపుతాను నేనొక్కడినీ ఉన్నప్పుడు బ్లూ ఫిల్మ్ కూడా వేసుకుని చూస్తాను.'

ఓరి ముసలాడా' నీ టేస్టు తగలడ! నీకు బ్లూ ఫిల్ము కావలసి వచ్చిందా ఈ వయసులో... అనుకున్నాను.

'మరి కాసేమయినా ఉందా! అంతా వీటి మీదే పెట్టేశారా?"

డబ్బు లేనివాడు డుబ్బుకు కొరగాడు కదండీ అందుకని స్వల్పంగా అట్టే పెట్టాను చిల్లర ఖర్చులకని."

"ఎంత?"

'ఎంతంటే ఓ డెబ్భయి లక్షలు."

"వ్వాట్!" అన్నాను.

"అదేంటి మాష్టారూ అలా కంగారు పడిపోయారు? ఇంకా పాతిక లక్షలు తగలేశాను కదండి.

"దేంట్లో?

"ఎ సి హోటల్సులో... బెడ్ మీద రమణీ మణుల్ని బేర్ మనిపించటానికి.. గుర్రప్పందాలకి."

వీడి ముఖానికి అమ్మాయిలు ... గుర్రాలు... కూడానన్న మాట! హత విధీ!

"స్థలాలు పొలాలు గట్రా."

'అవి లేకపోతే ఎలా? ఓ పది ఎకరాలు సుక్షేత్రమైన మాగాణీ కొన్నాను తెనాలి దగ్గర కొల్లూరులో."

"గుడ్! మరి మీరు ఇంత నిరాడంబరంగా ..." అనుమానంగా చూశానాయన వేపు. అతి సామాన్యమైన దుస్తులు.

"సింప్లిసిటీ ఈజ్ బ్యూటీ కదండీ! అందుకని లేనివాడిలా కనిపించటానికి తాపత్రయ పడతాను మాష్టారూ' ఇందులో ఇంకో సుఖం కూడా ఉందండోయ్!'

ఏమిటది?

"జనం ఏడ్చి చస్తారు గదండీ కాస్త [illegible]గా కనుపిస్తే, ఇలా ఉంటే .. ఏ దొంగా దగ్గరకూ రాడు పైగా ఈ ఇన్‌కం టాక్స్ డిపార్టుమెంటు వాళ్ళు [illegible] వాళ్ళు వట్టి [illegible] నోటితో [illegible]

"చెప్పండి ఫరవాలేదు నేనా డిపార్టుమెంటు వాణ్ణి కాదుగా? అభయమిచ్చాను.

"వట్టి దురాశాపరులండీ! టాక్సు బోలెడంత కట్టాలి అని బెదురు పెట్టి... మన దగ్గర బోలెడంత గుంజటం తప్ప వాళ్ళకింకో పనిలేదు."

'మీ కెప్పుడూ తగల లేదా వాళ్ళు?' ఆత్రంగా అడిగాను.

'తగిలారనుకోండి' నేను వాళ్ళ కన్నా తెలివి గలవాణ్ణి! అందుకనే ఆస్తిని... వస్తువుల్ని .. రకరకాల పేరుల్లో పెట్టి . వాళ్ళని మస్కా కొట్టిం చేస్తున్నాను. అతి తక్కువ మాత్రమే ఇన్‌కంటాక్సు కడుతున్నాను."

'చాలా ఘటికులండీ మీరు!" మెచ్చుకున్నాను.

"మీరలా అంటం నాకు సరదాగా ఉంది మాష్టారూ!"

ఆ తరవాత ఇద్దరి మధ్యా మౌనం రాజ్యమేలింది కాసేపు.

ఆయనెవరో నాకు తెలియక పోయినా మనసులో ఆయనంటే జెలసీ చెలరేగింది నాలో. పైగా ఇన్‌కం టాక్సు వాళ్ళ గురించి చులకనగా మాట్లాడాడు.

మళ్ళీ ఏదో పలకరించాడాయన. జవాబు చెప్పి ముసిముసిగా నవ్వుకున్నాను.

మాటల్లో ఆయన్ను పొగిడి... ఆయన పేరు.. పేట... ఇంటి నెంబరు అన్నీ తీసుకున్నాను.

### మనిషి – పాము

చెట్టు చేమకు మొక్కి
మనిషి వెలిలోనే నిలిచి కూలే విలువలు
అపమార్గంలో వున్న ఆకర్షణ
అంతుపట్టని చాకచక్యానికిచ్చే పిలుపు
సన్మార్గంలో ముక్కు సూటిగా వెళ్ళేవారి
అసలు అవసరమే లేదు–
మెలికలు తిరుగుతూ పాకే పాముకు!

–నిఖిల్

"మీరో సారి తప్పక మా యింటికి దయ చెయ్యాలి" అన్నాడాయన గుంటూరు స్టేషన్లో దిగుతూ.

మీ ఆహ్వానాన్ని తప్పక మన్నిస్తానని చెప్పాను – నేనూ దిగబోతూ

'ఇంతకీ మీ రెవ రో చెప్పారు కాదన్నా'డాయన ఉత్సుకతతో.

ఇన్‌కంటాక్స్ ఇన్స్పెక్టర్ని' అన్నాను చిరునవ్వుతో

బాబోయ్ చచ్చాను' అంటూ ఆయన పరుగు లాంటి నడకతో జనసముద్రంలో కలిసిపోయాడు

'అయినా ఇప్పుడు నేనెందుకు వదిలి పెడతాను గుంటూరు ఆఫీసు కెళ్ళి లోకల్ ఇన్స్పెక్టర్ని తీసుకెళ్ళి ఈ ముసలాడి చేత ఎగ్గొట్టిన ఇన్‌కంటాక్సంతా కక్కించి మరీ కట్టిస్తాను' – అనుకుంటూ ఆటో ఎక్కి మా ఆఫీసుకు వెళ్ళాను.

సరిగ్గా సాయంత్రం అయిదు గంటలకు నేను లోకల్ ఇన్స్పెక్టరూ ఆయనిచ్చిన అడ్రసు దగ్గర ప్రత్యక్షమయ్యాము ఆశ్చర్యం! అక్కడేం పెద్ద బవంతి లేదు నాలుగయిదు పూరి పాకలున్నాయి

'ఏంటి బాస్' ఇది అన్నాడు నా కొలీగ్

అడ్రసు ఇంకోసారి చూశాను కరక్టే!

అక్కడ నిలుచున్న ఒక తనికి ముసలాయన పేరు చెప్పి తెలుసా? అనడిగాము.

ఉండండి పిలుస్తాను'" అంటూ ఒక పాకలోకి వెళ్ళాడతను

పిలుపు అందింది కాబోలు ఆ ముసలాయన కండువా సరిజేసుకుంటూ వచ్చాడు బయటికి

రండి మేష్టారూ' మీరొస్తారనే ఊహించుకుంటు న్నాను నేను" అన్నాడు నన్నుద్దేశించి నవ్వుతూ.

ఈసారి కంగు తింది నేను మా కొలీగ్ కూడా అదే అవస్థలో ఉన్నాడు

ఇదేమిటి? మీ యాభయ్ లక్షల బిల్డింగ్ ఇదేనా?' అన్నాను వ్యంగ్యంగా కోపంగా







క్షమించండి సార్' నన్నెన్ను విప్పేస్తున్నాను నేను ఓల్డ్ బి ఏ గాడినిలెండి కాస్త నాటకాల పిచ్చి ఎక్కువ' వాటిల్లో ఉన్న ఆస్తంతా తగలేసుకుని ఈ పర్ణ కుటీరంలో మిగిలాను నేను రైల్లో వస్తున్నప్పుడు మీ లెదర్‌బాగ్ మీద స్లిప్పులో అడ్రసు చూసి మరీ అడిగాను మీరేం చేస్తుంటారని మీరు మేష్టారని అబద్దం చెప్పారు మిమ్మల్తో ఆట పట్టించాలనిపించింది అందుకనే క్షణాల మీద అందమైన కట్టుకథ అల్లి మాటల చాతుర్యంతో మిమ్మల్ని మెప్పించాను దాని ఫలితమే మీరాక మా ఇంటికి నా జీవితంలో లేనిది ఉన్నట్టుగా మీతో చెప్పిన కాసేపు చక్కని అనుభూతి పొందాను ఇందుకు నన్ను క్షమించండి రండి' లోపలికి' కాఫీ తాగి పోదురు గాని అన్నాడు ఆహ్వానిస్తూ

నా మొహాన కత్తి వాటుకి నెత్తురు చుక్క లేదు 'ఎంత నైస్‌గా ఫూల్‌ని చేశాడు ఈ ముసలాడు?' అనుకున్నాను బాధగా

ఆయనకేం జవాబు చెప్పకుండా గిరుక్కున వెనక్కి తిరిగాను నా కొలీగ్ నన్ను మౌనంగా అనుసరించాడు □



రమాప్రభ, వై. విజయ, అరుణ, నిర్మల తెరముందు – గణేష్‌పాత్రో, వేటూరి, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, తోట చిన్ని, సత్యం, విజయన్, జి. ఆనందకుమార్, సునీల్‌వర్మ, రవీంద్రబాబు, కోటగిరి వెంకటేశ్వరరావు తెరవెనుక కృషి చేశారు.

## "భక్త కబీర్‌దాస్"గా విజయచందర్

"ఫిబ్రవరి 1 నుంచి పద్మాలయా స్టూడియోలో షూటింగ్. మార్చికి పూర్తవుతుంది." అన్నారు మెదక్‌జిల్లా జోగిపేటకు చెందిన పోకల కృష్ణమూర్తి. ఈయన సాయిబాబా ఆర్ట్ మూవీస్ పతాకంలో హిందూ ముస్లిమ్ సమైక్యతకు, సర్వమానవత్వానికి పాటుపడ్డ పరమభక్తుడు కబీర్‌దాస్ చిత్రాన్ని నిర్మిస్తున్నారు. విజయచందర్, జె. వి. సోమయాజులు, రాజా, కాంతారావు, చలపతిరావు, డాక్టర్ ధారా రామనాథశాస్త్రి, చక్రపాణి, హరనాథ్, భీమరాజు ప్రభ, గౌతమి, శుభ, వేలు ప్రభృత నటవర్గం. ఆరుద్ర సంభాషణల కర్త. కె. వి. మహదేవన్ స్వరకల్పనలో వేటూరి, ఆరుద్ర,



నిర్మాతల్లో హీరో శ్రీ టి. సుబ్బరామి రెడ్డి, హీరోల్లో హీరో బాలకృష్ణ

## చిత్రీకరణ ముగిసిన "లాయర్ భారతీదేవి"

"ఆఖరి షెడ్యూల్ జనవరి 13 నుంచి 26 వరకు జరిగింది," అన్నారు జి. రామ్మోహనరావు. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో జి. కె. రెడ్డి, జి. శివన్నారాయణ నిర్మించిన శ్రీదేవి కళాచిత్ర వారొకై చిత్రంలో శారద, కళ్యాణ చక్రవర్తి, పరుచూరి సోదరులు, గిరిబాబు, నూతన్‌ప్రసాద్, సుధాకర్, బాలాజీ, రాజ్‌వర్మ, రమణారెడ్డి, కిరణ్, రాళ్ళబండి కామేశ్వరరావు, భీమేశ్వరరావు, హరిబాబు, పొట్టి ప్రసాద్, చిడతల అప్పారావు, పూర్ణిమ, చంద్రిక, శుభ, రాజేశ్వరి, శైలజ, కల్యాణి, నూతన తారలు మోనిషా, స్వాతి పాల్గొన్నారు. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. కె. వి. మహదేవన్ సంగీతం, వి. లక్ష్మణ్ ఛాయ, యాద్దు శిల్పం, చందన్ కిశోర్ సహకార దర్శకత్వం, వెంకటరత్నం కూర్పుతో ఎస్. వి. రాజ్‌కుమార్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. జి. కె. రెడ్డి, జి. శివన్నారాయణ నిర్మాతలు. న్యాయపరంగా, కుటుంబపరంగా పలు సమస్యలను ఎదుర్కొన్న లాయర్ భారతీదేవిగా "ఊర్వశి" శారద అద్వితీయంగా నటించిన చిత్రమిది.

## రాఘవేంద్రరావు, బాలకృష్ణ సమ్మేళనంలో షూటింగ్ పూర్తయిన "సామ్రాట్"

"ప్రథమార్థంలో హాస్యరసాన్ని, ద్వితీయార్థంలో సీరియస్‌నెస్‌ను బాలకృష్ణ సుపర్బ్‌గా పోషించారు. ఆఖరిషెడ్యూల్ జనవరి 16 నుంచి 20 వరకు జరిగింది." అన్నారు కె. రాఘవేంద్రరావు – ఈయన దర్శకత్వంలో దేవీకమల్ మూవీస్ అధినేత కె.సి. శేఖర్‌బాబు నిర్మించిన "సామ్రాట్" చిత్రంలో విజయశాంతి నాయిక. రావుగోపాలరావు, గొల్లపూడి, నూతన్‌ప్రసాద్, సుధాకర్, రాళ్ళపల్లి, రాజేష్, చలపతిరావు, హేమసుందర్, చిట్టిబాబు,

"ప్రేమసామ్రాట్"లో



ఎం. ఆర్. శాస్త్రి గీతాలు రాశారు. కబీర్‌లాల్ ఛాయ, శేషు నృత్యాలు, కె. నాగేశ్వరరావు కూర్పుతో ఏ. వెంకటరాజా స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తారు

## హరికృష్ణ సారథ్యంలో "ఇదా ప్రపంచం"

"హైదరాబాదులో ఫిబ్రవరి 5 నుంచి మార్చి 10 వరకు ఒకే షెడ్యూల్," అన్నారు ప్రముఖ పంపిణీదారుడు వై హరికృష్ణ. ఈయన సారథ్యంలో రూపొందే కృష్ణచిత్రవారి మూడవ చిత్రం "ఇదా ప్రపంచం"లో శరత్‌బాబు డాక్టర్ రాజశేఖర్ జీవిత, సాయికుమార్ సాక్షి రంగారావు పొట్టి ప్రసాద్, వేలు, నర్రా చిట్టిబాబు వెంకట్రాజా అన్నపూర్ణ, వగైరా నటవర్గం యం వి. ఎస్ హరనాథరావు, కథ, మాటలు రాశారు చక్రవర్తి సంగీతం ఆర్. రామారావు ఛాయ, గౌతంరాజు కూర్పుతో వై అనిల్ బాబు నిర్మించే ఈ చిత్రానికి ముత్యాల సుబ్బయ్య దర్శకుడు



...రాధ, సుమన్



"తిరగబడ్డ తెలుగు బిడ్డ"లో రమ్య కృష్ణ

## చిత్రీకరణ ముగిసిన "మరణ శాసనం"

"నా నట జీవితంలో మరో మైలు రాయిగా నిలిచిపోతుంది ఈ చిత్రంలోని నా పాత్ర సబ్జెక్ట్‌లో ఎంతో ప్రేరణ ఉంది గనుక అంతగా లీనమై నటించడానికి వీలయింది, అన్నారు కృష్ణంరాజు ఈయన హీరోగా జి హనుమంతరావు నిర్మించిన పద్మాలయా స్టూడియోస్ వారి పై చిత్రంలో కృష్ణంరాజు జయసుధ, మాధవి, శోభన ప్రభాకర రెడ్డి శ్రీధర్ గిరిబాబు, గొల్లపూడి, కోట శ్రీనివాస రావు త్యాగరాజు జి వి సోమయాజులు జయభాస్కర్, హేమసుందర్, కె కె శర్మ మాడా, నూతన విలన్ కృష్ణన్ రాజు డైరెక్టర్ సి ఎస్ రావు నటించారు ఎం వి ఎస్ హరనాథరావు, రాజ్-కోటి సుందరం కళాధర్, కోటగిరి గోపాలరావు, సుబ్రహ్మణ్యం పెదబాబు, ధర్మరాజు ప్రభృత సాంకేతిక వర్గంతో జి ఆదిశేషగిరిరావు నిర్మాణ సారథి సమర్పణ: కృష్ణ దర్శకత్వం: ఎస్ ఎస్ రవిచంద్ర

## విడుదలకు సిద్ధమవుతోన్న "సర్దార్ కృష్ణమనాయుడు"

"కృష్ణ ద్విపాత్రాభినయం ఈ చిత్రంలో హైలైట్" అన్నారు ఎ కోదండరామిరెడ్డి ఈయన దర్శకత్వంలో బి హెచ్ అజయ్‌కుమార్ నిర్మించిన బాలాజీ ప్రొడక్షన్స్ వారి పై చిత్రంలో కృష్ణ, విజయశాంతి శారద, రావుగోపాలరావు సత్యనారాయణ రంగనాథ్, పరుచూరి గోపాల కృష్ణ, ఎం వి ఎస్ హరనాథరావు, వర్మ, అన్నపూర్ణ, హరిప్రియ, ఉషారాణి రాజేశ్వరి తెరముందు – పరుచూరి సోదరులు వేటూరి, చక్రవర్తి, ఎస్ సుధాకరరెడ్డి, శ్రీనివాసరాజు, సలీమ్, చలసాని రామారావు, గమిడి కనకేశ్వరరావు చంద్రశేఖర్ కోటగిరి వెంకటేశ్వరరావు తెరవెనుక కృషి చేశారు బి హెచ్ వరహాలరాజు సమర్పణ



# అభినేత్రి భానుప్రియ సమాధానాలు

**పి. రాజేశ్వరరాజు, కరీంనగర్**

భానుప్రియగారూ! తెలుగు పరిశ్రమలో అడుగు పెట్టిన తారలు సూపర్‌స్టార్ అయి హిందీ పరిశ్రమకు వెళ్తున్నారు. కాని, మీరు మా ముందు ఉంటారా?

**వెడుతూ – వస్తూంటా.**

**ఎం. మాధవీలత, కొత్త పాల్వంచ**

'అనాదిగా ఆడది' సినిమాలో మీ పాత్ర చాలా బాగుంది. దీనిపై మీ అభిప్రాయం?

**మీరే చెప్పారుగా!**

**ఎ. మంజులవాణి, కొత్తపేట**

సావిత్రి, వాణిశ్రీ, జయసుధ వంటి నటీమణుల స్థానం 'భానుప్రియ' గారిది అని నేనంటాను. మీరు నాతో ఏకీభవిస్తారా?

**ఓ యస్!**

**జి. ఎస్. ప్రసాద్, బళ్ళారి**

మీ రాబోవు చిత్రాలలో జాతీయ అవార్డు వచ్చే పాత్ర ఏదైనా ఉన్నదా?

**అది వచ్చిన తర్వాత కదా తెలిసేది!**

**వి. వి. సుబ్బారావు, విశాఖపట్నం–20**

పాత సినిమాలు, పాటలు బంగారమంటారు. మరి మీరేమంటారు?

**ఒప్పుకుంటాను.**

**ఎ. గులాం అలీబేగ్, మహబూబ్‌నగర్**

విజయశాంతిగారు డైరెక్షన్ వహించనున్నారట. మీరు కూడా డైరెక్షన్ వహిస్తారా?

**ప్రస్తుతం హీరోయిన్‌గానే.**

**ఎం. నాగతిరుమలరావు, బాపట్ల**

మీ చెల్లెలు రేఖ గారి ఫాన్స్ స్థాపిద్దాం అనుకుంటున్నాము. వివరాలు తెల్పి. ఆమె అనుమతి ఇప్పించగలరా?

**అది ఆమెనే అడగండి!**

**ఎన్. రెడ్డెయ్య, వత్తటూరు**

నటీనటులు విలాస జీవితాన్ని గడుపుతూ ఉంటే, అభిమాన సంఘాలు అంటూ ప్రాణాలు పోగొట్టుకుంటున్నారు నేటి యువతరం. దీనికి మీరేమంటారు?

**ఏమీ అనను.**

**ఎం. మల్లికార్జునరావు, ఖుర్దారోడ్**

విత్తు ముందా, చెట్టు ముందా? చెట్టు లేని విత్తనము ఎచ్చటిది? విత్తనము లేని చెట్టు ఎచ్చటిది?

**ఏం బాబూ! యింత కంటే మంచి ప్రశ్న దొరకలేదా నీకు?**

## ఉత్తమ ప్రశ్న

**కె. సూర్యనారాయణ, బర్హంపూర్**

అవకాశం వస్తే ఆడది ఆదిశక్తి కూడా కాగలదు – అన్నారు పెద్దలు. నేటి కాలంలో అలాంటి పరిస్థితి వచ్చినా ఆదిశక్తులు కనిపించరేం?

**నీకు కనిపించనంత మాత్రాన ఆదిశక్తులు లేరంటే ఎలా?**

**సి. హెచ్. పద్మ, వేములవాడ**

మిమ్మల్ని డాక్టర్ పాత్రలో చూడాలని ఉంది.

**అలాగే!**

**ఎం. భవాని, బాపట్ల**

'మంచి మనసులు' చిత్రంలో మీ పాత్రలో జీవించి, స్పందింపజేశారు. దానికి ముఖ్యకారణం మీ కళ్ళేనా?

**ప్రేక్షకుల కళ్ళు కూడా!**

**ఎస్. కె. నూర్ మహ్మద్, బిట్రగుంట**

మిమ్మల్ని ఎక్కువగా అభిమానించే ప్రేక్షక అభిమానులకు మీరు ఏమి అందించగలరు?

**అభిమానం.**

**కె. చంద్రశేఖర్, పుత్తూరు**

'ఆలాపన' లో మీ నాట్యం అద్వితీయం. ఇంతటి నటనా ప్రావీణ్యానికి కారణం ఏమిటంటారు.

**కృషి చేయడమే.**

**పి. సురేందర్, కరీంనగర్**

భానూగారూ! నేడు స్త్రీని ఒక విలాస వస్తువుగా చూసే ప్రతి మగాడూ స్త్రీగా మారితే?

**అలా చూడ్డం మానేస్తాడు.**

**కాజ అనిత, ఏలూరు**

మంచినటిగా కావాలంటే కావలసినది గ్లామరా లేక నటనా భానుప్రియగారూ!

**గ్లామర్‌తో కూడిన నటన.**

**ఎం. సికందర్, కర్నూలు**

మీ కోసము నేను నా ప్రణము ఇవ్వగలను. నా కోసము మీరు మీ అందమైన ఫొటో పంపితే చాలు!

**అందమైన ఫొటో కోసం 'ప్రణము' తీసుకుంటే ఎలా?**

**వి. రవీంద్ర, మిర్యాలగూడ**

'మంచి మనసులు' చిత్రంలో నటించడం వల్ల మీ కళాత్మక తపస్సు ఫలించిందని మీరనుకుంటున్నారా?

**అనుకోడం లేదు.**

**జి. ఎస్. ప్రసాద్, బళ్ళారి**

మీరింత వరకు నటించిన చిత్రాల్లో మీకు నచ్చిన చిత్రం 'సితార' అనుకుంటాను. మీరేమంటారు భానుప్రియగారూ?

**సితారతో పాటు మరి కొన్ని..** □

కూపన్.

## ఆంధ్ర సచిత్ర వారపత్రిక
## భానుప్రియ సమాధానాలు

ప్రశ్న : ______________________

______________________

______________________

పంపిన వారి పేరు ______________________

పూర్తి చిరునామా ______________________

______________________

# అభిమాన తారలపై అభిప్రాయం

నా అభిమాన అందాల తార శ్రీదేవి అతికొద్ది కాలంలో తెలుగు చిత్రసీమలో ఉన్నత స్థాయికి చేరుకున్న ఏకైక నటి. "పదహారేళ్ళ వయసు" చిత్రం చూసిన తర్వాత ఆమె అభిమానినయ్యాను. ఆ చిత్రంలో ఆమె నటన అద్భుతం. అతి చిన్న వయసులోనే "ఎన్. టి. ఆర్." "ఏ ఎన్. ఆర్" సరసన నాయికగా నటించి తనకు తానే సాటి అన్పించుకున్నది.



హిందీ చిత్రరంగ ప్రవేశం చేసి అక్కడ కూడా నెంబర్ వన్ స్థానం సంపాదించుకున్నది. ఈ మధ్య హిందీ చిత్రాలలో కొంచెం అసభ్యంగా నటిస్తూ మా వంటి అభిమానులను నిరుత్సాహ పరుస్తున్నది.

ఇది వరకు తెలుగులో ఎక్కువగా కన్పించే శ్రీదేవి ఈ మధ్య చాలా తక్కువగా కనిపిస్తున్నది. హిందీ చిత్రాలకే ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నది. తెలుగులో నా అభిమాన నటుడు శోభన్‌బాబుతో నటించాలని కోరుతున్నాను. కుటుంబ సమేతంగా చూడగలిగేలా, ప్రతి ఇల్లాలు మెచ్చుకునేలా నటించి మెప్పించాలి. దేవత, పదహారేళ్ళ వయసు వంటి చిత్రాలలో ప్రదర్శించిన అద్భుత నటన మళ్ళీ మాకు ప్రసాదించాలని మనవి.

—ఎం. శ్రీనివాసమూర్తి, జబల్‌పూర్

★ ★ ★

ఆలాపన, చిత్రంలో భానుప్రియ నటన చూసి నేను ఆమె అభిమానినయ్యాను. "అమెరికా అల్లుడు", "అన్వేషణ", "అనాదిగా ఆడది", "సితార", "అపూర్వ సహోదరులు" లో ఆమె నటన అద్భుతంగా వున్నది.



అనతి కాలంలోనే నటనలోను, నాట్యం లోను తన కంటూ ఒక స్థానాన్ని ఏర్పరుచుకున్న నటి భానుప్రియ. నృత్యాలలో ఆమెకు సాటి ఎవరురారని నా అభిప్రాయము. విశాలమైన తన నయనాల ద్వారానే నటనా చాతుర్యాన్ని ప్రదర్శించగల ఏకైక నటీమణి భానుప్రియ. ఈమె నటించిన "కోనసీమ కుర్రోడు" లో ఒక వెరైటి పాత్రను పోషించి అందరిని తన వైపుకు ఆకర్షించుకొను శక్తి కలిగినది. కోపంగా వున్నా అందముగా వుంటారు. భానుప్రియ అభిమానిగా నా సూచన ఏమిటంటే హిందీ చిత్రాలలో నటించినా తెలుగు అభిమానులను నిరుత్సాహ పరచకుండా ఎక్కువ తెలుగు చిత్రాలలో నే నటించాలని నా అభిప్రాయము.

—కె. ప్రసన్న, టి.నగర్, తిరుపతి

★ ★ ★

నా అభిమాన నటి, జాతీయ ఉత్తమనటి, అవార్డు గ్రహీత, నేటి మేటి సూపర్ హీరోయిన్, సుమధుర చిరు దరహాసిని, సుహాసిని. మొదటి సినిమా 'మౌనగీతం' చూచి అభిమానిగా మారి, 'స్వాతి' చిత్రం ద్వారా ఆ అభిమానం ఇంతై ఇంతింతై అన్నట్లుగా ఎదిగిపోయి, నా అభిమానే గాక అఖిలాంధ్రుల అభిమాన పాత్రురాలు కావడం నాకెంతో గర్వకారణం.

ఎంతటి కష్టతరమైన పాత్రనైనను అవలీలగా చేయగల మేటి నటి. గల గల పారే సెలయేరులా నవ్వుతూ, తుళ్ళుతూ ఉండే సుహాసిని 'సిరివెన్నెల'లో 'మూగ'గా ఆ పాత్రకు జీవం పోశారు. ఈ సంవత్సరము నటి సావిత్రిగారి స్మారక అవార్డును సుహాసినిగారు అందుకోవడం ఎంతయినా



హర్షించదగిన విషయం. మోడరన్ డ్రస్సులలో కంటే చీరలలో చాల అందంగా కన్పిస్తారు.

కాని ఈ నటి తన మాతృభాషా రంగాన్ని చిన్నచూపు చూడ్డం బాధగా ఉంది. తన నటనకు వన్నె తెచ్చి, ఉన్నతంగా తీర్చిదిద్దిన ఆ రంగాన్ని నీచంగా కాక గౌరవంగా చూడ్డం నేర్చుకోవాలి.

సుహాసిని తన ఇమేజ్ దెబ్బ తినకుండా, మంచి కధా బలంగల చిత్రాలను ఎన్నుకోవాలి, కథను ముందుగా విని అన్ని విధాలుగా నచ్చాకే నటించాలని, ఇంకా తారాపథంలో అగ్రస్థానానికి చేరుకోవాలని – తద్వారా, జాతీయ – అంతర్జాతీయ ఖ్యాతి, బహుమతులను అందుకోవాలని ఆకాంక్షిస్తూ—

—ఎం. నిర్మల, లక్ష్మీదేవిపల్లి (ఖమ్మం)

★ ★ ★

"సృష్టిలో తియ్యనైనది మాట." భగవంతుడు ఆ మాటను నాకు ప్రసాదించక పోయినా అన్ని రంగాలలో అందరితో ముందుకు పోవాలనేదే నా ఆకాంక్ష. ఆరున్నర కోట్ల ఆంధ్రుల అభిమానాన్ని చూరగొన్న 'యువరత్న' నందమూరి బాలకృష్ణ నా అభిమాన నటుడు "మంగమ్మగారి మనవడు" "శ్రీ విరాట్ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామివారి చరిత్ర"లోని సిద్ధయ్య పాత్ర, "కథానాయకుడు" "దేశోద్ధారకుడు", "కలియుగ కృష్ణుడు" చిత్రాలు నాకెంతగానో నచ్చాయి. నేను బాలకృష్ణగార్ని 'దేశోద్ధారకుడు' షూటింగ్‌కు విజయవాడ వచ్చినప్పుడు కలుసుకొన్నాను. ఆయన నాకు మాటరాదని ఎంతగానో ఆవేదన చెందారు. అప్పుడు ఆయన నాపై చూపించిన ఆప్యాయతకు నేను



ఎల్లవేళలా కృతజ్ఞుణ్ణి. ఇక ముందు వైవిధ్యంగల పాత్రలు నటించాలని, తండ్రికి తగ్గ తనయుడని కీర్తి తెచ్చుకోవాలని నా ఆకాంక్ష—

ఎ. సాంబశివరావు, బొడ్డుపాడు (కృష్ణా)

★ ★ ★

నట విరాట్ రావుగోపాలరావు నా అభిమాన నటుడు. ఆయన పోషించే దుష్ట, దుర్మార్గ పాత్రలంటే నాకెంతో ఇష్టం. అలాగని దుర్మార్గం, దుష్టత్వమంటే నాకు ఇష్టమనికాదు. ఆయన పోషించే దుష్ట పాత్రలబట్టి అటువంటి దుష్టుల వలన సమాజ పురోగమనాభివృద్ధికి ఎంతహానో తమ పాత్రలనుబట్టి 'రావు'గారు తెలియ జేస్తున్నారు. పేదల కష్టాలకి, కన్నీరుకు ఏమాత్రము కరగని కసాయి హృదయుడిగా, పెళ్ళి కావలసిన కన్నెల బ్రతుకులు బంతపాలు చేసిన కామపిశాచిగా, సమాజంలో ఓ పెద్ద మనిషిగా చెలామణీ ఔతూ లోపల గోతులు తీసే మేకవన్నె పులిగా, పదవి కోసం ఎంతటి నీచత్వానికైనా, చివరకు రక్తపాతానికి కూడా వెనుదీయని ఓ కుటిల రాజకీయ



నాయకుడిగా. (నేటి రాజకీయ నాయకులకు దర్పణంగా) అభినయించే ఆయన నటన నాకెంతో ఇష్టం. ఖైదీ, మనవూరిపాండవులు, అభిలాష, విశ్వరూపం, త్రిశూలం, ఈనాడు చిత్రాలలో ఆయన జీవించారు.

అభిమానిగా నా సలహా యువతరానికి కర్తవ్యం ప్రబోధించి, సమాజాన్ని తట్టి మేలుకొలిపే చిత్రాలలో అధిక శ్రద్ధ వహించి నటించాలనేదే నా కోరిక.

—ప్రకాశ్‌కుమార్, పి., మంచెశ్వర్, భువనేశ్వర్



"శ్రుతిలయలు"లో సుమలత

## డైరెక్టర్ కె. ఎస్. ఆర్. దాస్ చిత్రావళి

కృష్ణతో బాలాజీ ఆర్ట్ మూవీస్, నవజంట స్వాతి, శశికుమార్‌తో శ్రావణి మూవీస్ చిత్రాలను డైరెక్ట్ చేస్తున్న కె. ఎస్. ఆర్. దాస్ తదుపరి చిత్రాలు: ఏప్రిల్ 1న నవభారత్ బాబూరావు ఆయన పుత్రుడు బాలాజీ హీరోగా ప్రారంభించే చిత్రంలో రేఖ నాయిక. రమేష్ హీరోగా సి. ఎ. ఎన్. మూవీస్ చిత్రం ఏప్రిల్‌లో, అర్జున్ హీరోగా టి. ఎ. ఎస్. పిక్చర్స్ చిత్రం ఏప్రిల్‌లో ప్రారంభమవుతాయి.

## "మకుటంలేని మహారాజు" కృష్ణ

"దుష్టులకు పక్కలో బల్లెం అయిన మకుటంలేని మహారాజుగా కృష్ణ నటన పరాకాష్ఠను అందుకుంది," అన్నారు కె. బాపయ్య. ఈయన దర్శకత్వంలో బి. వి. ఎస్. ఎన్. ప్రసాద్ నిర్మించిన శ్రీకృష్ణ ప్రసన్న పిక్చర్స్‌వారి పై చిత్రంలో శ్రీదేవి నాయిక. రావుగోపాలరావు, చంద్రమోహన్, గుమ్మడి, రాజేంద్రప్రసాద్, నూతన్‌ప్రసాద్, పరుచూరి వెంకటేశ్వరరావు, కనకాల దేవదాసు, చలపతిరావు, నర్రా వెంకటేశ్వరరావు, రాళ్లపల్లి, అరుణ, వై. విజయ, అన్నపూర్ణ, పూర్ణిమ, కె. విజయ, బీ రా, నిర్మల ఆదిగాగల వారు పాల్గొన్నారు. పరుచూరి సోదరుల రచన, వేటూరి గీతాలు, ఎ. వెంకట్ ఛాయ, సలీమ్ నృత్యాలు, చక్రవర్తి సంగీతం, భాస్కరరాజు శిల్పం, ఎం. ఎస్. దాస్ సాహసాలు, జెట్టి హేమాంబర్ సహకార దర్శకత్వం, కె. ఎ. సుబ్బారావు నిర్వహణ, కోటగిరి వెంకటేశ్వరరావు కూర్పు నిర్వహించారు. □

సినిమా

తెలుగు వారి....
మేనక - విశ్వామిత్రముని
గమనిక:
తపోభంగం సీను
పెద్దలకు మాత్రమే

అమెరికాలో నిర్మించిన అపురూప కథా చిత్రం !



అన్నపూర్ణా వారి

# అమెరికా అబ్బాయి



నిర్మాత
దుక్కిపాటి మధుసూదనరావు B.A.,

దర్శకత్వం
సింగీతం శ్రీనివాసరావు B.Sc., సంగీతం యస్. రాజేశ్వరరావు



సీరియల్

# ఆరోహణ

## శైలకుమార్

(గత సంచిక తరువాయి)

చక్రవర్తి ఉత్తరాన్ని చూసి అతన్ని స్వయంగా చూసినట్లు ఆనందపడ్డాడు ప్రభాకర్. చక్రవర్తి వెళ్ళినప్పటి నుండి అతను మద్రాసులో ఎలా వున్నాడో, ఎక్కడ వున్నాడో అని బాధపడ్డాడు ప్రభాకర్ ఏదో ఆశగా వెళ్ళిన చక్రవర్తి పట్ల జాలి, తన మాట వినకుండా ఉద్యోగం వదిలేసినందుకు కోపం కలిగాయి ప్రభాకర్‌కు.

చక్రవర్తి అలా వెళ్ళిపోవటానికి కారణమైన నీలిమను చూడాలని, చక్రవర్తి విషయం చెప్పి ఆమెను తిట్టాలని చాలాసార్లు అనుకున్నాడు కాని సంస్కారం అడ్డు రావటంవల్ల ఆ పని చేయలేకపోయాడు ప్రభాకర్.

చక్రవర్తి సినిమాకు రచన చేస్తున్నాడన్న విషయాన్ని వెంటనే ఆఫీసులో అందరికీ చెప్పేశాడు ప్రభాకర్

"నాకు ముందే తెలుసండీ చక్రవర్తి చాలా అదృష్టవంతుడు ఇక్కడ వుండాల్సినవాడు కాదు" అన్నాడు పశుపతి

అంతకుముందు రోజే చక్రవర్తిలాంటి వాళ్ళు ఎందరో ఆశగా మద్రాసు వెళ్ళి అవకాశాలు రాక పాండీబజారులో అడుక్కుంటున్నారని అన్నాడు పశుపతి

మనుషుల మనస్తత్వాలు చిత్రంగా ఉంటాయి తమతో పాటుగా వున్న వ్యక్తి జీవితంలో ఎదగటానికి ప్రయత్నం చేస్తే మొదట్లో విమర్శిస్తారు అతన్ని నిరుత్సాహపరచటానికి అన్ని విధాలా ప్రయత్నిస్తారు తీరా ఆ మనిషి పైకి వెళ్ళిపోతూ వుంటే తమకెక్కడ అందడో అన్న భయంతో అతన్ని పొగడడం ప్రారంభిస్తారు తాము విమర్శించినదంతా అతని మంచి కోసమే అంటారు.

పశుపతిది కూడా అలాంటి మనస్థితే అసహ్యంగా చూశాడు పశుపతి వైపు ప్రభాకర్

"ఏ సినిమాకు రాస్తున్నారండీ అడిగాడు ఇంకో క్లర్కు

"వివరాలేమీ రాయలేదు మొత్తానికి దేనికో రాస్తున్నాడట"

"డబ్బు బాగా ఇస్తారనుకుంటా'

నవ్వాడు ప్రభాకర్ ఆ మాటకు తన పనిని ఆపి మౌనంగా వాళ్ళ మాటలను వింటోంది రేఖ

"ఆఫీసులో అందరినీ పేరు పేరునా అడిగినట్లు చెప్పమన్నాడు' రేఖ వైపు చూస్తూ అన్నాడు ప్రభాకర్

"చక్రవర్తి ఎంత పెద్దవాడయినా మనల్ని మరచిపోడు" ఆశగా అన్నాడు పశుపతి.

మధ్యాహ్నం లంచ్ బ్రేక్‌లో ప్రభాకర్ దగ్గరకి వచ్చింది రేఖ.

"ఆ ఉత్తరం ఓసారి ఇవ్వు" అడిగింది

"ఏ ఉత్తరం"

ప్రభాకర్ కళ్ళల్లోకి సూటిగా చూసింది రేఖ అవసరమైన రాత్రులు తనతో ఎంతో చనువుగా వుండే ఇతను బయట ఎందుకు ఇంత దూరం వున్నట్లు ప్రవర్తిస్తాడు. అర్థంకాదు ఆమెకు

'చక్రవర్తి రాసింది'

"ఎందుకు రేఖా"

"ఉత్తరం ఎందుకు చదవటానికి విసురుగా అంది

"నాకు తెలుసు చక్రవర్తి అడ్రసు కోసం కదూ'

"ఏం ఈర్ష్యగా ఉందా నీకు"

గట్టిగా నవ్వాడు ప్రభాకర్

"ఈర్ష్య కాదు రేఖా భయం

"ఎందుకు"

'అతన్ని కూడా పాడు చేస్తావేమోనని'

ఛళ్ళున కొట్టినట్లు దెబ్బతింది రేఖ ఆమె కళ్ళల్లో తిరిగిన నీళ్ళు ప్రభాకర్ గమనించలేదు

"అతనంత బలహీనుడు కాదులే ఉత్తరం ఇస్తావా ఇవ్వవా" సూటిగా అడిగింది

"ఇది నా పర్సనల్ లెటర్ నీకు అవసరమైనపుడు అడుగు అడ్రసు ఇస్తాను' అన్నాడు నవ్వుతూ.

పశుపతి రావటంతో ఇద్దరూ మాటలు ఆపేశారు తన సీటులోకి వెళ్ళింది రేఖ

* * * * * * * * * * *

జనతా ప్రొడక్షన్స్ ఆఫీసులోకి అడుగుపెట్టాడు చక్రవర్తి. ముందు గదిలో ఎవరెవరో కూర్చుని మాట్లాడుకుంటున్నారు

ఆ కొద్ది రోజుల్లోనే చాలా విషయాలు తెలుసుకున్నాడు చక్రవర్తి శశాంక పరిచయం చేసినవాళ్ళనే కాక తనూ స్వయంగా చాలామందిని కలుసుకుంటున్నాడు ఎవరి సహాయమూ లేని ఒక కొత్త వ్యక్తికి సినిమారంగంలో అవకాశం రావటం ఎంత కష్టమో అర్థం కాసాగింది చక్రవర్తికి. అయినా విసుగూ విరామం లేని ప్రయత్నం చేస్తూనే వున్నాడు

'ప్రొడ్యూసరుగారున్నారా అడిగాడు

"లోపలికెళ్ళండి" లోపల వున్న మరో గదిని చూపించాడు ఓ వ్యక్తి

చేతిలో ఫైళ్ళను మరోసారి చూసుకుని ప్రొడ్యూసరు గదిలోకి అడుగు పెట్టాడు చక్రవర్తి ఆ కంపెనీ ప్రొడ్యూసరు, డైరెక్టరు, మరో ఇద్దరు కూర్చుని వున్నారు ఆ గదిలో

"నమస్తే' అన్నాడు చక్రవర్తి అక్కడవున్న అందరినీ ఉద్దేశించి

"ఎవరు నువ్వు ఏం కావాలి" అడిగాడు ప్రొడ్యూసరు చక్రవర్తిని కనీసం

జరిగిన కథ-8 : ఆఫీసులో అవహేళనలకు గురవుతూ మనశ్శాంతి కోసం కపిలతీర్థం వెళ్ళిన చక్రవర్తికి నీలిమ పరిచయ మవుతుంది నీలిమతో సాన్నిహిత్యాన్ని శాశ్వతం చేసుకోవాలనుకుంటాడు చక్రవర్తి నీలిమకు పెళ్ళయిందనీ, భర్తకు ప్రమాదంలో కాళ్ళు పోయాయనీ తెలుసుకొని హతాశుడవుతాడు ఆ నిరాశతో తిరుపతి వదిలి మద్రాసు వెళతాడు కొత్తవారికి స్థానం ఇస్తానని ప్రకటించిన సత్యం వంటి డైరెక్టర్ దగ్గరకూడ ఆశాభంగం అవుతుంది శశాంక పరిచయ మవుతాడు ఏ పనీ లేకపోయినా అందరితో పరిచయాల మీద బతికేస్తున్న శశాంక తాను కాబోయే డైరెక్టర్‌నని, తన సినిమాలో స్థానం ఇస్తానని భ్రమింపజేసి చక్రవర్తిని తన గదిలో చేర్చుకుంటాడు

కూర్చోమని కూడ చెప్పనందుకు చక్రవర్తికి బాధ కలిగింది.

అప్పటికే రెండు సినిమాలు తీసి వున్నాడు ఆ ప్రొడ్యూసరు అందులో ఒకటి బాగా హిట్ అయింది. నెల్లూరు జిల్లాలోని ఓ మారుమూల గ్రామంలో వ్యవసాయం, చిల్లరకొట్టు వ్యాపారము చేసేవాడు ఆయన ఇండస్ట్రీకి రాకముందు వరుసగా నాలుగు సంవత్సరాలపాటు విపరీతంగా లాభాలు రావటంతో ఆ డబ్బు ఏం చెయ్యాలో తెలీక బావమరిది సలహాతో సినిమా ఫీల్డుకు వచ్చాడు. రెండు సినిమాలుతీసినప్పటికీ ఆయన ప్రవర్తనలోను, భాషలోను ఏమాత్రం మార్పురాలేదు పైపెచ్చు పెద్ద ప్రొడ్యూసర్నన్న గర్వంతో అందరినీ తేలిగ్గాచూడటం అలవాటైంది.

తన విషయాన్ని వివరంగా చెప్పుకున్నాడు చక్రవర్తి తన గురించి తనే చెప్పుకోవటానికి మొదట్లో చాలా సిగ్గుపడేవాడు చక్రవర్తి ఇప్పుడది అలవాటై' పోయింది.

"అయితే ఏవిఁటంటావూ" దీర్ఘం తీస్తూ అడిగాడు

"అనేదేముంది సినిమాకు రాస్తానంటాడు ప్రక్కనున్న వ్యక్తి అన్నాడు

"ఇంతకుముందు రాసినావా ఏవఁన్నా'

'రాశానండీ అంటూ తన అచ్చయిన రచనలు, పాటలు వున్న ఫైలు ప్రొడ్యూసర్కు అందించాడు

అనుభవించి పలవరించాల్సిన కవిత్వాన్ని అక్షరజ్ఞానం లేని ఆ చింతపండు వ్యాపారి చేతికి ఇవ్వటానికి ఎంతో నలిగిపోయింది చక్రవర్తి మనసు

చక్రవర్తి ఫైలును అటూ ఇటూ నిర్లక్ష్యంగా తిప్పాడు ఆ ప్రొడ్యూసరు

'ఇది సరేనయ్యా సినిమాకు రాసినావా

"లేదండి అవకాశం కోసం చూస్తున్నాను"

'పొలం దున్నే పెతోడికీ లాభాలు రానట్టే కలం బట్టిన పెతోడూ సినిమాకు రాయలేడయ్యా' తీరిగ్గాచుట్ట ముట్టించుకుంటూ అన్నాడు

ఆ మాటతో విపరీతమైన కోపం వచ్చింది చక్రవర్తికి కాని ఆవేశపడటానికి అనువైన ప్రదేశం కాదది అర్థిస్తూ వచ్చినప్పుడు అవతలివాళ్ల మాటలు వినక తప్పదు అడిగేవాడికెప్పుడూ చెప్పేవాడు లోకువే

అచ్చురాలొచ్చిన పెతోడూ సినిమాకు రాయాలని పరుగెత్తుకొచ్చేస్తే ఇగ దేశం ఏం బాగుపడుద్ది" ప్రక్కన వున్న మరో వ్యక్తిని చూస్తూ అన్నాడు అతను నవ్వాడు



# ఆరోహణ

"ఇప్పటిదాకా ఎన్నోవేల పాటలు రాసిన మా రసయితే రాత్రీ పగలూ మందుకొట్టి ఆలోసిచ్చినా మంచి పాటలు రాయటల్లేదు. ఇక నువ్వేం రాత్తావయ్యా" అన్నాడు హేళనగా.

"అవకాశం వచ్చినపుడు గదండీ రాసేదీ లేనిదీ తెలిసేది" బాధగా అన్నాడు చక్రవర్తి. అక్షరాల విలువ, ఆలోచనల బరువు తెలియని ఆ వ్యక్తి అవమానకరంగా మాట్లాడుతున్నందుకు చక్రవర్తి తలకొట్టేసినట్టుగా వుంది.

"నీకు అవకాశం ఇచ్చి నన్ను మునిగిపొమ్మంటావా?" అంటూ కడుపు కదిలిపోయేలా నవ్వాడతను. అతనితో శృతికలిపారు అందరూ. వారెందు కలా నవ్వవలసివచ్చిందో అర్థం కాలేదు చక్రవర్తికి.

"పాట మీ అందరికీ నచ్చినపుడేగదా తీస్కుంటారు. అలాంటపుడు మునిగిపోయే అవకాశం ఎందుకుంటుంది" విసురుగానే అన్నాడు చక్రవర్తి. ఎలాగూ వాళ్ళు తనతో పాట వ్రాయించుకోరన్న విషయం స్పష్టమయింది. అటువంటప్పుడు ఎందుకు తన అహాన్ని చంపుకోవాలి అనుకున్నాడు.

"ఏదీ అంత పోటుగాడివా"

"పోటుగాడిని కాదండీ పాటగాడిని" స్థిరంగా అన్నాడు చక్రవర్తి.

"అఁహాఁ ఏదీ నామీద ఓ పాట రాయి సూద్దాం" వ్యంగ్యంగా అడిగాడు ఆ ప్రొడ్యూసరు.

కోపంగా ఆయన ముఖంలోకి చూశాడు చక్రవర్తి

'మీ మీద రాస్తే మీకు నచ్చదు"

ఇంతలో బాయ్ కాఫీలు తీసుకుని వచ్చాడు.

"ఆశపడి వచ్చావు గాని కాఫీ తాగెళ్ళు".

కాఫీ వంక, ఆ ప్రొడ్యూసరు వంక మార్చి మార్చి చూశాడు చక్రవర్తి. ఆ వేడి కాఫీని అతని మొహం మీద కొట్టాలనిపించింది.

"ఇదిగో కుర్రాడా నాలుగు కతలు రాసేసి శానా గొప్పోడిననుకోమాక. నాలుగు హిట్టు సినిమాలకు రాయి అప్పుడు నేనే వత్తా నీ దగ్గరకి పాటలు రాయమని. ఏం అర్థమైందా"

"అర్థమైంది" విసురుగా అని లేచాడు చక్రవర్తి కాఫీ త్రాగకుండా.

"ఏటర్థమైంది" ఆశ్చర్యంగా చూస్తూ అడిగాడు.

"అడుక్కుతిన్నా పరవాలేదుగాని అవకాశం కోసం నీలాంటివాడి దగ్గరకు రాకూడదని అర్థమయింది. ఎందుకో తెలుసా? చేపలమ్ముకునేవాడికి మల్లెపూలనిస్తే కంపుకొడుతున్నాయన్నాట్ట అందుకు" అని బయటకి వచ్చేశాడు చక్రవర్తి.




రోడ్డు మీదికి వచ్చాడు చక్రవర్తి. ఎటు పోతున్నదీ కూడ తెలియకుండా నడుస్తున్నాడు. అతని హృదయాన్ని చాలా దెబ్బతీసింది ఆ అవమానం. నిరాశ విషంలా నరనరానా పాకుతోంది. తానెంతో పతనమయినట్టు, దిగజారి పోయినట్టు అనిపిస్తోంది.

అవమానపరచేవాళ్ళు, ఆశ చూపేవాళ్ళే తప్ప అవకాశం ఇద్దామని శక్తి పరీక్షిద్దామని అనుకొనే నిర్మాతలు చాలా తక్కువమంది సినీరంగంలో కవిత్వమంటే తెలియనివాళ్ళు, అక్షరాలు ఎన్నున్నాయో సరిగ్గా చెప్పలేని వాళ్ళే ఎక్కువమంది. డబ్బు వుంది కాబట్టి దాంతో సినిమాలు తీసి లక్షల లాభాలు పొందాలని వస్తారే తప్ప కళాసేవ కోసం మాత్రంకాదు.

అపరిమితమయిన గ్లామరు ఆ రంగానికి వుండటంవల్ల అందరు కళాకారులు ఎగబడుతున్నారు సినీ ఫీల్డుకు పేరు ప్రతిష్ఠలతో పాటు డబ్బూ వస్తుందన్న ఆశ. వెంటనే ప్రజలలో గుర్తింపు లభిస్తుంది కాబట్టి ప్రతి కళాకారుడి దృష్టి ఆ రంగంమీదే.

'ఇంత పోటీ వున్న ఈ వ్యాపారాత్మక రంగంలో తాను పైకి రాగలనా' అనుకున్నాడు చక్రవర్తి. అతనిలోని ఆశ రోజు రోజుకూ తరిగిపోతూ వుంది. మనిషికి మనిషికి మధ్య నటన తప్ప ఇక్కడ ఇంకేంలేదు. పైకి రావటం కోసం ఏమయినా చేయగల స్వార్థం తప్ప ఇక్కడ మనిషిని ఎవ్వరూ ప్రేమించరు.

ఎవరో పిలిచినట్టయి ఆగాడు చక్రవర్తి. వెనక్కి తిరిగి చూశాడు.

"చక్రవర్తి మీరే కదూ" అడిగాడు ఆ వ్యక్తి దగ్గరకి వచ్చి.

"ఔను"

"మా ప్రొడ్యూసరుగారు పిలుస్తున్నారు"

"ఎవరు" ఆశ్చర్యంగా, అనుమానంగా అడిగాడు.

"రాంబాబుగారు. చరిత్రా క్రియేషన్స్"

ఆశ్చర్యపోయాడు చక్రవర్తి. ఆ ప్రొడ్యూసర్ తననెందుకు పిలుస్తున్నాడా అని. అప్పటికే కొన్ని సినిమాలు తీసివుంది ఆ కంపెనీ.

"రండి" రోడ్డు ప్రక్కన ఆపివున్న కారు దగ్గరకు తీసుకెళ్ళాడు చక్రవర్తిని.

"నమస్తే" అంటూ కారులోకి చూశాడు చక్రవర్తి.

ఇందాక వెళ్ళిన జనతా ప్రొడక్షన్స్ ఆఫీసులో తనూ కూర్చుని వున్నాడు. ఆ ప్రొడ్యూసరు తనని అవమానిస్తుండగా చూస్తున్నవాళ్ళలో ఆయనా ఒకడు.

వెంటనే వెనుదిరగబోయాడు చక్రవర్తి.

"చక్రవర్తీ" పిలిచాడు రాంబాబు.

ఆగాడు చక్రవర్తి అనుమానంగా

"రా. కారెక్కు"

ఎందుకు పిలిచాడో తెలుసుకుందామని కారెక్కాడు చక్రవర్తి. కారు కదిలింది.

"ఇందాక జరిగిందానికి ఏమీ అనుకోవద్దు. ఆయన మాటలే అంత" సంజాయిషీ ఇస్తున్నవాడిలా అన్నాడు చరిత్రా క్రియేషన్స్ ప్రొడ్యూసరు రాంబాబు.

"పరవాలేదులెండి"

"చక్రవర్తీ నిజంగా నీకు ప్రతిభ వుంటే నేను అవకాశం ఇస్తాను. ఇప్పుడు నే తీస్తున్న సినిమాలో ఓ క్లబ్ సాంగ్ బ్యాలెన్సు వుంది. అది నువ్వు రాద్దువుగాని"

ఆశ్చర్యపోయాడు చక్రవర్తి. తాను విన్నది నిజమేనా అనుకున్నాడు. కొద్దిసేపటి క్రితంవరకు అతనిలో పేరుకుపోయి వున్న నిరాశ ఆ క్షణం తుడిచిపెట్టుకు పోయింది. హద్దులులేని ఆనందం కలిగి కృతజ్ఞతగా చూశాడు రాంబాబు వైపు.

"రాయగలనన్న నమ్మకం వుంది సార్. రేడియోకి చాలా పాటలు రాశాను"

"బయట రాయటానికి సినిమాకు రాయటానికి చాలా తేడా వుంది చక్రవర్తి. బయట నీకు రాయాలనిపించినపుడు, నీకు ఆలోచన వచ్చినపుడు రాస్తావు. కాని ఇక్కడ అలాకాదు. పదిమందిలో కూర్చుని రాయాలి. వాళ్ళు అడిగిన సమయంలో అడిగిన విధంగా రాయాలి. నీవు రాసింది అందరికీ నచ్చాలి" నెమ్మదిగా చెప్పాడు రాంబాబు, పాఠం చెబుతున్న టీచరులా.

ఒక్క క్షణం ఆలోచనలో పడ్డాడు చక్రవర్తి ఆయన చెప్పిందీ నిజమే. సినిమా రచయిత ఎప్పుడు ఏ క్షణం ఏది రాయమంటే అది రాయగలగాలి.

# గెలవండి! రూ. 20,000/-ల విలువైన బహుమతులు!




## కలువబాల చందాదారులకు లక్కీడిప్:

## ఈ అవకాశం జనవరి 31 వరకు



మొదటి బహుమతి
★ ఒక కలర్ టి.వి.

రెండవ బహుమతులు
★★ రెండు బ్లాక్ అండ్ వైట్ టి.వి.లు

మూడవ బహుమతులు
★★★ మూడు "కిచెన్ మెషిన్"లు (మిక్సర్‌లు)

నాలుగవ బహుమతులు
★★★★ నాలుగు "లేడీస్ రిస్ట్ వాచీ"లు

రు. 60లు సంవత్సర చందా కట్టగానే అందమైన 'కలువబాల' పత్రిక నెలకి రెండుసార్లు మీ యింటికి అందుతుంది. అదిగాక మీరి క్రింది బహుమతులు గెలుచుకోవచ్చు.

"చిరుకానుక" తప్పకుండా అందరికీ వుంటుంది.

మీరేం చెయ్యాలి? చేయవలసిందల్లా 'కలువబాల'కు ఏడాది 'చందాదారులుగా' చేరడమే! కాకపోతే మీ 'చందా' పైకంతో పాటు యిక్కడ యిచ్చిన కూపన్ పూర్తి చేసి పంపాలి!

అంతేకాదు ఈ బహుమతి పథకంలో పాల్గొన్న చందాదారులందరికి 'కలువబాల' నుంచి ఒక 'చిరుకానుక' కాలక్రమంలో అందుతుంది.

"లక్కీడిప్" 31-1-1987 లేదా ఆ లోపల కట్టే చందాలకి మాత్రమే వర్తిస్తుంది.

కూపన్‌లు, చందాలు పంపవలసిన చిరునామా:

కలువబాల,
కేరాఫ్: ఆంధ్రపత్రిక,
గాంధీనగరం, విజయవాడ-3.

---------- కత్తిరించాలి ----------



నిజమయితే ✓
కాకపోతే ×
అని గుర్తు పెట్టాలి

ఆంధ్రపత్రిక బొంబాయి నుంచి వెలువడుతూ వుండేది. ( )

దినపత్రిక కన్నా వారపత్రిక ముందే పుట్టింది. ( )

"భారతి" సాహితీప్రియుల పక్ష పత్రిక ( )

బాలరంజని పిల్లల పత్రిక ఆంధ్రపత్రిక ప్రచురణ ( )

కలువబాల చందాదారుల 'లక్కీడిప్' చందా కట్టిన వారి పూర్తి పేరు: ....................................

....................................

చిరునామా ....................................

....................................

....................................

ఎమ్. ఓ. పంపిన తేదీ ....................................
లేదా
డి. డి. జత చేయడమైనది




**పి. ఎన్. ఆర్. – కోలన కుర్రు**

నా వయస్సు 38 సం. లు. నాకు తరచూ కడుపు నెప్పిగా ఉంటుంది. ఇలా 10 సం. లుగా ఉంది. గత రెండు సం. లుగా మరీ ఎక్కువగా ఉంది. ఎన్నిమందులు వాడినా తగ్గుట లేదు. కడుపులో మంటగా ఉంటుంది. నీరుడి ఎక్కువగా అవుతూంది. ఎక్స్‌రే తీయించి కడుపులో అల్సర్ అన్నారు. ఆపరేషన్ వద్దు, చేయించు కుంటే మళ్ళీ వస్తుంది అన్నారు.

★ గాస్ట్రోజెజునాస్టమీ అనే ఆపరేషన్ కడుపులో అల్సర్ ఉంటే చెయ్యటం జరుగుతుంది. అలా చేసిన ప్రతి వారికీ మళ్ళీ పుండు వస్తుందనేది అపోహ మాత్రమే! ఆహార విషయంలో చెప్పిన జాగ్రత్తలు తీసుకున్న వారికి తిరిగి అల్సర్ రాదు.

**ఎస్. ఎల్. - తెనాలి**

నాకు ఈ మధ్య తరచుగా తల వెనుక భాగాన కుడి చెవికి ప్రక్కగా సన్నగా పోటు వస్తుంది. ఆఫీసులో పని ఎక్కువగా ఉన్నప్పుడు, ఎక్కువగా చదువుటవల్ల కూడా ఇలా అవుతున్నది. ఇది ఏ రకం జబ్బు? బ్రెయిన్‌ట్యూమర్ గురించి తెల్పండి?

ఈ లక్షణం బ్రెయిన్‌ట్యూమర్‌వల్ల రాదు. మిడిల్ ఇయర్ ఇన్‌ఫెక్షన్ వల్ల గాని, యూస్టేచియన్‌కెటార్ వల్లగాని ఇలా జరిగే అవకాశం వున్నది. దీనికి ఇ. యన్. టి. వైద్యుల వల్ల పరీక్ష చేయించుకోవలసి ఉంటుంది.

ఫిట్సు రావటం, తలనొప్పి, వాంతులు మొదలైనవి బ్రెయిన్‌ట్యూమర్ లక్షణాలు. ట్యూమర్ వచ్చిన ప్రాంతాన్ననుసరించి అదనంగా లక్షణాలు కనపడతాయి. ట్యూమర్ ఉన్న ప్రాంతాన్ననుసరించి శస్త్రచికిత్స చేసే వీలున్నదా లేదా అని తీర్మానిస్తారు.

**ఎం. కె. - హైదరాబాద్**

నా వయస్సు 30 సంవత్సరములు. 4 సంవత్సరములుగా కడుపు నెప్పిగావుంటోంది. డాక్టర్లకి చూపిస్తే కిడ్నీస్‌లో రాళ్ళు వున్నాయని మందులు, ఇంజక్షన్‌లు ఇచ్చారు. కొంచెము గూడా తగ్గలేదు. నెప్పి అధికం అయింది. నిలబడలేను. కూర్చోలేను.

మూత్రపిండాలలో రాళ్ళు (స్టోన్స్) వున్నప్పుడు అది స్వతహాగా విసర్జింపబడకపోతే శస్త్రచికిత్స ద్వారా తీసివేయవలసి వుంటుంది.

**డి. టి.- ఎల్లారెడ్డిగూడెం**

నా వయస్సు 21 సం.లు. నాకు మీసం, గడ్డం లేవు. దీనికి కారణం శరీరంలో హార్మోన్స్ తగినంతగా లేకపోవడం అని తెలిసింది. శరీరంలో హార్మోన్లు ఉత్పత్తి కావాలంటే ఏమి చెయ్యాలి?

మీరు మెడికల్ కాలేజీలలోని ఎండోక్రైనాలజీ డిపార్ట్‌మెంట్‌లో హార్మోన్ల "అస్సే" చేయించుకోవడం మంచిది.

శరీరంలో హార్మోన్లు లోపించినప్పుడు మాత్రల ద్వారాగాని, ఇంజక్షన్‌ల ద్వారాగాని వాటిని ఇవ్వటమే మార్గం. □

## ఆరోహణ

లేదంటే పైకి రావటం కష్టం. కీర్తి వచ్చేవరకు అందరూ అతన్ని శాసిస్తారు. ఒకసారి పేరు తెచ్చుకున్నాడా ఇక అందరూ అతని వెంట పడతారు. విచిత్రమయిన రంగం.

ఉస్మాన్ రోడ్డులోకి మలుపు తిరిగింది కారు.

"రాస్తాను సార్ మీకు నచ్చేటట్టు రాస్తాను" ఎంతో నమ్మకంగా అన్నాడు చక్రవర్తి.

కారు ఓ ఇంటిముందు ఆగింది. రాంబాబూ, చక్రవర్తి దిగి లోపలికి వెళ్లారు ఓ గదిలో కూర్చో పెట్టాడు చక్రవర్తిని. గదినిండా ఫైళ్ళు, గోడలకు ఎందరో నటీనటుల ఫోటోలు వున్నాయి. అది చరిత్రా క్రియేషన్స్ ఆఫీసు. ఎవరికో ఫోన్ చేసి వెంటనే రమ్మన్నాడు రాంబాబు.

"డైరెక్టరుగారికి ఫోన్ చేశాను. వెంటనే వస్తానన్నారు. ఈ లోపల పాట సీన్ చెబుతాను రాయటానికి ప్రయత్నించు" అన్నాడు రాంబాబు సిగరెట్ వెలిగించుకుంటూ.

సిగరెట్టు పెట్టెను చక్రవర్తి వైపు తోశాడు.

"వద్దండీ" అన్నాడు బిడియంగా చక్రవర్తి.

"పరవాలేదు తాగు మూడ్ రావద్దూ" నవ్వుతూ చెప్పాడు రాంబాబు.

సిగరెట్ వెలిగించుకున్నాడు చక్రవర్తి.

"కాఫీ తెప్పించనా".

"వద్దండీ"

"ఇలా మొహమాటపడకూడదు చక్రవర్తి. పాట రాయటానికి నీకు ఏమేం కావాలో చెప్పు తెప్పిస్తాను" అని బాయ్‌ను పిలిచి కాఫీ టిఫెన్లు తెమ్మన్నాడు.

"మొదటి నుంచీ మా సినిమాల్లో పాటలు శాస్త్రిగారే రాస్తున్నారు. ఈ సినిమాలో ఈ పాట మాత్రం మిగిలిపోయింది. ఆయన ఊళ్లో లేరు. అందుకే నీకు అవకాశం ఇస్తున్నా"

"కృతజ్ఞతలు సార్"

"ముందే చెబుతున్నాను నీవు రాసింది మాకు నచ్చితేనే తీసుకుంటాను. లేకపోతే బాధపడవద్దు"

"అలాగేసార్"

డైరెక్టర్ రావటంతో అతనికి పరిచయం చేశాడు చక్రవర్తిని. కాఫీ, టిఫెన్లు వచ్చాయి. చేశారు.

"చక్రవర్తి ఓ ఆఫీసరుకు ట్రాన్స్ఫరు వచ్చింది. ఆఫీసు స్టాఫ్ అంతా కలిసి ఆయనకు ఓ హోటల్‌లో ఫేర్‌వెల్ పార్టీ ఇస్తున్నారు. అందరూ తేడాలు మరచి తాగుతూ వున్నారు. వాళ్ళు తాగుతూ వుండగా క్లబ్ డ్యాన్సర్ ప్రవేశించి పాట పాడుతూ డ్యాన్సు చేస్తుంది. పాటలో కేవలం ఆఫీసుకు సంబంధించిన పదజాలమే వాడాలి. బూతు అర్థం రావాలి. సెన్సారువాళ్ళకి దొరకకూడదు. రాయగలవా" తాపీగా సీను వివరించి చెప్పాడు.

తల ఊపి కాగితం కలం చేతికి తీసుకున్నాడు చక్రవర్తి.

"టేప్ చేసి వుంచిన ట్యూను వినిపిద్దామా" అడిగాడు డైరెక్టర్.

"కొత్తవాడు కదండీ రాసింతరువాతే ట్యూను చేద్దాం"

అసిస్టెంటు డైరెక్టర్, ప్రొడక్షన్ మేనేజరు కూడా వచ్చి ఆ గదిలో కూర్చున్నారు.

ఆఫీసరు ఫేర్‌వెల్ పార్టీలో క్లబ్ డ్యాన్సు ఏమిటండీ అనిగాని, ఆఫీసరు ముందు మిగతావాళ్ళు తాగటం ఏమిటి అనిగాని ప్రశ్నించలేదు చక్రవర్తి. ఎందుకంటే అది సినిమా. సినిమాలో జానెడు గుడ్డతో కుప్పిగంతులు వేస్తూ రతిభంగిమలు చూపే డ్యాన్సు కావాలి. అది బాక్సాఫీసు ఫార్ములా.

(ఇంకా ఉంది)

నదిలో కెరటాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి. మాటా మంతీ లేకుండా మౌనంగా కూర్చున్న ఆ తండ్రీ కొడుకుల చేత ఏదో విధంగా పలికించాలని తాపత్రయపడుతున్నట్లున్నాయా కెరటాలు.

తండ్రి పేరు పేరయ్య.

కొడుకు పేరు వీర్రాజు.

ఇద్దరూ నది ఒడ్డున కూర్చుని నది వంకనే చూస్తున్నారు కానీ కెరటాల హోరు వినడం లేదు. ఇద్దరి మనసుల్లోనూ కెరటాలకు మించిన రభస జరుగుతోంది.

"అయ్యా – నేను స్వతంత్రంగా బ్రతకాలనుకుంటున్నాను" – అన్నాడు వీర్రాజు కాసేపటికి.

నదిలో కెరటాల జోరు తగ్గింది. బహుశా ఆ తండ్రీ కొడుకుల సంభాషణ వినాలని కుతూహల పడుతున్నదేమో నది!

"ఏం – నేను స్వతంత్రంగా బ్రతకడం లేదా?" అన్నాడు పేరయ్య.

"లేదు" అన్నాడు వీర్రాజు.

"నా స్వతంత్రానికేం తక్కువయిందో చెప్పు. తెలుసుకుంటాను" – అన్నాడు పేరయ్య ఉక్రోషంగా.

"నేను నీ కన్నకొడుకుని... నాకు బాగా చదువొచ్చింది. ఇప్పుడు పట్నంలో ఉద్యోగం చేయాలనుకుంటున్నాను. నువ్వెందుకొప్పుకోవు?"

"నిన్ను పట్నం వెళ్ళొద్దన లేదు. ఉద్యోగం చేయొద్దన లేదు. పైగా కష్టపడకుండా ఉద్యోగం కూడా సంపాదించి పెట్టాను...."

"రాజా బాబు దగ్గరే కదా – అది నాకిష్టం లేదు...."

"ఎందుకని?"

"ఆ యింట్లో వాళ్ళు మనుషుల్ని మనుషుల్లా చూడరు. ఉద్యోగమెలాంటిదైనా నేను మనిషిలా బ్రతకాలనుకుంటున్నాను...."

"రాజాబాబు గురించి నీకేం తెలుసునని అలాగనుకుంటున్నావు?"

"ముకుందరావు బాబు నిన్నెలా చూస్తున్నాడో నాకు తెలుసు...."

"అయితే?"

"రాజాబాబుది అచ్చం తండ్రి పోలిక..."

"ముకుందరావు బాబు దగ్గర నాకొచ్చిన లోటేమిటో చెప్పు..."

"నువ్వాయనకు బానిసవు. ఆయనకు వెట్టి చాకిరీ చేస్తావు. నువ్వు తప్పు చేస్తే ఆయన నిన్ను వెధవా అని తిడతాడు. నీ వల్ల తనకు మంచి జరిగినా వెధవ కానా అని మెచ్చుకుంటాడు. ఆయన దృష్టిలో నువ్వెప్పుడూ వెధవ్వే!"

"మంచికీ చెడ్డకూ నేనూ నిన్ను వెధవా అంటాను. అది తండ్రీ కొడుకుల అనుబంధం. అంతేకానీ నువ్వు నా దృష్టిలో వెధవ్వి కాదు...."

"ముకుందరావు బాబు కొడుకు పట్నంలో ఉంటున్నాడు. అక్కడ ఆయనకు పెద్ద మేడ ఉంది. మూడు కార్లున్నాయి.

"అయితే?"



"అవన్నీ ఆ బాబుకు తండ్రి ద్వారా వచ్చాయి."

"అవును–"

"నా చిన్నప్పట్నుంచీ మనం అదే పూరిగుడిసెలో ఉంటున్నాం–"

"అయితే ఏమంటావ్?" పేరయ్య విసుగ్గా అన్నాడు.

"ముకుందరావు బాబు నిన్ను వెధవా అనడం వరకే తండ్రి –"

"నీ బాధేమిటో నాకర్థం కావడం లేదు. ఈ ఊళ్ళో మన కంటే దరిద్రంగా బ్రతుకుతున్న వాళ్ళున్నారు. రాజయ్య కొడుకు వెంకటేశు తెలుసు కదా నీకు." అన్నాడు పేరయ్య.

"తెలుసు..."

"వాడూ నీకు లాగే చదువుకోవాలనుకున్నాడు. కానీ భూషణరావుగా రొప్పుకోలేదని మానేశాడు. మన ముకుందరావు బాబ లాంటి వాడు కాదు. నీకు చదువొస్తోందని తెలియగానే ప్రోత్సహించి చదివించారు...

"నా చదువు గురించి అయిన రభస నాకు గుర్తుంది" – అన్నాడు వీర్రాజు సాలోచనగా.

వీర్రాజు అయిదవ తరగతిలో క్లాసుకు ఫస్టుగా ప్యాసయ్యాడు. అది తెలిసి అతడి మేనమామ – వీర్రాజును తన వద్ద పట్నంలో ఉంచుకుని చదివిస్తానన్నాడు. అతడికి పట్నంలో కూరగాయల వ్యాపారముంది. వాళ్ళ బంధువుల్లో పట్నం వెళ్ళి బాగుపడ్డ అతి కొద్ది మందిలో అతడొకడు.

ఆశీర్వాదం కోసం పేరయ్య వీర్రాజును ముకుందరావు వద్దకు తీసుకుని వెళ్ళాడు. ముకుందరావు తెల్లబోయి – "నీ కొడుక్కి చదువా?" అన్నాడు.

"అంతా తమ దయ!" అన్నాడు పేరయ్య.

"నీ తరవాత ఇక్కడ పని చేయడానికి – వీడికి ట్రయినింగివ్వవా?" అన్నాడు ముకుందరావు.

"కుర్రాడికి చదువుకోవాలనుంది బాబూ!" అన్నాడు పేరయ్య..

ముకుందరావు ససేమిరా అన్నాడు. వీర్రాజు మేనమామ తిరిగి పట్నం వెళ్ళిపోయాడు.

వీర్రాజు చదువు కోసం ఇంట్లో సత్యాగ్రహం చేసి తిండి మానేశాడు. విషయం ముకుందరావు దాకా వెళ్ళింది..

"కుర్రాడి కంత మంకు పట్టేమిటి? నాలుగు తంతేసరి" – అన్నాడాయన.

పేరయ్య వీర్రాజును గొడ్డును బాదినట్టు బాదాడు.

వీర్రాజుకు జ్వరం వచ్చింది. జ్వరంలో కూడా చదువు గురించి ఒకటే కలవరింత.

అప్పటికి వీర్రాజు పేరయ్యకు ఒక్కగానొక్క కొడుకు. పేరయ్య ముకుందరావు దగ్గర భోరున ఏడ్చాడు.

ముకుందరావు హృదయం కరుగలేదు కానీ భ్రుకుటి ముడతలు పడింది. ఆయన కాసేపాలోచించి – "సరే – వాణ్ణి చదువుకోమను. చదువయ్యాక వాడు మా యింట్లోనే పని చేయాలి" – అన్నాడు.

"ఇప్పుడే ఇంత మొండిగా ఉన్నాడు. చదువయ్యాక వాడు పాలేరు పనికి ఒప్పుకుంటాడా బాబూ!" అన్నాడు పేరయ్య అనుమానంగా.

"చదువుకున్న వాడి చేత పాలేరు పని చేయించే వంశం కాదు రా మాది! వాడికి తగ్గపనే వాడికిస్తాను" – అన్నాడు ముకుందరావు.

"తమరు ధర్మప్రభువులు...." అన్నాడు పేరయ్య.

"చదువయ్యాక మా యింట్లో పని చేస్తానని వాడి చేత కాళీమాత ముందు ఒట్టేయించు..." అన్నాడు ముకుందరావు.

పేరయ్య కొడుకు చేత ఒట్టేయించాడు. ముకుందరావు వీర్రాజు చదువుకు అనుమతినిచ్చాడు.

ఇప్పుడు వీర్రాజు బియ్యే ప్యాసయ్యాడు. ముకుందరావతణ్ణి రాజాబాబు వద్ద పని చేయమంటున్నాడు.

ముకుందరావు గానీ, రాజాబాబు గానీ – పేరయ్యనూ, అతడి కుటుంబ సభ్యులనూ మనుషుల్లా చూడరు. అది పేరయ్యకు సహజంగా కనపడవచ్చు. కానీ చదువుకుంటున్న వీర్రాజు కది భరించ శక్యం కాకుండా ఉండేది. తన చదువయ్యాక వాళ్ళకు దూరంగా ఎక్కడికైనా పోవాలనుకున్నాడు.

కానీ యిప్పుడు తండ్రి రాజాబాబు దగ్గర ఉద్యోగం చేయమంటున్నాడు. అందుకే వీర్రాజు తండ్రికి తన చదువుకు ముకుందరావు చేసిన రభస గుర్తు చేసి –"నీ కొడుకును నువ్వు చదివించుకుందుకు అయ్యగారి అనుమతి కావాలి. ఇలాంటి బ్రతుకు బ్రతికే కంటే చావడం మేలు..." అన్నాడు.

పేరయ్య నవ్వి – "నేను కట్టుబడింది ముకుందరావుబాబుకని నువ్వనుకుంటున్నావు. అది సరికాదు. ఈ ప్రపంచంలో ఏ మనిషికీ నేను భయపడను" – అన్నాడు.

"ఒక్క ముకుందరావు బాబుకు తప్ప.." అన్నాడు వీర్రాజు.

"అదీ నిజం కాదు. నాకు కాళీమాతంటే భక్తి, గౌరవం. అందుకే ముకుందరావు బాబుకు కట్టుబడ్డాను. నేను కాళీమాత ముందు ఒట్టేసి – గొంతులో ఊపిరున్నంత వరకూ ముకుందరావు బాబు కుటుంబాన్ని సేవించుకుంటానని చెప్పాను. మన వంశంలో ఎవరూ యింత వరకూ కాళీమాత ముందు ఒట్టేసి తప్పలేదు. అలా చేయడం క్షేమం కాదనడానికెన్నో నిదర్శనాలున్నాయి –" అన్నాడు పేరయ్య.

ఆ ఊళ్ళో కాళీమాత గుడి ఉంది. ఆ దేవి మహిమల గురించి ఎన్నో కథలు ప్రచారంలో ఉన్నాయి. ప్రామిసరీ నోటుకు మించిన ప్రాముఖ్యత ఆ ఊళ్ళో కాళీమాత ముందు వేసిన ఒట్టుకుంది.

వీర్రాజుకూ కాళీమాత మహిమలపై నమ్మకముంది. చిన్నతనంలో విన్న కథలన్నీ – అతడిని కాళీమాత విషయంలో తర్కానికి అతీతుణ్ణి చేశాయి. ఒకసారి అతడు చిన్నప్పుడు కాళీమాత ముందు ఒట్టేసి అబద్ధం చెబితే – అతడి తల్లికి జ్వరం వచ్చింది. వీర్రాజు హడిలిపోయి కాళీమాతను క్షమార్పణ వేడుకున్నాడు. తల్లి జ్వరం తగ్గిపోయింది.

"ఒట్టు విషయం నాకూ గుర్తుంది. అందుకే నిన్ను బ్రతిమాలుకుంటున్నాను. అయ్యా – ఎలాగో అలా నాకు ముకుందరావు బాబు కుటుంబం నుంచి విముక్తి లభించేలా చూడు. నువ్వు బ్రతిమాలితే ఆయన వింటారు –" అన్నాడు వీర్రాజు.

"అది నావల్ల కాదు. ఒకసారి ఒట్టేశాక రెండో ఆలోచనుండదు నాకు. చేతనైతే నువ్వే ఆయన్ను మంచి చేసుకో. ఎలాంటి పరిస్థితుల్లోనూ ఒట్టు మాత్రం తప్పకు...." అన్నాడు పేరయ్య.

"నా ప్రయత్నం నేను చేస్తాను" అంటూ లేచాడు వీర్రాజు.

అప్పుడే నదిలో కెరటాల జోరు మళ్ళీ హెచ్చింది ఆ హోరు వీర్రాజును పరిహసిస్తున్నట్టుంది.

## 2

"నేను కో అంటే కోటి మంది నన్ను సేవించుకునేందుకు సిద్ధంగా ఉన్నారు. మనం ఈ వీర్రాజు గాడినెందుకు బ్రతిమాలాలి నాన్నా!" అన్నాడు రాజాబాబు చిరాగ్గా.

"ఏం – ఏమయింది?" అన్నాడు ముకుందరావు.

"ఆ వెధవ నా దగ్గర కొచ్చి – తను మేనమామకు వ్యాపార వ్యవహారాల్లో చేదోడువాదోడుగా ఉండాలనుకుంటున్నట్టు చెప్పాడు. వాడికి నా దగ్గర పని చేయడం ఇష్టం లేదు...."

"వాడిష్టంతో మనకు పనేమిటి?" అన్నాడు ముకుందరావు.

"ఇష్టం లేనివాడితో మనకు పనేమిటి?" అన్నాడు రాజాబాబు.

"ఉంది. మనం చేస్తున్న వ్యవహారాలకు నమ్మకస్థుడైన మనిషి కావాలి. ఒట్టుకు కట్టుబడ్డ వీర్రాజు మన నుంచి ఆశించేది తక్కువ. నమ్మకంలో కుక్కలు కూడా వాడి సాటి రావు..." అన్నాడు ముకుందరావు.

రాజాబాబుకు అసలు విషయం త్వరగానే అర్థమయింది.

వెంటనే వీర్రాజుకు కబురు వెళ్ళింది.

వీర్రాజు వచ్చాడు. అతడికి ముకుందరావు తన అంతిమ నిర్ణయం చెప్పాడు. అప్పుడు వీర్రాజు – "అయ్యగారూ – పోనీ – నేనిక్కడే ఉండి మీపనులు చూసుకుంటాను. నన్ను రాజాబాబు గారి దగ్గరకు పట్నం పంపకండి–" అన్నాడు.

"ఎందుకని?"

"ఆయన పద్ధతులు సరైనవి కావని పట్నంలో చెప్పుకుంటారు. నేను సాఫీగా బ్రతకాలనుకుంటున్నాను ...." అన్నాడు వీర్రాజు.

"బాగుపడ్డ వాళ్ళనూ, పేరు తెచ్చుకున్న వాళ్ళనూ చూసి ఓర్వలేని వాళ్ళ లాగే చెప్పుకుంటారు. నువ్వు పట్టించుకోకు. నిజంగా తప్పు చేసే వాళ్ళను శిక్షించడానికి ఆపైవాడున్నాడు...." అన్నాడు ముకుందరావు శాంతంగా.

వీర్రాజు ఆయనతో వాదించలేక పోయాడు.



ముకుందరావు వీర్రాజును, రాజాబాబును తీసుకుని కాళీమాత ఆలయానికి వెళ్ళి అక్కడ వీర్రాజు చేత – అన్ని వ్యవహారాల్లోనూ రాజా బాబుకు చేదోడువాదోడుగా ఉంటూ సహకరిస్తానని, తన జీవితం అతడి సేవకే అంకితమనీ ఒట్టు వేయించాడు.

"చిన్నప్పుడు నువ్వేసిన ఒట్టు నా కోసం. ఇప్పుడు నువ్వేసిన ఒట్టు – మా అబ్బాయి కోసం.. గుర్తుంచుకో!" అన్నాడు ముకుందరావు చివర్లో.

"కాళీమాతా – ఇదే నీ సంకల్పమా? ఒట్టుతో నాబోటి అమాయకులను అసహాయులను చేయడానికేనా ఈ ఊళ్ళో నీవు వెలసింది!" అనుకున్నాడు వీర్రాజు మనసులో బాధగా.

"నమ్మకస్థుడైన మనిషి దొరికాడు. నీ వ్యవహారాల్లో నీకిక ఎదురు లేదు –" అంటూ రాజాబాబును అభినందించాడు ముకుందరావు – ఇంటికెళ్ళిక!

## 3

ఒక్క నెలరోజుల్లోనే రాజాబాబు వ్యవహారాలన్నీ పూర్తిగా తెలుసుకున్న వీర్రాజుకు మతిపోయి నట్లయింది రాజాబాబు దారుణాలు అతడి ఊహలకు మించిపోయాయి

రాజాబాబు చేతిలో హత్యలు చేసే గూండాలున్నారు. దేశానికి ప్రమాదం కలిగించే రహస్యాలున్నాయి. అతడు సరఫరా చేస్తున్న మత్తు పదార్థాలు యువతరాన్ని నిర్వీర్యం చేస్తున్నాయి అతడు సంపాదించి విదేశాలకు చేరవేస్తున్న రహస్యాలు – దేశానికి ప్రమాదం. ఎందరో అమాయక యువతులు అతడి కారణంగా వ్యభిచార గృహాలకు నడిపించబడుతున్నారు.

రాజాబాబు తలచుకుంటే పట్టపగలు బ్యాంకులో దోపిడీ జరుగుతుంది నడివీధిలో హత్య జరుగుతుంది. మతకల్లోలాలు రేగుతాయి. రాజకీయ నాయకుల స్థితిగతులు మారతాయి.

ఇన్ని చేయగల రాజాబాబుకు తన సహకార

# ఒట్టు

మెందుకు కావాలో కూడా వీర్రాజు కర్థమైంది.

అతడు చేస్తున్న పనులన్నీ ప్రమాదకరమైనవి. ఏదో ఒక రోజున ప్రమాదం రాజాబాబు మీదకు మళ్ళవచ్చు. అలాంటప్పుడు తప్పించుకునేందుకు – బలి పశువు కావాలి. ఆ బలి పశువు వీర్రాజు!

వ్యవహారాలన్నీ వీర్రాజు పేరు మీద జరుగుతూంటే రాజాబాబు తెరవెనుక ఉంటాడు .

ఇంత వరకూ అలాంటి బలి పశువు లిద్దరయ్యారు. ఇద్దరూ పోలీసులకు దొరికాక – మొత్తం రహస్యాలన్నీ బైట పెట్టే స్థితికి వచ్చారు. అప్పుడు వాళ్ళు పోలీసు కస్టడీలో ఉండగానే మరణించారు.

రాజాబాబుకు పోలీసు కస్టడీలో ఉండగా తన పేరు బైట పెట్టని నమ్మకమైన బలి పశువు కావాలి. అందుకు వీర్రాజును మించిన వారెవరు?

అయితే రాజాబాబు వీర్రాజుకు బలి పశువవడానికి అంగీకరించాడు. తన మనిషిగా పట్టుబడిన వీర్రాజు తన గురించి ఏమీ చెప్పకపోతే – బయట్నించి విశ్వప్రయత్నం చేసి అతణ్ణి తను రక్షించుకోగలనని రాజాబాబంటాడు తనకున్న క్లీన్ ఇమేజ్ వీర్రాజును రక్షించడానికి మరింతగా సహకరిస్తుందంటాడతడు.

"ఈ దేశంలోనే కాదు – ప్రపంచమంతా జరుగుతున్నదిదే' తన చుట్టూ ఉన్న పది మొక్కలను చంపి తను మహావృక్షమవుతుందో మొక్క. మనిషి గొప్ప వాడిగా రాణించాలంటే తప్పులు చేయక తప్పదు అయితే స్వయంగా తప్పులు చేయకుండా తన గొప్పతనాని కవసరమైన తప్పులు ఇతరుల చేత చేయించగలిగే వాడే అసలైన గొప్పవాడు. అందుకని గొప్పవాడి చుట్టూ తప్పులు చేసే వాళ్ళుంటారు. వాళ్ళు తప్పులు చేసి గొప్పవాడి గొప్పతనం పెంచుతారు తన గొప్పతనంతో వాళ్ళ తప్పులు కాస్తాడు గొప్పవాడు..." అని క్షణం ఆగి – "ఇందువల్ల నాకే తప్ప నీకే ప్రయోజనమూ లేదనుకుంటే అది పొరపాటు. నువ్వు పూరిగుడిసెలో పుట్టావు. అసలైన సుఖాల్లో ఒక్కటీ అనుభవంలోకి రాలేదు నీకు. ఇప్పుడు నువ్వు నా గొప్పతనాన్ని పెంచే తప్పులు చేయడం వల్ల నాకులా గొప్ప వాడివి కాకపోవచ్చు. కానీ నా అంత వైభవంగానూ జీవించగలవు. అందులోని మజా అనుభవంతోనే తెలుస్తుంది –" అన్నాడు రాజాబాబు.

ఆ మజా ఏమిటో వీర్రాజుకు తెలుసు.

వంగి సలాములు చేసే అనుచరులు, ఆనందాన్నందించే అందాల అతివలు, విదేశీ మద్యాలు, హంసతూలికా తల్పాలు.......

మజా గొప్పదే కావచ్చు. కానీ ఈ మజా నాశ్రయించుకున్న వాడెవడూ తృప్తిగా జీవించలేదు.

ఒక పురుషుడు- ఒక స్త్రీ ... కలసి కుటుంబంగా ఏర్పడి స్వయం కృషితో జీవితానికి బాట వేసు. కొనడంలో ఉన్న తృప్తి – ఆ తృప్తి యిచ్చే మజా – అవే ఈ ప్రపంచంలో గొప్పవి వీర్రాజు కా విషయం తెలియక పోవచ్చు – కానీ అతడలాంటి జీవితం కోసమే కలలు కంటున్నాడు. ఆ కలలకు కేంద్రం అతడి మేనమామ కూతురు గంగ

గంగ వీర్రాజుకు ఆరో ప్రాణం తను రాజాబాబుకు అనుచరుడైతే తనకు భార్యగా గంగ సుఖపడదని అతడికి తెలుసు. అలాగని అతడామెను వదులుకోలేడు

తను కాళీమాత ముందు ఒట్టేశాడు. ఆ ఒట్టు తప్పేడంటే అతడి కుటుంబం సర్వ నాశనమవుతుంది అందువల్ల రాజాబాబు కతడనుచరుడు కాక తప్పదు.

ఈ విషయం గంగకు చెప్పాలి ఇటువంటి జీవితం గంగ భరించలేదని తెలియజెప్పాలి ఆమె లేనిదే తను బ్రతక లేడనీ – అయినా కాళీమాతను అగౌరవ పర్చలేడనీ – గంగ మనసు కరిగేలా చెప్పాలి. అప్పుడు గంగకు వీర్రాజంటే జాలి పుడుతుంది. కష్టమైనా, సుఖమైనా నీతోనే అంటుంది

ఆ తర్వాత జీవితంలో మళ్ళీ ఎన్నడూ తనను తప్పుపట్టే అవకాశముండదామెకు

## 4

నదిలో కెరటాలు ఉవ్వెత్తున లేచి పడుతున్నాయి ఆ జంట ఏం మాట్లాడుకుంటోందో వినాలన్న ఉత్సుకత వాటిలో కనబడుతోంది

వీర్రాజు గంగకు తన భావి జీవితం గురించి వర్ణించి చెప్పాడు. తను నిరసిస్తున్నట్లు మాట్లాడుతూనే ఆమె నాకర్షించే విధంగా చెప్పాడు. గంగ అంతా విని –"చాలా గొప్ప జీవితం –" అంది.

"ఈ గొప్ప జీవితంలో మనం విడివిడిగా సుఖపడగలం. కలిసి సుఖపడలేము –" అన్నాడు వీర్రాజు.

'నిజం చెప్పావు. సుఖపడడం కోసం మనం విడివిడిగానే ఉందాము –' అంది గంగ.

గంగ చాలా ఇష్టంగా ఈ మాటలన్నదని గ్రహించిన వీర్రాజు తెల్లబోయి – "కానీ గంగా! నువ్వు లేనిదే నేను బ్రతకలేను" – అన్నాడు.



"ఇలా వస్తేగానీ పథ్యం తిననని మీ గాడ్ ఫాదర్‌గారు పట్టుబట్టారు."

"మంచిదే ... హాస్పిటల్‌కు వెళ్తుంటే నేను కూడా వస్తాను పద" అన్నారు ...

లక్ష్మి వెళ్లగానే,

"అంకుల్... మీరు కోరినట్టుగానే నేను ముస్తాబయి వచ్చాను ... మరి యీ రోజు నేను పెట్టిందంతా మీరు తినెయ్యాలి .. " అంటూ దగ్గర కూర్చుని ముద్దలు కలిపి ఆయనచేత తినిపించింది లక్ష్మి ...

భోజనం అయ్యాక శ్యామసుందర్‌గారిని పిలిచి,

"ఇదో శ్యామ్‌సుందర్ ... నువ్విక్కడికి వచ్చింది డాక్టర్లందరి చుట్టూ తిరగడానికా ... నా దగ్గర ఉండడానికా ... అమ్మాయినిలా వదిలేసి నువ్వు తిరగడం నాకు నచ్చులేదోయి" అన్నారు.

"అయితే ఏం చెయ్యమంటారో చెప్పండి ...."

"అమ్మాయిని తీసుకొని యివ్వాళ వూరు చూసిరా..."

లక్ష్మి అభ్యంతరం చెప్పబోతే, "యిదిగో అమ్మాయి ... నే మొండివాడిని ... నేను చెప్పినట్టు వినకపోతే నాకు కోపం వస్తుంది. చక్కగా తిరిగేసి మళ్లీ సాయంత్రం ఆరుకల్లా యిక్కడ వుండండి యిద్దరూ ... అన్నట్టు రోడ్లు రష్‌గా వుంటయి. నువ్వు డాక్టరు, అమ్మాయి నర్సు అని వదిలేసి దూరంగా నడవకు శ్యామసుందర్... అమ్మాయి చెయ్యి పట్టుకుని క్రాస్ చేయించు . తెలిసిందా ...

ఆఁ ... అమ్మాయి యింకోమాట ... జీవితమంతా మందులు డాక్టర్లతోనే సరిపోతోంది ... నువ్వయినా ఆ యూనిఫాం లేకుండా కళ్లకు కన్పడు

సాయంత్రం వేరే చీర కట్టుకురా ... అలా అయితేనే అన్నం తినడం ... అనక నీ యిష్టం ...

ఆఁ .. యిక వెళ్లండి ... సాయంత్రం మళ్లీ వస్తావుగా .. ' అన్నారు ...

ఆ వూళ్లో చర్చిలు ఎక్కువ. అయితే ఆ క్రైస్తవ దేవాలయాలు చాలా సింపుల్‌గా వుండవు ... కొన్ని కొన్నిటిలో బైబిలులోని వివిధ ఘట్టాలూ శిలారూపాల్లో పెయింటింగ్ రూపాల్లో చర్చిలోపల అంతా వుంటయి ...

కేరళ చాలా అందమయిన ప్రదేశం ... ఎక్కడ చూసినా కొబ్బరిచెట్లు, పచ్చటి తోటలు, వువ్వుకయ్యలు అక్కడి స్త్రీలకు వొత్తైన వొంకుల జుట్టు ... నల్లగా తుమ్మెదల బారుల్లా వుంటుంది ..

"ఇక్కడి ఆడవాళ్లు రోజుకు అయిదుసార్లు స్నానం చేస్తారని చెప్పారు ఎవరో ... అందులో సౌందర్యస్నానం ..."

"ఆ సౌందర్య స్నానం సంగతేదో కనుక్కోరాదూ నువ్వు".

"అంటే నేనిప్పుడు అందంగా లేనా?' చిన్నపిల్లలా మూతి బిగించుకుని అన్నది లక్ష్మి ...

"అహ .. లేవనికాదు ... మరింత అందంగా మతులు పోగొట్టేలా ...." అని, 'అహ .. వద్దులే ... యిప్పటికే మతులు పోగొట్టుకుని నీ చుట్టూ



# ఒకటి ఒకటి మూడు

తిరుగుతున్నవాళ్ళు చాలామంది వున్నారు ఇంకా అందంగా వుంటే వాళ్ళతో పిచ్చోళ్ళయి వరుగెత్తే ప్రమాదముంది"

లక్ష్మికి కోపం వచ్చింది .. ఆయన మూర్తి విషయం అంటున్నారని అనుమానం ... మూతి బిగించుకుని సీరియస్‌గా కూర్చుంది

డాక్టరుగారు నవ్వారు.

"నువ్వు పెళ్ళిచేసుకోకుండా వుండడం మంచిదయింది. లేకపోతే నీ ఎంప్లాయర్ మీదనే యింతలా అలుగుతున్నావ్ పెళ్ళయితే మొగుడిమీద ఎంత అలిగేదానివో ." అన్నారు

"అందుకేగా. అలాంటివేవీ లేకుండా వున్నాను" అన్నది.

కొచ్చిన్‌లో రోడ్లు చాలా ఇరుకుగా వుంటాయి కొన్ని చోట్ల దాంతో బాగా రష్ ఎక్కువ డాక్టరుగారు ఒక చోట కారాపి, షాపింగ్‌కెళ్ళొద్దాం రా అంటూ దిగారు . .

రోడ్డు క్రాస్ చెయ్యబోతున్న లక్ష్మి భుజంమీద చెయ్యివడడంతో వులిక్కిపడి తిరిగిచూసింది ... డాక్టరుగారు కళ్ళల్లోకి చూసి నవ్వారు

లక్ష్మి శరీరం ఒక్కసారి పులకరించినట్టయింది.

'నేను క్రాస్ చెయ్యగలను . ఫర్వాలేదు." అంటూ చెయ్యి తీసెయ్యబోతుంటే, "రామనాథన్‌గారు చెప్పింది మర్చిపోయావా . అనక ఆయన నన్ను నిలేస్తారు" అంటూ మరింత దగ్గరగా వచ్చారు

కేరళలో ఆడవాళ్ళు చాలామంది మామూలు చీరలు కట్టినా యింకా కొంతమంది కోరారంగుమీద బార్డరుతో పరికిణీ వోణీలా వుండే విధంగా డ్రెస్ చేసుకుంటారు ఎవరో వెనకటివాళ్ళు పెద్దవాళ్ళు తప్ప రవిక లేకుండా వుండే స్త్రీలు తక్కువ

ఆ చీర తీసుకుంటావా నీకు బాగుంటుంది" అన్నారు .

'నాకెందుకు ఆయన పట్టుబట్టారని కట్టుకున్నానుగాని డాక్టరమ్మగారి దగ్గరకు వెడితే నా తెల్ల చీరలే కదా నాకు "

పోనీ కేరళ వచ్చినందుకు గుర్తుగా ఒకటి తీసుకో అంటూ కోరా రంగుమీద ముదురు కుంకుమరంగు బార్డరున్న చీర వొకటి తీసి పాక్ చేయించారు డాక్టరుగారు

లక్ష్మి డబ్బులివ్వబోతుంటే

వద్దు . . నేనిస్తాను వుంచు అన్నారు చెయ్యి పట్టుకుని

అహఁ వద్దు నా దగ్గర వున్నాయి నా దగ్గర వున్నాయి

వుంటే వుండవచ్చు కానీ ఎక్కడికి వెళ్ళొచ్చినా నా దగ్గర పనిచేసే వాళ్ళందరకూ ఏదో ఒకటి గుర్తుగా కొనుక్కొస్తాను నేను

లక్ష్మి ఏదో చెప్పబోతున్నంతలో ఆయన అడ్డం వచ్చి,




"లక్ష్మి ... డోంట్ టెస్ట్ మి బియాండ్ మై పేషెన్సు" అన్నారు గంభీరంగా ..

అంతే! లక్ష్మికి యిక మాట్లాడే సాహసం లేకపోయింది ఆ తరువాత డాక్టరమ్మగారికంటూ ఫోల్డింగ్ టైపు గొడుగు తీసుకున్నది అప్పైన ఒక బొమ్మల షాపులో లక్ష్మి టింకూబొమ్మ కొంటుంటే ప్రశ్నార్థకంగా చూశారు శ్యామసుందర్-గారు .

"మా నర్సింగ్‌హోమ్‌లో ఒక్కోసారి డెలివరీ కాగానే బిడ్డనొదిలేసి, రాత్రికి రాత్రే మాయమవుతుంటారు కొంద రు . బిడ్డను పోషించుకోలేక కావచ్చు లేదా యిల్లీగల్ అయినా కావచ్చు ...

అలాంటి పిల్లలను డ్యూటీలో వున్న నర్సులు పాలు పట్టి ఆడించి పెద్ద చేస్తాం . మీరు చూడలేదు కానీ అలాంటి పాప ఒకటి వుంది సుధా నర్సింగ్‌హోమ్‌లో . ఆ పాప పేరు మణి .. ఆ పాపకు '

ఆయన నవ్వేసి వూరుకున్నారు

మర్నాడు బాక్ వాటర్స్‌లో ప్రయాణం .. సూచర్స్ ఏప్పాక వెళ్దాం అంటే ఒప్పుకోలేదు రామనాథంగారు బాక్ వాటర్స్‌లో మోటారు బోటులో ప్రయాణం . అందమయిన దీవులను దాటుకుంటూ పడవ సాగిపోతుంటే రమణీయ-మయిన ప్రకృతి దృశ్యాలు కన్నులపండుగ చేస్తుంటే లక్ష్మి తననుతాను మర్చిపోయింది

అలా పరవశంతో చూస్తున్న లక్ష్మి తన నడుం చుట్టూ చెయ్యి పడడంతో వులిక్కిపడి చూసింది

పక్కనే నవ్వుతూ నిలబడి వున్నారు శ్యామసుందర్‌గారు

'ఏం లేదు అంచున నిలబడి అంత పరవశత్వంతో చూస్తుంటే పడిపోతావేమోనని భయంవేసింది "

అప్పుడు కాదు పరవశత్వం యిప్పుడు కలుగుతోంది అనిపించింది లక్ష్మికి ... మరింత దగ్గరగా జరగాలన్న కోరికను బలవంతంగా నిగ్రహించుకున్నది లక్ష్మి తనలోని యీ మార్పు ఆయన కంటబడకుండా తంటాలుపడడం గమనించి మౌనంగా చెయ్యి వదిలేశారు శ్యామసుందర్‌గారు .

ఆ ప్రాంతాన్ని మన్నారు అంటారు సెంట్ ఫ్రాన్సిస్ గ్జేవియర్ చర్చి, యూదులసినగాగ్ (ప్రార్థనాలయం) ఆ వైపు విదేశీయులు తొలిసారిగా భారత భూభాగం మీద అడుగుపెట్టినప్పటి కట్టడాలు నైలాన్ నెట్స్‌తో ఫిషింగ్ యిండస్ట్రీ అన్నీ చూసుకొని తిరిగి వచ్చేసరికి చీకటిపడింది

క్యారియరు తీసుకొని, హాస్పిటల్‌కు వస్తారా? అని అడిగినప్పుడు, అలసటగా వుంది నువ్వెళ్ళిరా అన్నారు కిటికీలో నుండి బయటకు చూస్తూ కనీసం తిరిగికూడా చూడకుండా

మధ్యాహ్నం నుండి ఆయన మూడ్ బాగాలేదని గ్రహించింది లక్ష్మి ఆ బోటులో తన నడుం చుట్టూ వున్న ఆయన చేతిని తను విడిపించుకున్నప్పటి నుండీ ఆయనలా గంభీరంగానే వున్నారు

ఒక్కదానివే వచ్చావు శ్యామసుందర్ ఏడీ? రామనాథంగారు అడగనే అడిగారు

బాక్ వాటర్స్‌లో అంతా తిరిగొచ్చాం కదండి . అలసటగా వుందని నన్ను వెళ్ళమన్నారు

ఆయన భోజనం చేస్తూ అన్నారు

'పాపం శ్యామసుందర్ యింత కష్టపడతాడు యింతమందికి సాయం చేస్తాడు అతడి జీవితంలో సుఖంలేకుండా పోయిందమ్మా అసలే అతడి మనసు సున్నితం యిద్దరు భార్యలూ అతడి మనస్సుకు శాంతిలేకుండా చేసి వెళ్ళారు

లక్ష్మి ఛివాలున తలెత్తి చూసింది

'ఏమిటంత అదిరిపడి చూశావ్?"

"ఏంలేదు ఆయన రెండో పెళ్ళి చేసుకున్న విషయం చాలామందికి తెలియదుట ."

"శ్యామసుందర్ నా దగ్గర ఏమీ దాచడమ్మా చెప్పానుగా అతడు నా బిడ్డలాంటివాడని వాళ్ళ నాన్న నేను బాగా స్నేహంగా వుండేవాళ్ళం అప్పుడే నాకు అక్కడ బిజినెస్ వుండేది ఆయన పోయ్యాక పాపం కష్టపడి పైకొచ్చాడు ." అని చెబుతూ—

"అవునూ ... నువ్వు పనిచేసే డాక్టరమ్మ శ్యామసుందర్ ఫ్రెండ్ అన్నావుగా వాళ్ళిద్దరిదీ ఎలాంటి పరిచయం?"

పచ్చి వెలక్కాయ గొంతులో పడ్డట్టయింది లక్ష్మికి . .

'నాకు తెలియదండి" అన్నది ...

'ఆమెను చేసుకుంటాడంటావా పెళ్ళి?"

లక్ష్మి తనకు తెలియదన్నట్టు మళ్ళీ తలూపింది.

"చేసుకున్నా సుఖం ఏముంటుంది? . ఆమెకక్కడ నర్సింగ్‌హోమ్ వుందంటివి ... అది వదలిపెట్టి ఆమె రాదు .. యిది వదలిపెట్టి ఇతడు పోడు.

అయినా – అమ్మాయ్ ఆవిడ వయసెంత వుంటుంది యితడి క్లాస్‌మేట్ అంటే అంతే వయసుండదూ ... యీ వయసులో పెళ్ళిచేసుకున్నా పిల్లలు పుడ్తారా . అతడికి చిన్నప్పటినుండి పిల్లలంటే ప్రాణం ... మా అమ్మాయిని ... భుజంమీద వేసుకొని ఎత్తుకుని తిరుగుతుండేవాడు ... సొంత చెల్లిల్లా చూసుకున్నాడు ఆ పిల్లను ... ఆ పిల్ల పోయినప్పుడు నాకంటే ఎక్కువగా బాధపడ్డాడు .. ఏమిటో ... కొందరి జీవితాలు కొవ్వొత్తుల్లాంటివి ... వాళ్ళు యితరులకు వెలుగూ వెలుతురూ యిస్తారు .. వాళ్ళకు మిగిలేది ఏమీ వుండదు ..."

లక్ష్మికి చాలా యిరకాటంగా వుంది. యీయన యీ సంభాషణ ఆపేస్తే బాగుండునని వుంది

"మీరు కబుర్లలో పడి భోజనం చేయటంలేదు అంకుల్" అన్నది మందలింపుగా

"తింటున్నానమ్మా ఎందుకు తిననూ ... మనిషికోసం మనిషి చెయ్యగలిగిందేమీ లేదుగా .. ఎప్పటికోప్పటికి అతడికి జీవితంలో సుఖం శాంతి ప్రసాదించమని భగవంతుణ్ని ప్రార్థించడం తప్ప ఏం చెయ్యగలం .. ఒకళ్ల రాతలు ఒకళ్ళు మార్చలేరుగా ..." అన్నారు కంచంలో చెయ్యి కడిగేస్తూ

మర్నాడు పొద్దున శ్యామసుందర్‌గారూ, లక్ష్మి వచ్చినప్పుడు–

"యివ్వాళ కోవళం బీచ్‌కి వెళతారా?" అని అడిగితే–

"ఇప్పుడుకాదు .. యివ్వాళ రేపు డాక్టర్స్ కాన్ఫరెన్స్‌లు వున్నాయి ఎలాగో వచ్చానుగా అటెండ్ అవుదామనుకుంటున్నాను" అన్నారు.

ఆ రోజు, ఆ మర్నాడు కూడా ఆ మీటింగులూ దానికి ప్రిపరేషనుతో సరిపోయింది ఆయనకు. పొద్దునపూట వచ్చి రామనాథంగారిని పరీక్ష చేసుకొని వెళ్ళిపోతే రాత్రి పదిదాటాకే రావడం . .

లక్ష్మి ఈ రెండు రోజులూ యించుమించు రోజంతా రామనాథంగారి దగ్గరే గడిపింది

మూడో రోజు ఉదయం లక్ష్మి హాస్పిటల్‌కు బయలుదేరబోతుండగా గదిలోకి వచ్చారు శ్యామసుందర్ .

అప్పుడే చీర మార్చుకోబోతోంది లక్ష్మి

"ఇవ్వాళ మంచి చీర ఏదన్నా కట్టుకో నా స్నేహితుడు ఇంటికి భోజనానికి పిల్చాడు' అన్నారు.

లక్ష్మి నవ్వింది . "మిమ్మల్ని భోజనానికి పిలిస్తే మీరు వెళ్ళండి నేనెందుకు?" అన్నది

"ఇన్విటేషన్ యిన్‌క్లూడ్స్ యూ ఆల్సో "

"భార్య అయితే – ఆహ్వానం ఆవిడక్కూడా వుంటుంది కానీ .. నర్సుకుండదు'

డాక్టరుగారు ఒకసారి సీరియస్‌గా చూశారు

"అఫ్‌కోర్స్ . చుట్టాలు భోజనానికి పిలిస్తే ఆహ్వానం భార్యక్కూడా ఉంటుంది అదే డాక్టర్ ఫ్రెండ్స్ ప్రొఫెషన్ అభిమానంతో పిలిస్తే ఆ ఆహ్వానంలో నర్సు కూడా యిన్‌క్లూడ్ అయివుంటుంది." అంటూనే బీరువాలో మంచి చీర ఒకటి తనే సెలెక్ట్ చేసి యిచ్చి,

"ఇది కట్టుకో . యింకో మాట . నా ప్రొఫేషన్‌లో యింతదాకా నా దగ్గర పనిచేసినవాళ్ళు ఎదురు తిరిగితే ఎప్పుడూ సహించలేదు. యికముందు సహించను కూడా" కటువుగా అనేసి బయటకు వెళ్ళిపోయ్యారు.

నిజంగానే లక్ష్మి ఎదిరించడానికి సాహసించలేకపోయింది.

మర్నాడు ఉదయం రామనాథంగార్ని యింటికి తీసుకొచ్చారు. ఆయనకు సూచర్స్ విప్పేటప్పుడు శ్యామసుందర్‌గారూ, లక్ష్మి యిద్దరూ దగ్గర వున్నారు ...

ఆ రోజు రాత్రికూడా యింకెవరో డిన్నర్ యిస్తున్నారని లక్ష్మిని పిల్చుకు-వెళ్లారు శ్యామసుందర్‌గారు ..

మర్నాడు కోవళం బీచ్‌కి బయల్దేరుదామని అనుకుంటే రామనాథంగారు అన్నారు–

"బీచికి ఎప్పుడయినా వెళ్ళచ్చు ... కానీ యింత దూరం వచ్చి త్రివేండ్రం, కన్యాకుమారి చూడకుండా వెళ్తారా ... రేప్పొద్దున్నే బయలుదేరండి ... త్రివేండ్రం చూసుకోండి . రేపు రాత్రి పూర్ణిమ . ఎట్టి పరిస్థితుల్లోనూ కన్యాకుమారిని మిస్ అవకూడదు".

ఆయన సలహా ప్రకారమే త్రివేండ్రం వెళ్లారు.

అక్కడ అనంత పద్మనాభస్వామి ఆలయంలో ఎవ్వరూ షర్టుతో వెళ్ళకూడదు డాక్టరుగారు షర్టు తీసేసి, పట్టుకోబోతుంటే–

"ఇటివ్వండి ... పట్టుకుంటాను" అన్నది విశాలమయిన ఆ వక్షస్థలం వైపు ఒకసారి చూచి తలదించుకుంటూ ..

"యిది నర్సులు చేసే పని కాదేమో . " చిన్నగా నవ్వుతూ అన్నారు ...

ఫర్వాలేదు ..." అంటూనే చేతిలోది తీసుకున్నది . .

ఆ రోజు లక్ష్మి తలంటి పోసుకున్నది. రామనాథంగారి అమ్మాయి పట్టు చీర ఆయన బలవంతంమీద కట్టుకున్నది. ముంగురులు ఎగిరి మొఖం మీదంతా పడుతుంటే, పట్టుచీర పమిట జారి జారిపోతుంటే డాక్టర్‌గారు నవ్వుతూ




అన్నారు.

"గుడికి వచ్చేటప్పుడు యిలా అలంకరించుకోకూడదు".

'ఏం?"

"ఏం ఏమిటి? వచ్చిన భక్తులకు దేముడి విగ్రహంమీద దృష్టి నిలవదు. క్యూలో దేవీస్వరూపాల్లా వున్నవాళ్ల మీదనే వుంటుంది కాన్‌సన్‌ట్రేషన్ అంతా".

"నిజమైన భక్తుల ధ్యాస ఎప్పుడూ చెదిరిపోదు "

"అదే ఏ భక్తులు . దేవీ భక్తులా .. దేముడి భక్తులకా చెదిరిపోనిది?" నవ్వుతూ అన్నారాయన

అక్కడ అనంత పద్మనాభుని దర్శనం చేసుకొని మహారాజాగారి పాలెస్‌లో అద్భుతమయిన ఆర్ట్ గాలరీని చూసుకున్నారు .. ఆ తరువాత భోజనం చేసుకుని కన్యాకుమారికి బయలుదేరారు

దోవలో ఆపి, "యిది శుచీంద్రం ... దిగి చూస్తావా?" అన్నారు ...

"శుచీంద్రం అంటే?"

"అత్రిమహర్షి అనసూయాదేవి పేర్లు విన్నావుగా ... ఒకప్పుడు జ్ఞానారణ్యమని వాళ్ల ఆశ్రమం యిక్కడే వుండేదిట .. కథ తెలుసుగా .. త్రిమూర్తులు పరీక్షచేయడానికి రావడం, అనసూయాదేవి పసిపాపల్ను చెయ్యడం ... వాళ్ల భార్యలు వచ్చి ప్రాధేయపడడం . ఆ తర్వాత త్రిమూర్తులు అత్రి మహర్షి దంపతులకు సాక్షాత్కరించిన ప్రదేశం యిదేనంటారు ..

# ఒకటి ఒకటి మూడు

అహల్యతో సంగమించిన తర్వాత ఆ పాపం పోగొట్టుకోడానికి యింద్రుడు యిక్కడికి వచ్చి యీ త్రిమూర్తులను అర్చించాడట... అందుకే దీనికి శుచీంద్రమని పేరు... యిప్పటికీ రాత్రిళ్ళు యింద్రుడు వచ్చి యీ గుడిలో అర్చన చేస్తాడని కొంత మంది నమ్మకం....

గుడి తలుపులు తీసి వుండకపోయినా పెద్దది ఆంజనేయస్వామి విగ్రహం చూడచ్చు...

పైగా యీ గుడిలో స్థంభాలు మన హంపీలోనూ మధురలోనూ స్వరాలు పలుకుత య్యంటారు... అలా పలుకుతయి... యాత్రికులు ఎక్కువ కనుక వాటికంత శబ్దం లేకపోయినా శుచీంద్రంలో బాగా వినబడుతయి... చూసి వెళదాం రా..." అంటూ లోపలికి తీసుకు వెళ్ళారు...

ఆంజనేయుని విగ్రహం చాలా పెద్దది... అలాగే రాతి స్థంభాలు కూడా చిన్నకర్రపుల్ల, చివరికి పెన్నుతో కొట్టినా సరిగమలు విన్పిస్తయి...

లక్ష్మి చిన్నపిల్లలా ఆ స్థంభాలన్నిటి దగ్గరకూ పరుగెట్టి అన్నీ కొట్టి పరిశీలిస్తుంటే,

"రాతికయినా ఒక్కోసారి జాలి కలిగి కరిగి పాటలు పాడుతయి... రాతి గుండెల్లో మాత్రం చలనం వుండదు... యింక ఆ సంగీత సాధన చాలుగానీ వచ్చెయ్యి... మళ్ళీ కన్యాకుమారిలో సన్‌సెట్ మిస్ అవుతాం." అన్నారు.

లక్ష్మి మారు మాట్లాడకుండా వచ్చి కారులో కూర్చుంది. ఆయన కారు స్టార్టు చేశాక చిన్నగా నిట్టూర్చి,

"వెనుకటికి మన దేశంలో పతివ్రతలు వుండేవాళ్ళట... సీతలూ, సావిత్రులు, అనసూయలు... సింగిల్ మైండెడ్ డివోషన్‌తో భర్తను ప్రేమించే వాళ్ళూ, ఆరాధించే వాళ్ళు...

ఈ రోజుల్లో సీతను కట్టుకుని కష్టాలు పడే రాముళ్ళు తప్ప సీతలే కరువయ్యారు." అన్నారు.

వెంటనే ఏమీ అనలేదు లక్ష్మి. కొంచెం ఆగి అన్నది.. "రామాయణానికి నిర్వచనం వినాలంటే డాక్టరు గారి దగ్గరే వినాలని యివ్వాళే తెలిసింది నాకు...

రాముణ్ని కట్టుకుని సీత కష్టపడిందా... సీతను కట్టుకుని రాముడు కష్టపడ్డాడా?!" నవ్వుతూ అడిగింది ..




"సీతను కట్టుకుని రాముడే... జనకుడు పెట్టిన కండిషను ప్రకారంగా ఆ విల్లు విరిచి రాముడు సీతను ఒక విధంగా గెల్చుకున్నాడని చెప్పచ్చు... ఆ విల్లు విరిచిన రాముడిని సీత పెళ్ళి చేసుకోక తప్పదు.. చేసుకుంది. ఆ తర్వాత... రాముడు అరణ్యాలకు వెళ్ళేటప్పుడు సీతను అయోధ్యలో వుండి పొమ్మన్నాడు...

సీత రాముడి మాట విని అయోధ్యలోనే వుండిపోతే పాపం రాముడికి రావణాసురుడుతో యుద్ధం తప్పేది. ఆ తర్వాత ఎవరో ఏదో అన్నారని ఆవిడను అడవికి పంపడం, జీవితాంతం తను బ్రహ్మచర్యం చెయ్యడం... ఏమిటాయనకు ఆ కర్మ పాపం! ఆ సీత మూలంగా కాదూ... జీవితాంతం భార్య లేకుండా గడపడం అంటే ఎంత బాధ..."

"ఆ బాధేదో సీత కూడా పడిందిగా..."

"పడింది... కానీ అది సీత స్వయం కృతాపరాధం... రాముడు చేసింది కాదు... ఆనాటి సాంఘికాచారాల ప్రకారం నడుచుకున్నాడు రాముడు... అది తనకు దుఃఖం మిగిల్చినా..."

లక్ష్మియిక జవాబు చెప్పదల్చుకోలేదు... ఈయన మూడ్ ఒక్కో క్షణం ఒక్కో విధంగా వుంటోంది.... మౌనంగా వుండడమే వుచితంగా అనిపించింది...

కారు సూర్యుడితో పందెం వేసినట్లు పోనివ్వాల్సి వచ్చింది... వాళ్ళు కన్యాకుమారి చేరేసరికి సూర్యాస్తమయానికి యిక కొద్ది నిముషాలే వుంది...

సరాసరి వ్యూపాయింట్ దగ్గరికే వెళ్ళారు... ప్రతి రోజూ అక్కడ సూర్యాస్తమయ సూర్యోదయ సమయాలు వేస్తుంటారు. చూస్తే రెండు మూడు నిముషాలు మాత్రమే.

సముద్రంలో పొడుచు కొచ్చినట్లున్న రాళ్ళు ఎన్నో... ఒకదాని మీద కూర్చున్నారు... చంద్రోదయ సూర్యాస్తమయాలు రెండూ కనబడేట్లుగా కూర్చున్నారు...

అరుణకాంతులు పరుచుకుంటున్నాయి సముద్ర కెరటాలమీద. క్రమంగా సూర్యబింబం అరుణిమ కోల్పోతూ పెద్ద నిప్పుల బంతిలా సముద్రంలో కూరుకుపోతుంటే మరోవైపు చిగురించే ఆశలా వెన్నెలరేడు పూర్ణ వదనంతో అరుణరాగాన్ని సంతరించుకుని సముద్రగర్భంలో నుండి వెలికివస్తున్నాడు...

ఎన్నో కెమెరాలు క్లిక్‌మంటున్నవేళ డాక్టరుగారు అన్నారు... "ఇక్కడికి వస్తామని అనుకుంటే కెమెరాతెచ్చేవాడిని."అని

ఆ తరువాత దగ్గర్లోనే వున్న గాంధీస్మారక భవనాన్ని చూసుకుని రామకృష్ణ మఠం వాళ్ళ లాడ్జింగ్‌కు వెళ్ళారు...

భోజనం చేసి పడుకున్న లక్ష్మికి ఆలోచనలతో నిద్రపట్టట ంలేదు. కాస్త సర్దుకుని కునుకుపట్టే వేళకు తలుపుకొట్టిన చప్పుడైంది

"సూర్యోదయం చూట్టానికి రావా?" శ్యామసుందర్‌గారి ప్రశ్న...

"అప్పుడేనా?"

"అప్పుడే ఏమిటి!.. మనం సముద్రతీరందాకా నడవాలికదా... అప్పుడే చాలామంది లేచివెళ్ళిపోయారు కూడా...వాళ్ళిచ్చినటైముకు యింకా అరగంట కూడాలేదు."

లక్ష్మి మవునంగా ఆయన్ను అనుసరించింది.

ఇద్దరూ లాడ్జి వెనుకనుండి అడ్డదోవన సముద్రతీరం చేరుకున్నారు. అక్కడ జనం ఎక్కువమంది లేరు.

కన్యాకుమారిలో సూర్యోదయం చూసే ప్రాప్తం బహుకొద్దిమందికే వుంటుంది. దట్టంగాముసురుకున్న మబ్బులవెనుకనుండి సూర్యుడు వచ్చేసరికి బారెడు పొద్దెక్కింది.

"ఇంతదూరం పొద్దున్నే రానేవచ్చాం...సముద్రస్నానం చేద్దాంరా" అన్నారు. తను తెచ్చిన షోల్డర్‌బాగ్‌లో నుండి టవలు తీస్తూ...

"మీరు చెయ్యండి...నేను మీబట్టలకు కాపలా కూర్చుంటాను యిక్కడ.." అన్నది

బట్టలు విప్పేసి టవలు చుట్టుకుని నీళ్ళల్లోకి దిగుతూ మళ్ళీ పిలిచా రాయన...లక్ష్మి రానని తలూపింది... ఆ అమ్మాయి దృష్టిమాత్రం విశాలమైన ఆ వక్షస్థలంమీదనే వుంది... ఆలోచనలు ఎటో ఎటో పోతున్నాయి...మనసును ఎంత కట్టుదిట్టం చేసుకున్నా యీ బలహీనత ఏమిటో అర్థంకావటంలేదు ఆ అమ్మాయికి...

తలెత్తి చూస్తే వువ్వెత్తున లేచిపడే కడలి తరంగాలు... లక్ష్మికి భయంవేసింది. గబగబా తీరందగ్గరికెళ్ళి, "పెద్దపెద్ద అలలొస్తున్నాయి. వచ్చెయ్యండి ప్లీజ్...వచ్చెయ్యండి." ఒద్దున నిలబడి బిక్కమొగంతో అంటున్న లక్ష్మిని చూసి నవ్వుతూ వొడ్డుకొచ్చి,

"ఎందుకంత భయం! నేనున్నానుగా రా నువ్వుకూడాయింత దూరంవచ్చి సముద్రస్నానం చెయ్యకుండా ఏమిటి." అంటూ చప్పున చెయ్యిపట్టి నీళ్ళలోకి లాక్కుంటూ, "మొదటి మునక వేసేదాకనే చలిభయం... ఆ తరువాత ఏంవుండదు" అన్నారు...

లక్ష్మి ఎంతగింజుకున్నా లాభంలేకపోయింది. ఆయనచేతులు బలంగా తనను చుట్టేసి వున్నాయి. చనువుగా ఒక చేత్తో జడవిప్పి ఆ తరువాత పమిటికున్న పిన్ను తీసేసి నీళ్ళలోకి లాక్కుపోయారు.

"అల రాగానే ఒకసారి అలా అను లక్ష్మి .." అని చెబుతుండగానే ఒక పెద్ద అల వచ్చింది ... లక్ష్మి నీళ్ళల్లోకి పడిపోయింది. శ్యామసుందర్‌గారు ఛప్పున చెయ్యి పట్టి పైకి లేవనెత్తారు ..

లక్ష్మి పమిట చెదిరిపోయింది. భయంతో గుండెలు దడదడలాడుతున్నాయి అయన నవ్వుతూ లక్ష్మిని రెండు చేతుల్తో గుండెలకు హత్తుకుంటూ, "ఎందుకంతలా వణికిపోతున్నావ్ ... నేనుండగా నిన్ను సముద్రంలో కొట్టుకు పోనిస్తానా?" అంటూ నెమ్మదిగా గుండెలమీద నిమురుతున్న ఆయన చేతులకు ఏదో తగిలినట్లయింది. నవ్వుతున్న ఆయన ముఖం గంభీరంగా మారిపోయింది

చెయ్యి పట్టుకుని జాగ్రత్తగా మూడంటే మూడే మునకలు వేయించి వొడ్డుకు తీసుకొచ్చేశారు.

తను తెచ్చిన పొడి టవలుతో తలా వొళ్ళూ తుడుచుకుని,

"యిదో తల తుడుచుకో" అంటూ మీదికి విసిరేసి, "ఆ బట్టలు విప్పేసి అలా ఆ కంచెమీద ఆరేయి. నిముషంలో ఆరిపోతాయి. ." అన్నారు.

లక్ష్మి మాట్లాడలేదు. చలిలో వణికిపోతూ అలా ముడుచుకునే కూర్చుంది

"తడి బట్టలు వంటిన వుంటే నిమ్ము చేస్తుంది. ఆ టవలు క్రాసుగా కప్పుకుని చీరా జాకెట్ అవీ ఆరేయి ..." అని, "కనీసం ఆ జాకెట్ బ్రా అయినా విప్పి ఆరేయి.' అన్నారు విసుగ్గా...

లక్ష్మి అప్పటికీ లేవలేదు.

"ఏం జాకెట్టు విప్పితే మెళ్లో మంగళసూత్రం బయటపడుతుందని భయమా?"

లక్ష్మి అదిరిపడి తలెత్తి చూసింది ఆయన కళ్ళల్లోకి ...

"ఏం ఎలా తెలిసిందని ఆశ్చర్యపోతున్నావా ... నువ్వు ఎంత దాచాలనుకున్నా తడిబట్టలు దాచనివ్వవు ... నా వేళ్ళకు స్పర్శ జ్ఞానం పోలేదు" అంటూ "పెళ్లికాలేదని అబద్ధం చెప్పవలసిన అవసరం ఏమొచ్చింది నీకు ... పెళ్లి కాకుండా తమాషాకు వేసుకు తిరుగుతున్నావా? లేక మొగుడు పోయినా అట్టే పెట్టుకున్నావా ... లేక అతగాడ్ని వదిలేసి ఆ మంగళసూత్రాలు కూడా కనబడకుండా దాచుకుని తిరుగుతున్నావా?!" కళ్ళు నిప్పులు చెరుగుతుండగా అడిగారాయన ...

లక్ష్మి జవాబుగా తల మోకాళ్ళ మీద పెట్టుకుని ఏడుస్తోంది. నీళ్ళు కారుతున్న తల ... తడిసిన చీర, జాకెట్టు. పైన పడున్న టవలు ... మూర్తీభవించిన శోక దేవతలా వుంది.

ఒక్క నిముషం అలా చూసి తర్వాత ఆ పక్కనున్న పిల్ల ఎవరో తెలియదన్నంత నిర్లిప్తంగా అనంత జలరాశి వైపు, ఉదయించి, ప్రకాశవంతంగా మబ్బుల దోమ తెరను చీల్చుకుని బయటకు వస్తున్న బాల భాస్కరుణ్ని చూస్తూ నిలబడ్డారాయన ...

చాలాసేపయిన తర్వాత,

"యిహ యివ్వాళ లేచేదిలేదా ... కన్యాకుమారి అమ్మవార్ని ... వివేకానందా రాక్‌ను చూడవా" తీక్షణంగా అడిగారు ...

లక్ష్మి వెంటనే లేచి ఆ టవలుతో తల తుడుచుకుంది. చీర అంచులు నీళ్ళు పిండుకుని, "వెళదాం" అంది తల వంచుకుని ...

ఆయన ఏం మాట్లాడకుండా దోవతీశారు. మౌనంగా అనుసరించింది లక్ష్మి.

(ఇంకా ఉంది)







గుడి గంటలు మ్రోగుతున్నాయి. అర్చన జరుగు తున్నట్టుంది. ఇవాళ శేషాద్రి వెళ్ళాడు గుడికి.

టైము ఏడుగంటలయి నట్టుంది. రైలుకి మరొక్క గంటే టైముంది.

అద్దం ముందు నిలుచున్నాను. ఉంగరాలు తిరిగిన జుత్తు ముఖానికో ఎంత సొయగా న్నిస్తోంది. "లేత నీలిరంగు ప్యాంటు, సెల్ఫ్ డిజైను వున్న తెల్లని షర్టు. టక్ చేశాను!" టై కట్టుకుంటూ మరోసారి అద్దంలో చూసుకున్నాను! "నాకు నేనే ముద్దు వస్తున్నాను!"

చిన్న నవ్వు వెలిగింది పెదవుల మీద.

చేతితో జుట్టుని మరో సారి సర్దుకున్నాను. వంకులు తిరిగి మిలమిల మెరుస్తోంది.

"నేనూ అందగాణ్ణే!" అనుకున్నాను ఒక్కసారి. ఆక్షణంలో జీవితం రంగుల కలలా అనిపించ సాగింది.

"చంటీ ఏవిటిరా ఆముస్తాబు?" అంటూ నవ్వింది అప్పుడే అక్కడకు వచ్చిన అమ్మ.

"ఎప్పుడూ నేను చంటినేనా అమ్మా?" "చక్కగా పేరు పెట్టి పిలవరాదూ?" కినుక వహించాను అమ్మమీద.

# కలకరిగిపోయింది

## కె. రామారావు

అమ్మ నవ్వి అంది" చంటీ ఈ రోజు గుడికి వెళ్ళవా?" అని.

"వెళ్ళను!" "పట్నం పోతున్నాను!" అన్నాను.

"పట్నమా?" ప్రశ్నార్థకంగా చూసింది అమ్మ నావైపు.

"గాయిత్రిని చూడడానికి వెళుతున్నాను!" అన్నాను అమ్మవైపు తిరిగి.

అమ్మ ముఖంలో కోటి జోత్స్నల కాంతులు వెలుగొందాయి. కన్నులలో సన్నని తడి కూడా మెరిసింది. అది ఆనందవిషాదాల మేలి కలయిక. జీవితాన్ని కాచి వడపోసిన అనుభూతి అమ్మ ముఖంలో కనుపిస్తూ వుంటుంది నాకు!

ఆమెకు పుట్టినింటి మీద వున్న అభిమానం కూడా బహుదొడ్డది. "ఆవిషయం నాకు చాలా ఆశ్చర్యాన్ని కలిగిస్తూ వుంటుంది!"

"సాంబమూర్తి మామయ్యకు మాకు సంబంధ బాంధవ్యాలు తెగిపోయి చాలా రోజులయ్యింది!" దీనికి అనేక కారణాలున్నాయి.

"నేనప్పుడే గాయిత్రిని చూసి పదేళ్ళయ్యింది!" "గౌన్లలో చూశాను!.... ఇప్పుడెలా వుందో?"

"గాయిత్రి!" ఆ పేరు నామనస్సుకి చక్కిలిగింతలు పెడుతూ వుంటుంది.

"ఒరే చంటీ గాయిత్రిని నువ్వెలాగైనా పెళ్ళి చేసుకోవాలి!" "మామయ్య బందిఖానా నించి ఆమెను ఎలాగైనా తప్పించాలి!" "ఆమె జీవితం ఎడారిలో కోయిలలా అయిపోకూడదు!" "మావి చిగుర్లు తిన్న కోయిలలా మధురని స్వనాలను ఒలికించాలి!"

గాయిత్రి చిన్నప్పుడే భర్తను పోగొట్టుకుంది.

"అమ్మ ఉద్దేశ్యం సబబయినదే!" కాని.... కాని.... నేను..... మరి ఊహించ లేక పోయాను!

"అమ్మలాంటి వాళ్ళు ఎందరు వుంటారు లోకంలో ?"

అమ్మ శ్రీమంతుల ఆడబిడ్డ. "అన్నదమ్ముడికి ఇష్టం లేని పెళ్ళి చేసుకుని పుట్టినింటికి దూరమయ్యింది!"

"మామయ్యకి అమ్మ చచ్చినదానితో సమానమే!"

అమ్మని అలా దూరం చేసుకున్న మామయ్య గాయిత్రికి మళ్ళీ పెళ్ళి చేస్తాడా?" చిన్న ధర్మ సందేహం కదలాడింది నాలో.

"గాయిత్రిని ఆకర్షించాలి!" "ఎలా?" "జీవితంలో ఓడిపోయిన గాయిత్రి నన్ను తప్పకుండా అంగీకరిస్తుంది!" "అమ్మ నిరాశావాదాన్ని భరించదు!" "చంటీ నీకేం తక్కువరా?" "చదువుకున్నావు!" "అందంగా వుంటావు!" అని.

"ఒక్కసారి వేదాంతిలా నవ్వుకున్నాను!"

పాత పుస్తకాల షాపులో ఏదో పుస్తకం కొనుక్కొని బయలుదేరాను.

రైలు వేగాన్ని పుంజుకుంది. కొత్త పట్నం చేరుకునే సరికి సాయంత్రం అవుతుంది. అసలే ప్యాసింజరుబండి. నెమ్మదిగా పోతుంది.

పదేళ్ళ క్రితం ఎవరింట్లోనో పెళ్ళికి వస్తే చూసేను గాయిత్రిని. అప్పటికి ఆమెకి పన్నెండేళ్ళుంటాయి.

"ఒరే చంటీ మీ మామయ్య కూతురు గాయిత్రి!" అంటూ రహస్యంగా చూపించింది అమ్మ. అప్పటికే గాయిత్రీ వాళ్ళమ్మ వచ్చి బరబర లాక్కు పోయింది గాయిత్రిని.

అమ్మ సాంబమూర్తి మామయ్యని అర్థించడం నాకు బాగా గుర్తుంది!" అన్నయ్యా మన బంధుత్వం తుడుచుకుంటే పొయ్యేందుకు మసి బొట్టు కాదు! శీడి చుక్క!" గాయిత్రిని నా కొడుకు చంటికిచ్చి పెళ్ళి చెయ్యి!" అని.

సాంబమూర్తి మామయ్య గలగల నవ్వాడు! నా బిడ్డను దరిద్రం వరించడం నేను భరించలేను! అది



లక్షాధికార్ల కోడలు కావాలి!" అని.

ఏది ఎలా వున్నా కాలం ఆగదు.

ఇప్పటికీ కూడా అమ్మలో ఆశ చావలేదు. నాలో గాయిత్రి మీద అంతర్లీనంగా వున్న ప్రేమ తాలూకు బీజం నన్ను మామయ్య దగ్గరకి వెళ్లమని ప్రోద్బలం చేశాయి.

కంపార్టుమెంటు కిటికీ లోంచి ప్రకృతిని పరిశీలించ సాగేను. ఎన్నో వింత వింత దృశ్యాలు కదిలి పోతున్నాయి. ఇప్పటికి నా జీవితం ఓ గమ్యాన్ని చేరుకోలేదు!

"నేనీ ప్రయాణం ఎందుకు చేస్తున్నానో నాకే తెలియదు!" "ఇంతకీ గాయిత్రి నన్ను గుర్తిస్తుందా?" సాంబమూర్తి మామయ్య "నువ్వు ఎందుకు వచ్చావు?" అని నన్ను నిందిస్తే? నా ముందే అమ్మని తిడితే?"

చిన్నగా నవ్వుకున్నాను.

"అన్నిటికీ సిద్ధపడే బయలుదేరాను"!

"ఎలాగయినా గాయిత్రిని నాదాన్ని చేసుకోవాలి!" ఆ మధ్య ఎవరో అన్నారు. సాంబమూర్తి మామయ్య గాయిత్రిని గృహ నిర్బంధం చేశాడట! "ఆ పిల్ల ఇది మొదలు నిండు నూరేళ్ల జీవితాన్ని ఎలా గడుపుతుంది?" "పోనీ మళ్లీ పెళ్లి చెయ్యరాదూ?" ఇదే అమ్మ ఉద్దేశ్యం.

"ఇందుకు సాంబమూర్తి మామయ్య అంగీకరిస్తాడా?"

ఏదో స్టేషన్లో ఆగింది రైలు. దూరంగా ఏదో రోడ్డు కనుపిస్తోంది. అక్కడ బస్సు ఏదో యాక్సిడెంటు అయినట్టుంది జనం గుమి గూడి వున్నారు. ఆ బస్సు కూడా కొత్త పట్నం వైపే పోతుంది.

"భగవాన్!" అనుకున్నాను గుండె మీద చేతితో రాసుకుంటూ. నేను ముందు బస్సులో నే వెల్దామను కున్నాను.

బండి మళ్లీ కదిలింది పెద్ద కూతతో.

చేతిలో వున్న పాత పత్రికని తిరగేశాను. తక్కున నా చూపు ఒక చోట ఆగిపోయింది.

ఒక అభిమాన రచయితకి గాయిత్రి రాసిన ఉత్తరం అందులో వుంది. క్రింద అడ్రసు చూశాను. "గాయిత్రి. కొత్తపట్నం!" అని వుంది. "సందేహం లేదు. ఈమె నా గాయిత్రే!"

ఓ సారి ఆ పత్రికని ముద్దు పెట్టుకున్నాను. "గాయిత్రీ నీకు రచయితలంటే ఇష్టమా?" "ఇన్నాళ్ళూ నాకు ఈ సంగతి తెలియనే తెలియదే!" స్వగతంలా అనుకున్నాను.

నిరుద్యోగ పర్వంలో ఓలలాడుతున్న నేను ఇలాంటి సంగతులేవి పట్టించుకోలేదు. కథలు రాయాలన్న ఉద్దేశం నాకు కలగనందుకు నన్ను నేనే నిందించు కున్నాను. "ఈ కథలు రాసే వాళ్లందరూ పది సార్లు పుట్టారా?"

గాయిత్రి ఉత్తరాన్ని మరోసారి చదివాను. "రచయిత గారూ నేను మీ అభిమానిని". మీకు ఇంకా పెళ్లి కాకుండా వుంటే నన్ను పెళ్లి చేసుకోండి!" "సంఘసంస్కారాన్నీ, ఆదర్శాలనీ మీ రచనలలో గుప్పించే మీకు ఇదేమంత గొప్ప విషయం కాదు!"

"గాయిత్రి నాదైతే కథలు రాస్తాను!" "ఆమె సాహచర్యంలో నాకు ఇదో ఘన కార్యం కాదు!"

రైలు మళ్లీ ఏదో స్టేషన్‌లో ఆగింది.

ఇక్కడ నలభై నిముషాలు ఆగుతుందిట బస్సు! "అదే వూరో?" స్టేషన్‌లో వున్న బోర్డు చూశాను. "రాజానగరం" పెద్ద పెద్ద అక్షరాలలో వుంది పేరు.

పత్రికని ముఖానికి అడ్డు పెట్టుకున్నాను క్షణకాలం మళ్ళీ తీశాను స్టేషన్ ఎంతో బావుంది అంతటా నీడలు పరచుకుని నీలగిరిలావుంది

ఒక కాఫీ తెప్పించుకు తాగాను.

అలా బైటికి చూస్తూ కూచున్నాను కొంత మంది వ్యక్తులు కంపార్టు మెంట్లన్నీ వెతుకుతున్నారు ఎవరి కోసం?" అనుకున్నాను నాలో నేనే

నా ఊహలన్నీ గాయిత్రి చుట్టూ అల్లుకుంటు న్నాయి

"గాయిత్రి ఏస్వేచ్ఛా లేకుండా ఇంట్లోనే మగ్గిపోతున్నదా?" 'ఇంత చిన్నతనంలో నే ధైవం ఆమెకు ఎంత శిక్ష విధించాడు దేవుడు!"

గాఢమైన నిట్టూర్పు వెలువడింది నానుండి ఎలాగైనా మామయ్యతో పోట్లాడి గాయిత్రిని నా దాన్ని చేసుకోవాలి' "సంఘ సంస్కారాన్ని గురించి మామయ్యకి గట్టి ఉపన్యాసం ఇవ్వాలి' గాయిత్రి నన్ను మెచ్చుకోవాలి!"

"ఆనాడు నా తల్లిని దూరం చేశావుకాని ఈ నాడు నీ కూతుర్ని దూరం చేసుకోగలవా మామయ్యా? అని నిలదీసి అడగాలి సాంబమూర్తి మామయ్యని

అమ్మ చెప్తూ వుంటుంది, తనకి చిన్నప్పుడే పెళ్ళయ్యిందనీ, భర్త గతించాడనీ, అన్నా వదినలు నా నా సింసా పెట్టారనీ, సంస్కార హృదయుడయిన నాన్నను పెళ్ళి చేసుకుని దూరంగా వచ్చిందనీ, అప్పటి నించీ పుట్టి నింటితో సంబంధ బాంధవ్యాలు తెగి పోయాయని

అందుకే గాయిత్రి అంటే ఆమెకు అభిమానం గాయిత్రిని పెళ్ళి చేసుకుని మామయ్యకు బుద్ధి చెప్పాలి!" "దృఢ సంకల్పం నాలో చోటు చేసుకుంది!".

మరికొన్ని గంటలలో గాయిత్రిని చూడబోతున్నా నన్న ఆనందం నన్ను నిలువనియ్యడం లేదు

ఊహలలో తేలిపోతున్న నాకు "సార్ మీరు మీరు . బింద్ మాధవ్‌కదూ? అన్న పిలుపు వినిపించి ఉలిక్కి పడ్డాను!

'అవును!" అన్నాను ఆశ్చర్య పోతూ.

# కలకరిగి పోయింది

"అబ్బ మీకోసమే ఎదురు చూస్తున్నాం!" రైల్లో వస్తారో, బస్సులో వస్తారో, మీ సొంత కారులో వస్తారో?' అని తర్జన బర్జనలు జరుపు తున్నామనుకోండి !" మీరు ఇలా రావడం మీ నిరాడంబరత్వానికి చక్కని తార్కాణం' మీలాంటి పెద్ద రచయితలు మా ఆహ్వానాన్ని అందుకుని రావడం మాకు హర్షదాయకమైన విషయం!'

'రచయితా?" 'గతుక్కుమన్నాను'

ఏదో చెప్పాలనుకున్న నన్ను వారు మాట్లాడనియ్యలేదు

"పదండి సార్ ఏర్పాట్లూ అవీ ఘనంగా చేశాం' ఇవాళ మీరాకతో మాసాహితీ సదస్సు వెలిగి పోవాలి'

'రండర్రా రండి'" రచయితగారొచ్చేసారు' అంటూ తనతో వచ్చిన కొంత మందిని పిలిచాడా వ్యక్తి

అందరూ బిలబిలాడుతూ వచ్చారు

ఒక ప్రఖ్యాత రచయితను చూశామన్న ఆనందం వాళ్ళ ముఖాలలో కొట్టవచ్చినట్లు కనిపిస్తూంది

అనుకోని ఈ సంఘటనకి నా మనస్సు వింతగా స్పంది స్తూంది

"ఇప్పుడు నేను రచయితను కాను!" అని వీరికెలా చెప్పడం?' 'వారి ఆశాభంగాన్ని నేను చూడ గలనా? "ఒక వేళ అసలు రచయితగారు గాని వస్తే? "ఎలాజరుగుతే అలా జరగనీ అనే నిశ్చయానికి వచ్చాను' "నేను ఎలాగైనా గాయిత్రి దృష్టిలో గొప్ప రచయితగా గుర్తింపబడాలి!"

ఓసారి పత్రిక తెరిచి చూశాను బింద్ మాధవ్ గారికి అంటూ సంబోధించి గాయిత్రి రాసిన ఉత్తరం అందులో వుంది

'ఆమె ఎప్పుడైనా బింద్‌మాధవ్‌ని చూసిందా ఏమైనానా?' 'నేనే ఆ బింద్‌మాధవ్‌ని అని ఎందుకు చెప్పకూడదు? అని నిశ్చయించు కున్నాను!"

హుందాగా వాళ్ళ వెంట నడిచాను

"నా చేతిలోని పాత పత్రికలో నా అభిమాని ఉత్తరం అడ్రసు వున్నాయి ఎలాగూ ఇటు వచ్చాను కదా ఆమెను కూడా చూసి వెళ్తాను!" అన్నాను

నాకు అభిమానుల మీద వుండే అభిమానానికి వాళ్ళ ముఖాలు వెయ్యి కాండిల్ బల్బులా వెలిగాయి

"ఆ అభిమాని ఎవరో నిజంగా అదృష్ట వంతురాలు!" అన్నారు ఒకరిద్దరు స్పష్టాస్పష్టంగా

'మేము కూడా మీ అభిమానులమే,' మా గృహాల్ని కూడా పావనం చెయ్యండి' అన్నారు మరికొందరు

ఇప్పుడు అర్జంటు పనులున్నాయి!' "ఈసారి వస్తాను' అంటూ తప్పించు కున్నాను చిరునవ్వుతో

క్షణకాలం వాళ్ళ ముఖాలలో నీలినీడలు కదిలి అంతలోనే మాయమయ్యాయి

నాకు ఏర్పాటు చెయ్యబడిన గదిలోకి వెళ్ళి స్నానపానాద్యనుష్టానాలన్నీ ముగించుకుని, ట్రిమ్‌గా తయారయ్యాను!'

వాళ్ళు నన్ను సాదరంగా ఆహ్వానించి సాహితీ సదస్సు దగ్గరకి తీసుకెళ్ళారు

అందరూ హడావిడిగా తిరుగుతున్నారు అటూ ఇటూ ఒకరిద్దరు నా దగ్గరకి వచ్చి కరచాలనం చేశారు మరికొంత మంది ఆటోగ్రాఫులు అందించారు

ఇవన్నీ తరువాత!" ముందు రచయితగారు సభావేదికని అలంకరించాలి!' అంటూ ఎవరో వచ్చి నన్ను స్టేజి మీదికి తోడ్కుపోయాడు

నాకు ఏదో లోకంలో వున్న అనుభూతి కలుగుతోంది

సాహితీ సదస్సు అధినేత నను రసజ్ఞ సాహితీ వేత్తలకి పరిచయం చేశాడు

"ఈ రోజు శుభదినం !" ఎన్నాళ్ళుగానో ఎదురు చూస్తున్న అదృష్టం ఈ నాటికి మనకి దక్కింది' "ప్రముఖ రచయిత బిందుమాధవ్ గారు మన చిన్ని ఆహ్వానాన్ని పురస్కరించుకుని ఇక్కడికి రావడం ముదావహం

నిజానికి ఆయన క్షణం తీరిక లేని మహోన్నత రచయిత. ఆయన రచనలు వాస్తవానికి ప్రతీకలు, సమాజానికి దర్పణాలు! సంస్కరణకి నిదర్శనాలు!' అలాంటి రచయితను కలుసుకోవడం మన పూర్వజన్మ సుకృతం!" అనే చెప్పాలి!"

సభలో కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి

నా పెదవుల మీద చిరుదరహాసం వెలిగిపోతోంది 'ఇది నా పూర్వజన్మ సుకృతం!' అనుకున్నాను! స్వగతంలో

ఇంతలో అధ్యక్షుల వారు లేచి ఏవేవో మాట్లాడారు నన్ను గురించి గర్వంతో నా ఎడద పొంగింది

"ఇది రాజానగరానికే గర్వకారణం!" అన్నారు ఎవరో "ఏది?' అంతరాత్మ పెట్టే ఘోష

"ప్రముఖ రచయిత బిందుమాధవ్‌ని సన్మానించడం!" వాస్తవం చెప్పిన సమాధానం.

నా మెడ పూలదండలతో నిండి పోయింది నా నుదుట పెద్ద కుంకుమ బొట్టు దిద్దబడి ముక్కు



మీదికి రాలు తోంది కుంకుమ

నాభుజం మీద మెత్తని శాలువా కప్పబడి వుంది ఇవన్నీ రాజానగరంలో వుండే మాజీ రచయిత వేంకటేశం గారిచేతి మీదుగా జరిగాయి

నన్ను మాట్లాడమన్నారు సాహితీ సదస్సు వారు నాకు తప్పలేదు లేచి నిలుచున్నాను మైకు ముందు ఫొటోలు క్లిక్ మన్నాయి రేపు ఇవన్నీ ప్రముఖ పత్రికలలో వస్తాయి!

ఒళ్ళు ఒక్కసారి జలదరించింది చిరు చెమటలు అలుముకున్నాయి ముఖం నిండా చేతిరుమాలుతో ముఖం తుడుచుకున్నాను నా కాళ్ళలో సన్నని వణుకు ప్రారంభమయ్యింది

ఏం మాట్లాడాలి? ఏది మాట్లాడాలి? వెయ్యి కళ్ళు నా వైపు ఆరాధనగా చూస్తున్నాయి

కాలేజ్ డిబేట్‌లో మాట్లాడిన మాటలు గుర్తు వచ్చాయి నేటి తెలు గు సాహిత్యం అనే అంశం మీద అనర్గళంగా మాట్లాడాను అరగంటసేపు

ఆనందంతో చప్పట్లు కొట్టారు అందరూ

ఇంకేం మాట్లాడాలో తోచలేదు ఓసారి వాచ్ కేసి చూసుకున్నాను ఇది గుర్తించినట్టున్నాడు నన్ను మొదట కలిసిన వ్యక్తి గబగబా స్టేజి మీదకు వచ్చాడు

బిందుమాధవ్ గారంటే సాధారణ మైన వ్యక్తి కాదు! ఆయన అమూల్యా మైన కాలాన్ని మనం ఇంకా వినియోగించు కోవడం అంత మంచిది కాదు! మరల ఆయన మనకి తమ దర్శన భాగ్యాన్ని కలగజెయ్యా వలసిందిగా కోరుతూ సభని చాలిస్తున్నాము అని

బ్రతుకు జీవుడా! అనుకుని కుర్చీలో కూలబడ్డాను వెండితో తయారు చేసిన ఏనుగుల జంట నాకు బహుమానంగా ఇవ్వబడింది

దానివైపు అపురూపంగా చూసుకున్నాను

సభముగిసింది చాలామంది అభిమానులు నన్ను చుట్టు ముట్టారు అందరికీ ఆటోగ్రాఫులు ఇచ్చాను!

నన్ను స్టేషన్ వరకూ దిగబెట్టారు సాహితీ సదస్సువారు కొత్త పట్నం పోయే ట్రైన్ మూడు గంటలు లేటు అని తెలిసింది

అప్పటికి పదకొండు గంటలవుతోంది

వాళ్ళని వెళ్ళిపొమన్నాను

వెళ్ళలేక వెళ్ళలేక వెళ్ళారు వాళ్ళు

ఏదైనా లారీ మీద పోతే నయం అనుకున్నాను రైలు పట్టాలు దాటి రోడ్డు మీదికొచ్చాను!

చేతి సంచి బరువుగా వుంది దానినిండా పువ్వులదండలున్నాయి ఇవి గాయిత్రికి చూపించాలి!

దూరంగా క్రీనీడలో ఏదో మానవాకారం వస్తున్నట్టుంది కళ్ళు వెడల్పు చేసి చూశాను

ఆ ఆకారం చేరువయ్యింది అతను పురుషుడు నా వయస్సే వుంటుంది దేనికో హడా విడిపడుతున్నాడు

అతను కొంచెం నాలాగేవున్నాడు సన్నని గ్లాస్కో పంచె పలుచని సిల్కు లాల్చీ మెడలో బంగారు



విశాఖపట్నంలో జనవరి 12వ తేదీన ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సహకార బ్యాంకు జోనల్ ఆఫీసును మేనేజింగ్ డైరె శ్రీ ఎస్ ఏ ప్రసాద్ ఐ ఎ ఎస్ ప్రారంభిస్తున్న సందర్భంగా శ్రీయుతులు ఎన్ సత్యన్నారాయణ్ ఎం వి వీరభద్రేశ్వరరావు, ఐ ఏ రాఘవులు ఎన్ రాధా కృష్ణారావు యితర అధికారులని కూడా చిత్ర చూడవచ్చు

గొలుసు చేతి వేళ్ళకి బంగారు వుంగరాలు ఉంగరాలు తిరిగిన జుట్టు

మీరు ఎక్కడనించి వస్తున్నారు? అన్నాడు అతను రాజానగరం నించి! అన్నాను నిర్లిప్తంగా

అక్కడ సభగాని సన్మానం గాని ఏదైనా జరుగుతోందా? ఆత్రుతగా ప్రశ్నించాడు

ఆఁ ఊఁ తడబడ్డాను

మీకూ తెలియదన్నమాట! అంటూ కదల బోయాడు అతను

మీరెవరు? అన్నాను ధైర్యం కూడగట్టుకుని

నాపేరు బిందు మాధవ్! ప్రముఖ రచయితని!

నాకీ రోజు రాజానగరంలో సన్మానం వుంది! కాని దురదృష్టవశాత్తూ బస్సు యాక్సిడెంటయి సకాలంలో వెళ్ళలేకపోయాను! ఏదో జీపు ఇటువైపు వస్తూవుంటే అందులో వచ్చాను! భగవంతుడి దయవల్ల దెబ్బలేవీ తగల్లేదు! ఈ సంగతి రాజానగరం సాహితీ సదస్సు వారికి చెప్పి ఇక్కడికి దగ్గరలో నే వున్న మా అత్తవారి ఊరు వెళ్ళిపోవాలి! అన్నాడు అతను గుక్క తిప్పుకోకుండా

నేను బిత్తరపోయాను

నా సన్మానం బరువుగా బాధాకరంగా పరిణమించింది

నేను ఆలోచనల నుండి తేరుకునేసరికి అతను రైలు పట్టాలు దాటి రాజానగరం వైపు దూసుకు పోతున్నాడు ఆ చీకట్లోనే

పోరాపక్షీ! అనుకున్నాను విసురుగా

నేను కొత్తపట్నం చేరుకునేసరికి ఉదయం ఆరు గంటలయ్యింది

సాంబమూర్తి మామయ్యని నన్ను నేనే పరిచయం చేసుకున్నాను

ఇన్నాళ్ళకి ఈ మామయ్య గుర్తు వచ్చాడన్న మాట? నిష్ఠూరమాడాడు మామయ్య

ఆశ్చర్యపోయాను! నన్ను గుర్తుపట్టడనుకున్న మామయ్య ఇలా పలకరించడంతో కొండనందు కున్నాను

గాయిత్రికి జరిగిన అన్యాయానికి కుమిలిపోతోంది! అన్నాను

మామయ్య మీసాలకిందుగా నవ్వాడు

ఒకనాడు విడిపోయిన ఈ రెండు కుటుం మళ్ళీ ఒక్కటవ్వాలని అమ్మ అభిప్రాయం! గా జీవితం మోడువారి పోకూడదు! చిగురించాలి!

నీకు అభ్యంతరం లేకపోతే నేను గాయిత్రిని చేసుకుంటాను! అన్నాను మామయ్య ముఖ చూస్తూ

ఈసారి మామయ్య గలగల నవ్వాడు

అబ్బాయ్ కాలం మారిపోయింది! మీ రోజులువేరు ఈ రోజులు వేరు! గాయిత్రి నచ్చిన వ్యక్తిని పెళ్ళిచేసుకుంది! ఈ సారి అభ్యంతరం చెప్పలేదు!

అవాక్కయి పోయాను

బాబూ గాయిత్రిని చూస్తావా? నిన్నరాత్రి శిశువుని ప్రసవించింది! అన్నాడు మామయ్య

ఆ అవసరం లేదన్నట్టు మౌనం వహించాన

బాబూ ఇంకొక్కమాట! గాయిత్రి భర్త ప్ర రచయిత బిందు మాధవ్! నిన్న రాజానగరంలో సన్మానం వుందన్నాడు! ఈ వస్తూ వుండాలి!

మరి మామయ్య మాటలు వినిపించలేద కాలికింది భూమి పగిలినట్టనిపిస్తోంది

గిర్రున వెను దిరిగాను

సన్మానం నన్ను వెక్కిరించింది

పువ్వుల దండలు శాలువలతో పాటు అంత అందానికి ధరించిన ఉంగరాలు తిరిగిన కూడా విసిరికొట్టాను సున్నని గుండ పిలకజుట్టు చేతికి తగిలింది

గాయిత్రి అనేకల కరిగిపోయింది

బిందు మాధవస్వామి ఆలయ పూజారిగా ప్రయాణమయ్యాను

పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## అవతార పురుషుడు

నిద్రపట్టని అరుణ భారంగా పచార్లు చేస్తోంది. తొమ్మిది నెలలు నిండి పదిహేను రోజులయిపోయింది. ఇంకా కాన్పు కాలేదు. మూడోసారి – అత్తగారింట్లోనే ఉండిపోయింది. ముందర ఇద్దరు ఆడపిల్లలు. 'ఈసారన్న మగ నలుసుని కని మమ్మల్ని ఉద్ధరించమ్మ.' అంది వెటకారంగా అత్తగారు నెల తప్పిన వెంటనే. సుధాకర్ ఒక్కడే ఆవిడకి మగ సంతానం. మరి వంశం నిలబడే దెట్లా? చదువుకున్న భర్త మూర్ఖంగా ప్రవర్తించాడనుకుంటే, 'బాగుంది మరి. ఒక్కడ్ని కదా ఇంటికి ఆమాత్రం ఆవిడ ఆశ పడటంలో తప్పు లేదు' అనేసరికి అవాక్కయింది. అక్కడికి తనదేనా తప్పు? తనకి మాత్రం లేదూ మగ పిల్లాడిని కనాలని. నిమిత్తమాత్రురాలిలాగ అతని సంతానానికి తల్లి అవుతోందే గానీ, ఆడో, మగో – ఈ విషయంలో అందరూ ఎంత నిస్సహాయులో తనూ అంతేనని గ్రహించరేం? అక్కడికి తనేదో వాళ్ల వంశాన్ని నాశనం చెయ్యడానికి కుట్ర పన్నుతున్న దానిలా చూస్తున్నారు. ఆవిడకి ఒక్కడే మగపిల్లాడని, కోడలు తప్పకుండా మొగపిల్లాడిని కనాలంటే తన చేతుల్లో ఉందా?

ఇన్నాళ్ళూ మోస్తోంది మళ్ళీ ఆడసంతే నాయనా నీకు మగపిల్లా డయితే తొమ్మిది నెలలు నిండేసరికి కనేస్తారు ఇలా ఎంత మందిని కంటుంది? అత్తగారి మాటలు ఈటెల్లా ఉంటాయి మగపిల్లాడు పుట్టే దాకా ఇలా కంటూ ఉండాల్సిందేనా? ఆడపిల్లకేం భవిష్యత్తు ఉంటుంది? పూర్వకాలం ఎంత మంది నయినా కనేవారు మగపిల్లాడు పుట్టే దాకా. ఈ




రోజుల్లో కనే ఓపిక ఉన్నా, పెంచే స్థోమత ఏదీ? అంతమంది తర్వాత పుట్టే మగపిల్లాడికి ఏమి ఆధారం చూపించగలరు?

మేనమామ కూతురు అందంగా ఉండదని, కాదని, తనని చేసుకున్నాడు సుధాకర్ 'అందం కొరుక్కు తిన్నావా నాయనా? దానికి లక్షణంగా ముగ్గురు మగపిల్లలు, వెధవ రాత ఇలా ఉంటే అలాంటి బుద్ధులే పుడతాయి. 'సాధింపులకి అంతం లేదు చక్కగా అందరికీ ఒక ఆడ, ఒక మగ వరసగా పుట్టెయ్యకూడదా? ఈ గొడవలే ఉండవు కదా

ఆలోచనల్తో ఒళ్లంతా బిగుసుకుపోయి నట్టుంది. మళ్ళీ ఆడపిల్లే అయితే – ఈ భయానికి అసలు నరాలు పట్టుకుపోయి పురుడు ఆలస్యం అయిపోతోందేమో. కడుపులో పిల్ల బయట పడుతుంది. అంటేనే భయమేస్తోంది. కానీ ఎలాగ? కనక తప్పుతుందా? అంతా బాగానే ఉంది. ఇంకొక రెండు రోజులు చూద్దాం. అంత టెన్స్ అయిపోకు.' అంది డాక్టరు. తన భయం ఆవిడకేం తెలుసు? ఈ సమస్యకి పరిష్కారం ఎలాగ? కడుపులో ఉన్నది ఏ పిల్లో ఎలా తెలుస్తుంది? కళ్ళు మూసుకుని 'భగవంతుడా! నాకీ జీవితం వద్దు. ఈ పిల్లా వద్దు. నన్ను చంపెయ్యి దేవుడా.' అని ఆక్రోశిస్తూ నిస్త్రాణగా కళ్ళు మూసుకుంది. మంచంమీద వాలి. మగత కమ్మినట్లయింది. ఎక్కడి నుంచో సన్నగా, హాయిగా, మందంగా మాటలు – 'వద్దమ్మా. మనం చచ్చిపోవద్దు. నన్ను బయటకి రానీ. నీ కష్టాలన్నీ తీరిపోతాయి.' ఉలిక్కిపడి లేచింది అరుణ. ఒళ్లంతా చెమటలు. ఒక్క నిమిషం గడిచేసరికి . ఎందుకు మెలకువ వచ్చిందో అర్థమయింది. 'అమ్మా!' అంటూ అరిచింది. విపరీతమైన నడుము నొప్పితో. ఉలిక్కిపడి లేచాడు సుధాకర్ భార్య కేకకి.

తెలివొచ్చిన అరుణకి పొత్తిళ్లలో చుట్టిన పసికందుని చూపిస్తూ, 'పడితే పడ్డావు గానీ కష్టం వంశోద్ధారకుడు పుట్టాడు, అంటోంది అత్తగారు. గుండెలనిండా గాలి పీల్చుకుంది అరుణ. నీళ్ళు నిండిన కళ్ళతో, 'కాదు. నన్ను ఉద్ధరించడానికి పుట్టిన అవతార పురుషుడు' అనుకుంది మనస్సులోనే.

చివరి మాట : అరుణ ఉన్న పరిస్థితుల్లో ఎస్. టి. డి. లు కొంత మేలే చేస్తామేమో. ఇష్టంలేని ఆడపిల్లని ఈ లోకంలోకి తెచ్చి శాపనార్థాలు పెడుతూ పెంచే కన్నా, పిండం దశలోనే దానికి విముక్తి కలిగిస్తూ ఒక్క ఏడుపుతో సరిపోతుంది.

అంకితం : మొదటి సారే మగపిల్లాడిని కని 'వంశాన్ని ఉద్ధరించిన తల్లులందరికీ!

—జ్యోతిర్మయి, గోకుల్‌పేట్, నాగపూర్

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ____________________

____________________

పూర్తి చిరునామా ____________________

పిన్ కోడ్ : ____________________

# ఎవరైనా జాలి పడతారా?

"సాహితీ ప్లీజ్ నామాట వినవూ! మనకి అపుడే పిల్లలెందుకు చెప్పు. పెళ్ళయి ఆరునెలలే కదా! జాగ్రత్త పడ్డా ఎక్కడో పొరపాటు జరిగింది. ఈ ఒక్కసారి....'



ఏవండీ నా మాటకూడా కొంచెం వింటారా? ఆ జాగ్రత్తేదో ముందే ఉండాలి కానీ ఇపుడు కాదు. నాకెందుకో ఒక నిండు ప్రాణాన్ని తియ్యటం ఇష్టం కావటం లేదు. అయినా మీకు రోజూ చెప్తున్నా ఇలాగే అంటున్నారు. సరే మీ ఇష్ట ప్రకారమే కానివ్వండి'. అంటూ ఒప్పుకుంది అబార్షన్‌కు అయిష్టంగా.

* * *

'సాయంత్రం ఆఫీసునుండి త్వరగా వస్తారా?" స్కూటర్ బయటకు తీస్తున్న భర్తను ప్రశ్నించింది సాహితి.

'ఏం? దేవిగారు ఎక్కడికైనా ప్రోగ్రామ్ పెట్టారా?'

'అహ అటువంటిదేం లేదు ప్రతిరోజూ అడిగినట్లే ఈ రోజూ అడిగాను త్వరగా వస్తే చల్లగాలికి "డాబాపై కూర్చోవచ్చు.'

'ఒకే. ఒకే త్వరగావచ్చేస్తాను ఇదిగో ఈ విధమైనస్వేచ్ఛకొరకే ఆనాడు అబార్షన్ చేయించుకోమంది. అదే పిల్లలు పుడితేనీ అందం తగ్గిపోతుంది. చిన్నవయసులోనే ముసలమ్మలా అయిపోతావు. కొంతకాలం తర్వాత ఎలాగూ తప్పదనుకో. ఇపుడే నోయ్ లైఫ్ ఎంజాయ్ చెయ్యాల్సింది'అంటూ బుగ్గపై చిలిపిగా చిటికెవేసి స్కూటర్‌స్టార్ట్ చేసాడు సాగర్. వీధి మలుపుతిరిగేవరకూ చూసి ఇంట్లోకి నడిచిందిసాహితి.

* * *

భోజనంచేసి విశ్రాంతి తీసుకుంటున్న సాహితికి నాలుగు గంటల సమయంలో తలుపు కొట్టిన శబ్దం వినిపించింది.

అరే అపుడే ఆఫీసునుండి వచ్చేసారా? ఏమిటి అనుకుంటూ తలుపు తీసింది.

ఎవరో అపరిచిత యువకుడు.

'సాగర్‌గారి ఇల్లు ఇదేనా?'

'అవును ఇదే. మీకు ఎవరు కావాలి?'

'సాగర్ భార్య మీరేననుకుంటాను. నేను సాగర్ ఫ్రెండ్‌ని. ఆఫీసు పనిమీద బయటకు వెళ్ళిన సాగర్‌కు చిన్న యాక్సిడెంట్ అయింది మిమ్మల్ని హాస్పిటల్‌కు తీసుకురమ్మని చెప్పారు.'

అంతే ఆమాట విన్న సాహితికి ఒక్కక్షణం కళ్ళకి చీకట్లు కమ్మినట్లు అయింది. నా సాగర్‌కి యాక్సిడెంటా. బాగా దెబ్బలుగానీ తగల్లేదు కదా' ఇక ఆపై ఆలోచించలేక పోయింది. మరేమీ ఆలోచించకుండా తాళంవేసి అతని వెంట బయలుదేరింది.

* * *

హాస్పిటల్ బెడ్‌పై ఒళ్ళంతా కట్లతో సాగర్. ఒకే ఉదుటున ఏమండీ అంటూ ఏడుస్తూ సాగర్‌పై వాలిపోయింది సాహితి. నిదానంగా తేరుకున్న సాహితికి మరో పిడుగులాంటి వార్త.




ఇహ జీవితంలో సాగర్‌కి తండ్రి అయ్యే యోగం లేదని ఒకరి నొకరు పిచ్చిగా చూసుకుంటూ ఉండి పోయారు ఎప్పటికీ తల్లీ, తండ్రి కాలేని సాహితీ సాగర్‌లు.

ఒకప్పుడు వారి సంతోషానికి అడ్డని 'గర్భస్థ శిశువును' విచ్ఛిన్నం చేసుకున్నారు. మరి ఈనాడు ఎవరైనా వారిని చూసి జాలి పడతారా?

ఎ. పద్మా వెంకటేష్,
బాపూజీనగర్, సికింద్రాబాద్.

# అమ్మా! నా కోరిక వినవా?

అమ్మా......

కళ్ళు తెరచి ఎవరూ పిల్చేది అనుకుంటూ చుట్టూ చూసింది భారతి.




భారతి సందేహానికి సమాధాన మిస్తున్నట్లుగా "నేనేనమ్మా!నీవు ఈ భూమిపై జన్మనివ్వబోతున్న నీ బిడ్డను.



నీవు నాకు జన్మనివ్వబోయే ముందు నాకోరిక విని నీకిష్టమైతే జన్మనివ్వమ్మా. లేకపోతే నా జీవితాన్ని ఇంతటితో ఆపెయ్యి నే బాధపడన్లేమ్మా"

'తల్లి అంటే పిల్లల ఆలనా పాలనా చూసుకుని వారికి అనురాగాన్ని, ఆత్మీయతను పంచి, వారిలో మంచి అలవాట్లకు ఒరవడి దిద్ది, దేశభవిష్యత్ కోసం ఒక ఉత్తమపౌరునిగా తమబిడ్డను తీర్చిదిద్దగలిగే స్త్రీమూర్తి. అటువంటి తల్లిగానే నీవు నాకు కావాలమ్మా. పిల్లలకు పాలిస్తే నా అందం తరిగిపోతుంది, అనుకుంటూ, పోనీ ఇవ్వాలనుకున్నా టైమ్‌లేక ఆఫీస్‌లకు పరుగెత్తుతూ కనీసం నా ముద్దూ ముచ్చటా చూసే తీరిక కూడా లేకుండా వుండే తల్లిగా నీవు నాకు వద్దమ్మా. నాన్న, నీవు ఇద్దరూ ఉద్యోగాల పేరుతో పరుగులుపెడుతూ, నన్ను పట్టించుకోకండా నేను తింటున్నానా? లేదా? నా నడవడి ఎలా ఉంది అని పరీక్షించే తీరిక లేకుండా మీరుంటే, నాకు ప్రేమ, ఆప్యాయతలు కరువై, నేనే మిమ్మల్ని అసహ్యించుకునే, రోజు వస్తుంది. తల్లితండ్రులను అసహ్యించుకునే బిడ్డగా జన్మవద్దు. మరి ఆలోచించమ్మా!మంచితల్లిగా, ఆదర్శమూర్తిగా నాకు జన్మ నిస్తావో? బిడ్డ విషయాలు పట్టించుకోని తీరికలేని తల్లిగా నాకు జన్మనిస్తావో? రెండో విషయంగానే నీవు జన్మనిచ్చేట్లయితే నా జీవితాన్ని ఇంతటితో సమాప్తం చేయి!'

'పాపా (బాబూ) నన్ను క్షమించు. మీనాన్న నన్ను నా ఉద్యోగం చూసే చేసుకున్నాడు. నీకోసం ఉద్యోగం మానేస్తే మీ నాన్న నన్ను వదిలేస్తాడు. సమాజం కోసం అన్నా నేను ఆయనతో కలిసి గడపాలి. నీ ఆశను తీర్చలేను. నీ కోరిక ప్రకారం రేపే వెళ్ళి అబార్షన్ చేయించుకుంటా'అంది భారతి.

"థ్యాంక్స్... అమ్మా నాకోసం బాధపడకు. ఈనాడు లోకంలో జరుగుతున్న అనేక అనర్థాలకు మూలకారణం మనుషులలో ప్రేమ, అభిమానం, ఆప్యాయత లోపించడమే. అటువంటి వారిలో ఒకరిగా నేను కాకుండా పోతున్నందుకు నేను గర్వపడుతున్నా."

బి. యన్. ఆర్. శారదాంబ,
పోరుమామిళ్ళ. □

వాహిని పరిగెడుతున్నట్టుగా వచ్చిపడింది సలిల దగ్గరకి పలికితే ఒలికేలా వున్నాయి కళ్ళు

"ఏమైందే నీకు? ఏవిటీ వాలకం?" అని అడిగింది సలిల "ఉదయం పాల కోసం వెళ్ళిన అమ్మకి ఏక్సిడెంటయిందట ఎంత సేపటికీ పాల కోసం వెళ్ళిన అమ్మ రాలేదు నన్ను అర్జంటుగా హాస్పటల్‌కి రమ్మని కబురు మాత్రం వచ్చింది ఆపరేషన్ చేసి కాలు తీసెయ్యాలేమో అన్నారు ఆయనేమో ఊళ్ళో లేరు. నాకేం తోచక నీ దగ్గరకి పరిగెత్తి ఒచ్చాను" ఒగర్చుతూ ఆయాస పడుతూ ఒక్క గుక్కలో చెప్పేసి ఏక ధారగా కారే కన్నీళ్ళు పమిట చెంగుతో అద్దుకుంది

"ఛ! అల్లా ఏడవకే జీవితమన్నాక ఒడుదుడుకు లొస్తూనే వుంటాయి అలాటప్పుడు ధైర్యంగా నిలబడగలగాలి ముందు కాస్త కాఫీ తాగు నేనూ వస్తా."

"నాకేం వద్దే బాబూ! అమ్మ కేదయినా అయితే నాకెవరున్నారే ఇంక?' బావురుమంది వాహిని.

"ఏమీ అవదు. నువు ముందు నర్సింగ్ హోంకి పద నీ వెనకాలే మా వారితో చెప్పి నేను వస్తా. ఏవిటి అలా తటపటాయిస్తున్నావు అడగవే పిచ్చి మొద్దూ!"

"నీకన్న ఆప్తు లెవరున్నారే నాకు నా చేతి లో పైసా లేదు. డబ్బుతో నే కదా అన్ని పన్లు అయ్యేది రెండు వందలుంటే సర్దు తరువాత ఇస్తాను." స లిల మంచులా కరిగిపోయింది

"ముందుగా నువు పద. అవన్నీ నాకు ఒదిలేయ్ "

వచ్చినంత పరుగుతోనూ వాహిని వెళ్ళిపోయింది.

"తొందరగా లేవండి! రోజూ వుండే నిద్రే కదా వాహిని వాళ్ళమ్మ గార్కి కారు ఏక్సిడెంటయిందట ఏడుస్తూ వచ్చింది పాపం వాళ్ళాయన వూళ్ళో లేడట. ఆదసలే బిక్క మొహం వేసేసింది

రెండొందలు ఎక్కడేనా తీసుకుని రండి తొందరగా పద్మా నర్సింగ్ హోంకి వెడదాం ఆవిడెలా వున్నారో ఏవిటో! నెలాఖరు రోజులు మన దగ్గరేం లేదు కదా! అయ్యో! అలా చూస్తారేవిటండీ? మొహం కడుక్కోండి కాఫీ తెస్తాను '

వాసుమూర్తి పక్క మీంచి ఒక్క ఉదుటన లేచి బాత్ రూంలో దూరాడు. ఆదరా బాదరా ఆఫీసు కెళ్ళిన వాసుమూర్తి అప్పుడే వచ్చిన ఆనంద్ దగ్గర కెళ్ళి "వెరీ అర్జెంట్ బ్రదర్. రెండు వందలుంటే సర్దగలవా? ఏక్సిడెంట్ జరిగిపోయింది. సెలవు చీటి ఇదిగో "ఏం మాట్లాడుతున్నాడో తనకే తెలీదు. ఏవిటి? ఎవరికి? ఎప్పుడు? అని ఏం అడగలేదు. నాలుగడుగుల్లో నాగిని దగ్గర కెళ్ళి డబ్బు వుందా? అని అడగలేదు అర్జంటన లేదు ఏక్సిడెంటన లేదు. చొరవగా పర్సు లాక్కున్నాడు. నాగిని చేతులోంచి

అవును మరి. ఆనంద్‌కి టైపిస్ట్ నాగినికి వున్న ప్రగాఢ మైత్రి అటువంటిది కాని చేతికి చిల్లర డబ్బులు మాత్రమే తగిలాయి వెర్రి మొహం వేసి నాగిని కళ్ళలోకి అయోమయంగా చూసాడు "నెలాఖర్రోజులు ఏమాత్రం కావాలేంటి' అంది నాగిని చిరునవ్వుతో, ఆ నవ్వులో అందాన్ని, లిప్‌స్టిక్‌లో మెరుపుని, పెదాల్లో ఒంపునీ చూసే మూడ్ లేదు ఆనంద్‌కి.

తన ప్రియ మిత్రుడు వాసుమూర్తి చీటికి మాటికి అప్పులడిగే అప్పారావు మాత్రం కాదు ఏదో పీకల మీదకి వచ్చిన బాపతై వుంటుంది ఆ మాటే అన్నాడు నాగినితో 'ఇంతకి ఎంతేవిటి" అంది సీరియస్‌గా నాగిని

రెండు వందలు అర్జంట్ అన్నాడు ధీమాగా సగం ధైర్యం చిక్కింది "వెయిట్ వన్ మినిట్' అని హైహీల్సు టకటక లాడించుకుంటూ బైటకు వెళ్ళిపోయింది విసురుగా.

నాగిని తల్చుకుంటే రెండు వందలు ఓ లెక్కలోది కాదు తనంటే పడి చచ్చే బాబూరావు హడావిడిగా లూనా మీద ఆఫీస్‌కి పోతూంటే "హల్లో" అంది అతిమధురంగా నాగిని

'నన్నేనా?' అనుకున్నాడు మొదట

'దేవత వరాలిచ్చేందుకి ఆపిందా?' అనుకున్నాడు ఆ తరవాత నక్క ని తొక్కి వచ్చాననుకున్నాడు పక్కనే వున్న ఎలక్ట్రిక్ ఆఫీసులో పని చేసే బాబూరావు

దగ్గరగా వచ్చి నాకో సాయం కావాలంది నాగిని వేసుకున్న ఫెర్‌ఫ్యూమ్ మత్తెక్కిస్తోంది బాబూరావు మస్తిష్కాన్ని

"చెప్పండి సందేహించకండి నా ప్రాణమైనా, కొండ మీద కోతైనా సరే"

'నో నో అవేం చేసుకోను? రెండు వందలు కావాలండి అర్జంట్'

ష్యూర్, ష్యూర్ మీ రడగాలే కాని రెండు వేలైనా తేగలనండి '

"క్విక్ అర్జంట్ అంది నాగిని లూనా వెనక్కి తిప్పేశాడు బాబూరావ్ వాచీ చూసుకుంటూ అక్కడే నిలబడింది నాగిని

మాటైతే దర్జాగా అన్నాడు కాని ఎక్కడ తేగల్డు రెండొందలు ఈ వాళ 27 తేది.

* * * *

"మాటైతే అంది కాని పాపం ఈ నెలాఖ ర్రోజుల్లో రెండొందలు దాని దగ్గర మాత్రం వుండద్దూ! అందుకే ఆలోచించింది సలిల " అనుకున్న వాహిని మారువాడీ దగ్గర తన చెవి దుద్దులు పెట్టి రెండొందలు తెచ్చింది తెచ్చిన డబ్బు లెక్క పెట్టుకుంటూ 'పద్మా నర్సింగ్' హోం వరండాలో నిల్చున్న వాహినిని చూశాడు బాబూరావు

ప్రాణం లేచొచ్చింది డబ్బు చూడగానే

"వాహినీ ఇలా ఇక్కడ నిలబడ్డారేవిటి? ఎవరికైనా సుస్తీయా?" అనవసర ఆదుర్దా తెచ్చి పెట్టు కుంటూ అడిగాడు బాబూరావ్.

"అవునండి మా అమ్మకి కాల్లు ఏక్సిడెంట్ అయింది కాలు తీసెయ్యా లేమో అని హడలి చచ్చిపోయానంది. పెద్ద డాక్టరు వచ్చి చూసి అదేం అవసరం లేదు కుట్లు వేస్తే చాలు అన్నారు. నాకు అమ్మ తప్ప ఎవరున్నారు చెప్పండి. నా మనసిప్పుడు కాస్త స్థిమిత పడింది అనుకోండి

ఎన్నో తంటాలు పడి ఈ రెండు వందలూ పుట్టించుకొచ్చాను. కాని వీటి అవసరం లేకుండానే పని జరిగిపోయింది" పేలవంగా నవ్వింది.

"అదేం."

"ఆ కారు గల పెద్ద మనిషే డాక్టరు బిల్లంతా ఇచ్చేస్తానన్నారు."

"మీరు మరోలా అనుకోకపోతే ఆ రెండొంద లు నాకు కావాలండి. మళ్ళీ తొందర్లో మీ డబ్బు మీకిచ్చేస్తా వెరీ అర్జెంట్ ప్లీజ్'

'అయ్యో పాపం నాలాటి అవసరమే కదా వాళ్ళెవరో ఆపదలో వున్నారు అనుకుని 'తీసుకోండి' అంది

మాట పూర్తిగా అననిచ్చాడా? ఇయ్యనిచ్చాడా? చేతులో నోట్లు లాక్కున్నట్టుగా పట్టుకు పోయాడు రివ్వున లూనా ఎక్కి

బాబూరావు ఎవరో కాదు వాహిని వాళ్ళ పక్కింటి వారబ్బాయి ఇదివరలో ఎప్పుడూ ఒకరితో ఒకరు మాట్లాడిన పాపాన పోలేదు

తనకోసం ఎదురు చూస్తూ నిల్చున్న నాగినికి రెండు వందలూ ఇచ్చి ఆవిడ కళ్ళలో మెరుపు చూడాలని తహతహలాడాడు తను పలకరిస్తే మొహం ముడుచుకునే నాగినికి ఈ వాళ తనవసరం వచ్చి హలో అని పలకరించింది అతనికి గాల్లో తేలిపోతున్నట్టుంది

తనూహించి నట్టు తన రాక కోసమే ఎదురు చూస్తూ నిల్చుంది నాగిని సన్నని కర్చీఫ్‌తో నుదుట పట్టిన స్వేద బిందువుల్ని సున్నితంగా అద్దు కుంటోంది

బాబూరావు చేతిలో డబ్బు యాంత్రికంగా అందుకుని 'థేంక్స్' కూడా చెప్పకుండా గిర్రున వెనక తిరిగి వెళ్ళి పోయింది నాగిని 'ఫార్మాలిటీ' కైనా ఒక చిన్న నవ్వు పారేయకుండా పోవాలా అని వుసూరుమన్నాడు బాబూరావు

రెండొందలు తెచ్చి తనకు నచ్చిన తను మెచ్చిన ఆనంద్ చేతికిచ్చి నైస్‌గా నవ్వింది నాగిని ఆలిప్‌స్టిక్ పెదాలు విచ్చుకున్న అందం చూడకుండానే ఒక్క వూపులో వెళ్ళిన ఆనంద్ ఆ రెండు వందలూ

వాసుమూర్తి చేతుల్లో కుక్కాడు.

"నా పరువు దక్కించావోయ్" అంటూ ఇంటి వేపు దౌడు తీశాడు. రెండు వందల రూపాయలూ భార్య చేతిలో పెట్టి ఇంటిముందు రెడీగా వున్న ఆటోలో ఎగిరి కూచున్నాడు వాసుమూర్తి.

ఇంటికి తాళం నొక్కి కాఫీ ఫ్లాస్కుతో రడీగా వున్న సలిల కూడా వచ్చి భర్త పక్కన కూచోగానే ఆటో కదిలింది.

"వాహీ! కొంచెం ఆలస్యమైందే. ఎలావున్నారు అమ్మ?" అంది రెండు వందలూ వాహిని చేతుల్లో వుంచుతూ.

"ఇప్పటి వరకూ బెంగతో కుళ్ళి చచ్చాననుకో సలిలా! అమ్మకి కాలుతీసేస్తారేమో అని. అదేంలేదు కుట్లు వేస్తే చాలన్నారు పెద్ద డాక్టరు. 15 రోజుల్లో అంతా నయమై పోతుందట. నా చేతులో చూస్తే పైసాలేదు. నిజంగా దేముడులా కారుగలాయన వచ్చి డాక్టరు బిల్లంతా తనే ఇచ్చేశాడు. పొరపాటంతా తనదేనని జరిగినదాని కెంతో బాధపడి 'ఎక్సూజ్' చెప్పాడు కూడా".

"అమ్మకు ఇప్పుడే తెలివొచ్చింది చూదూగానిరా". అని తీసుకెళ్ళింది. అప్పుడే తేరుకున్న నవ్వు కూడా వాహిని పెదాలపైదోబూచు లాడింది.

వాహినిని చూస్తే ఆక్షణంలో సలిలకి ఎక్కడ లేని జాలి ముంచుకొచ్చింది. "లక్కీగా తప్పింది ప్రమాదం. ఇక దిగులు పడకు నాలుగు రోజుల్లో నయమై పోతుంది.

"ఈ డబ్బవసరం ఏం లేదే, రేపు ఎలాగూ ఆయన రానేవస్తారు" అంది వాహిని.

ఈ రెండొందలు మన దగ్గరవుంటే ఏదో రకంగా ఖర్చయి పోతాయి. ఇహ అప్పు మిగులుతుంది మనకి. వెంటనే ఇచ్చేసిరండి అని తొందర చేసింది భర్తని సలిల.

తెల్లబోయి చూశాడు డబ్బిచ్చేస్తున్న వాసుమూర్తిని ఎగాదిగా ఆనంద్.

"ఎవరికో ఏక్సిడెంటన్నావు. సెలవు పెడతానన్నావు. మళ్ళీ ఆఫీసు కొచ్చావ్. ఇదివరలో అత్యవసర మన్న డబ్బు ఇప్పుడు అనవసరమంటున్నావ్. ఏవిటి గురూ ఇదంతా".

"అదంతేలే" అని నవ్వుకుంటూ వెళ్ళిపోతున్న వాసుమూర్తిని చూసి అలాగే నిలబడిపోయి అదో మాదిరిగా కళ్ళు చిట్లించి చూశాడు ఆనంద్.

"చివర్రోజుల్లో నిన్ను ఇబ్బంది పెట్టినట్లున్నాను. సారీ! ఇదిగో నీడబ్బు" నాగిని టేబిల్ దగ్గరకెళ్ళి రెండొందలు ఇచ్చేశాడు. ఒక కన్ను కాస్త మూసి తెరిచాడు.

"వాట్! వాట్! ఎవరికి చివర్రోజులు". నాగిని ఆత్రంగా అంది.

"మనకి కాదులే. ఈ నెలకి".

"ఏవిటి కథ?"

"కథలకేం లే కావలిసినన్ని వుంటాయి".

నాగిని ఆఫీసు మెట్లు దిగేసరికి ఎలక్ట్రిక్ ఆఫీసులో పని చేస్తున్న బాబూరావు తన కోసమే ఎదురు చూస్తున్నాడల్లే వుంది సన్నగా ఈలేశాడు. "స్టుపిడ్" అనుకుంది.

ఆ రెండొందలు తీసుకోబట్టికదా ఇంత చొరవొచ్చింది వీడికి "టేక్ యువర్ మనీ బాస్టర్డ్"! అని చక చకా వెళ్ళి పోయింది. ఆఖర్నన్న మాట ఏమిటో సరిగా వినపడలేదు.

తెల్లమొహం వెయ్యటం ఇప్పుడు బాబూరావ్ వంతయింది.

ఏదో అడగాలనే లోగానే గిర్రున వెనక్కి తిరిగి, పోయింది.

అప్రయత్నంగా "ఒకటడగాలనివుంది" అనే పాట, పాడాలనే వాంఛ అణచుకుని తనేమైనా పొరపాటు చేశాడా? అసలెక్కడుంది తిరకాసు? అని ఆలోచించాడు. చేజిక్కిన చిలక ఎగిరి పోయినట్లైంది. ఏవిటో ఈ ఆడాళ్ళు చచ్చినా అర్ధంకారు. అనుకుని బుజాలెగరేశాడు చిన్నగా.

సరే! ఈ రెండొందలు వాహినికి అందజేయటమెలా? కలకల్లాడుతూ వుండే ఆవిడ మొహం ఆదుద్దులు తీసెయ్యగానే చిన్న బోయింది. ఏసేఫ్ దగ్గరో తాకట్టు పెట్టి ఆడబ్బు తెచ్చుకుని వుంటుంది.

ఇంతలో గెద్దలా వచ్చి తను తన్నుకు పోయాడు ఆడబ్బు. ఆవిడకే ఇచ్చేస్తే దుద్దులేనా మళ్ళీ విడిపించు కుంటుంది. ఇంటికి వెళ్ళాక పక్కిల్లో కాబట్టి ఇచ్చేస్తే, మావాళ్ళంతా కలిసి మరో కథ సృష్టిస్తారేమో. హాస్పటల్‌కే వెళ్ళి ఇచ్చేస్తే పోలా అనుకున్నాడు. పాపం వాహిని చాలా మంచిది. వాళ్ళమ్మ గారు కూడ ఎలా ఉన్నారో చూసి రావచ్చు. వాహినితో మాట్లాడేంత సన్నిహితమేం లేదుతనకి. డబ్బుని గురించి తనే పలకరించాడు. ఇలా ఆలోచించుకుంటూ హాస్పటల్ వేపు తిప్పాడు లూనా. □





# దూరదర్శనం

లత

## ఖవాలీ

ఈ ఖవాలీ గాయకులు ఎంత బాగా పాడినా అదే పనిగా వినటం వల్ల ఆనందించలేక పోతున్నాను నేను. చాలా మందికి బాగున్నాయేమో మరి?

## అప్నే ఆప్

ప్రతి వారం ఒక చేతి పని ఇంటికి చాలా అవసరం అయినవి ఎలా చేయడమో ఇలస్ట్రేటెడ్ టాక్ ఇస్తారు. కొవ్వొత్తులు తయారీ గురించి ఈ వారం చెప్పారు.

## జంతు ప్రపంచం

ప్రాకృతికంగా ఎన్నో ప్రాణులు ఈశ్వర సృష్టిలో మొదట నీటిలో పుట్టినవి. ఇప్పటికీ మూడు వంతులు సముద్రమే ఉన్న ఈ గోళంలో నీటిలో జీవించే జీవాల గురించి చూస్తుంటే ఈశ్వర సృష్టి చాతుర్యానికి విస్తుపోవటం తప్ప మనిషి చేయగలిగింది లేదు చాలా జీవరాసుల్లో తనూ ఒకడు అంతే అనిపించి గర్వం పోతుంది వీటన్నిటినీ కనిపెట్టినందుకు గర్వమూ కలుగుతుంది. గతంలో ఒక తడవ సీక్రెట్స్ ఆఫ్ దీసీ అనే శీర్షికను చూపించారని జ్ఞాపకం వస్తున్నది కొన్ని లక్షల పక్షుల్ని చూపించారు వాటిలో అయిదారు రకాలున్నాయి అయితే ఏ రకానిక ఆ రకం గుంపులుగా జీవిస్తున్నాయి అంటే గ్రూప్ సిస్టం జాతి భేదం లాంటివి ప్రాణ కోటలోనే సహజం అన్నమాట.

## సి. ఆర్. పి. ఎఫ్ – డాక్యుమెంటరీ

దేశరక్షణకి మిలిటరీ – పోలీసు అవసరమే... కాని ఉద్యోగులకి జీతం ఇవ్వడం అనవసరం అనుకునే ప్రభుత్వం పోలీసులకు సకల సదుపాయాలూ కల్పించి వారి చేత పౌర హక్కుల్ని కాలరాయించటం ఎంత మాత్రం సమంజసం కాదు గర్హనీయం కూడా. అందుకే ఆంధ్రులలో జన్మించిన నేను ఈ 'డాక్యుమెంటరీని ఎంత బాగున్నా సహించలేని మానసిక స్థితిలో ఉన్నాను. పోలీసు రాజ్యం మిలిటరీ ప్రభుత్వం ప్రజలు ఎంత మాత్రం సహించలేరు – అది శాశ్వతం కాదు.

## దేవత

హిందీ సినిమా జీన్ వాల్జీన్ విక్టర్ హ్యూగో వ్రాసిన మహత్తర నవలని కొద్దిగా మార్చి తీశారు. బాగుంది. సంజయకుమార్, షబానా ఆజ్మీల నటన ఉత్తమంగా ఉంది.

ఈ నెలలో తెలంగాణాలో స్త్రీల పోరాటం అనే పుస్తకం మీద అదే వ్యక్తులు– అదే టేపు. ఆ ఫిలిమే మళ్ళీ మన మొహాన కొట్టారు. హైదరాబాద్ కేంద్రం ఇది తమ్ముడూ.... అంతకన్నా ఆశించకు చెల్లెలూ.... ఇది హైదరాబాద్ కేంద్రం బాబూ. దీనిలోన మార్పురాదు అమ్మా.... కిందటి తడవ వ్రాశాను.... ఇది కమిట్‌మెంటు ఉన్న పార్టీ ప్రచారం పార్టీ పేరు ఎత్తకుండా. టి. వి.కి ఇది సంప్రదాయంకాదు.

ఆడది ఒక నెల గిన్నెలు కడగటం మగవాడి మూడు నెలల జీతానికి సమానం... ఈ వాక్యం బాగుంది.

ఈ తడవ కనకవల్లీ తాయారుగారు, వారి బృందం పాడిన భక్తి గీతాలు అని చెప్పారు. ప్రేక్షకుల జన్మ ధన్యమయింది.

కవిని నేనై.... సంగీత స్వర్గాన తేలిపోదామా అని ఎవరో పాడారు. పాట తేలిపోయింది. ఎనౌన్స్‌మెంటు మాత్రంలేదు. ఆ పాట సగంలోనే స్రావం అయిపోయింది.

వెంటనే గర్భస్రావం మిద చిన్న కార్యక్రమంలాటి ప్రసంగం ప్రారంభం అయింది. శనివారం వచ్చే తెలుగు సినిమా అయినా మిగతా దేశానికి ప్రసాదిస్తే బాగుండును ఈ ఉపగ్రహం.

## యాత్ర

ఆగ్రాలో ఆగింది. ఈలోగా డ్రైవర్లు మారారు. రైలు కిందపడి చావాలనుకొన్న దౌర్భాగ్యుడు డ్రైవరు దూరదృష్టి మూలంగా రక్షింపబడతాడు. విదేశీ ఆడపిల్ల వెంటబడిన వెకిలివాడిని వదిలించుకొని, స్నేహను బయటికి వెడుతుంది. టికెట్ కలెక్టరు డ్యూటీ దిగిపోతాడు. మరో రైలు ఎక్కాల్సిన నవీన దంపతులు సమయం ఉందని తాజమహల్ చూడటానికి వెడతారు. ఎన్ ఛాంటింగ్ ఇండియా యాత్ర ఇంకా ఉంది. ఓంపురి ప్రయాణం పూర్తవలేదు. శ్యామ్ బెనెగల్ ఈ కథ అంతులేకుండా విసుగులేకుండా నడపగలడు. లోకంలోలాగా పాత్రలు వస్తుంటాయి. పోతుంటాయి. ఇప్పటి రైళ్ళు జీవితకాలం లేటు కాకుండా యాత్ర సాగిస్తున్నాయి.

జనవరి 3 మధ్యాహ్నం చెప్పుకోదగ్గ ప్రోగ్రాంలు లేవు. అంతకు ముందు ఎడ్యుకేషనల్ ప్రోగ్రాంలో టేమింగ్ ఆఫ్‌ది శ్రూ వచ్చింది. ఆ ప్రసారాల్ని మనం కవర్ చేయటంలేదు.

'బునియాద్' వస్తూనే ఉంది. బందరులో దొరికే జీళ్ళపాకంలాగా– మనం చూస్తూనే ఉన్నాం.

మన తోలుబొమ్మలాట చూపించారు– ఇంగ్లీషు వ్యాఖ్యానంతో ఇన్నాళ్ళకి. ఆంధ్రుల జానపద కళ ఒకటి టి. వి.లో దర్శనం ఇచ్చినందుకు మహదానందంగా ఉంది– బంగారక్క కేతిగాడు కూడా వచ్చారు తెరమీదకి. నిజంగానే నేటి సినిమాకి ఇది పూర్వరూపం. యంత్ర రహిత చలన చిత్రం– ఇది సంప్రదాయక కళ కనక పిల్లలకి కూడా ఈ బొమ్మలు తయారు చేయటం వచ్చును. శబ్దం, రూపం, గానం కలిసిన ఈ తోలుబొమ్మలాట కేవలం ఆంధ్రుల సొంతం. హమ్మయ్య గుర్తించారు టి. వి. వాళ్ళు– హిందీ వినీ వినీ తుప్పుపట్టిన చెవులకు తెలుగు తేనెలా అనిపించింది.

అయినా ఆ కళాస్రష్టలకి పోషణలేదు. సినిమా తోలుబొమ్మలకి అన్యాయం చేస్తే టి.వి. సినిమాకి అన్యాయం చేస్తున్నది.

ఆ కళాకారులు "భిక్షం ఎత్తుకుని బ్రతుకుతున్నాం" అని దుఃఖంతో చెప్పారు. అన్నగారు కళాకారులకు చేసేది ఏమీలేదు. చివరిగా రావణా వినరా అన్నారు. ఇప్పుడు రావణుడు వినడు. □

....ఇప్పటివరకూ యోగాసనం వేయడం నేర్చుకున్నారు దానికి ఉపసంహారం వచ్చే వారం!!





# ఇప్పుడు సౌందర్య పరిచర్యలో ఆనందం...
# చందనము, పసుపుతో అనుదినం!

# సంతూర్
## చందనము, పసుపు చేరిన సబ్బు.

సుఖానుభూతినిచ్చే సుగంధం గల చందనం. సౌందర్య పరిచర్య చేసే శుభ్రకారకమైన పసుపు. సాంప్రదాయిక సౌందర్య పరిచర్య గురించిన ఈ రహస్యం ఇప్పుడు ఒక కొత్త సౌమ్యమైన సబ్బుకు పరిమితం.

సంతూర్. నిన్నటి సౌందర్య రహస్యం నేటి స్త్రీకి స్వంతం.




100 గ్రా. గరిష్ఠ ధర: రు. 3.21 స్థానిక పన్నులు అదనం.

మీ సహజ సౌందర్య పరిచర్య.

WIPRO LIMITED
Closer to the consumer.

everest/86/WIL/309 t1

# హైదరాబాదు నోట్‌బుక్

## శ్రీ అవధానం చంద్రశేఖరశర్మ సేతుబంధ మహా కావ్యం :-

అష్టావధాన శతావధానాదులు సాహిత్య సమరాలు. ప్రతిపక్షంలో ని నిషేధాక్షరివారు, అప్రస్తుత ప్రశంసవారూ కరకు కత్తులతో నిలిచి ఉంటారు. నిషేధాక్షరి వారేమో మరీను. ప్రతి అక్షరమూ వద్దంటారు. చివరకు పద్యం ఎక్కడికో పోతుంది– లక్ష్యానికి అమడ దూరంగా. కాని, సమర్థులైన అవధానులు అవధాన కవిత్వాన్ని రస ప్లావితం చేస్తారు. శ్రీ అవధానం చంద్రశేఖర శర్మగారికి ఇలాటి పరిస్థితి ఎదురయింది. అయన సంస్కృతాంధ్రాలలో అవధానం మహారసవంతంగా చేయగల మేటి. 24వ ఏట 1937లో కర్నూలులో అవధానం ప్రారంభించారు. 1975లో ప్రొద్దుటూరులో చివరి అవధానం చేశారు. అంటే దాదాపు నాలుగు దశాబ్దాలపాటు అసంఖ్యాకావ ధానాలతో సహృదయులను తనియించారు. అయనకు పరిస్థితి ఎదురయిం దన్నాను గదా! అది శంఖవరం అవధానంలో. మేడవరం మల్లికార్జున శాస్త్రిగారనే మహావైయాకరణులు నిషేధాక్షరికి కూర్చున్నారు. శర్మగారు పెదవి గదిపితే చాలు పవర్గ వద్దనే వారు.అని గొంతు సవరించుకొంటే చాలు కంఠ్యాలు నిషిద్ధం అనేవారు. చివరికి పద్యం మహాగడ్డుగా

అ సదృక్షమనుధ్యాన
శ్వ సదుత్థ వృదాకు సంగ సత్కశ్యా మ
ధ్య సరత్ రసగమ గత రా
జస హృద్ధమ్యా రవిప్రజాద్విడ్యమ్యా.

అని పూర్తయింది. అసమానమైన మంత్రధ్యానంతో తల యెత్తిన కుండలినీ సంబంధం చేత కురిసిన అమృత బిందువులతో తొలగిన రాజసగుణం గల వారికి ప్రాప్యుడా, రవి కుమారుడైన కర్ణుని శత్రువయిన అర్జునునితో ధ్యానింపబడువాడా, కృష్ణా– అని తాత్పర్యం. ఈలాటి పద్యాలలో పాండిత్యమే ప్రధానంగాని రసధ్వన్యాదులు కావు. అయినా శ్రీ శర్మ తమ అవధాన కవితలోను కవితా లక్షణాలకు భంగం వాటిల్లకుండా ప్రయత్నించారు సౌజన్య సౌశీల్య మూర్తి అయిన శర్మగారు, పాండిత్యం పండిన శర్మగారు నిజంగా, పండిత పదానికి పండు వెన్నెలలు ప్రసరింప జేస్తున్న వారు. వ్రాసింది వెంటనే ప్రచురణ పొందాలనే వేగిరపాటు లేక బాగా మాగవేయడం అయన అలవాటు. అందు వల్లనే, అయన అనువాదమైనా, మౌలికమైనా అమృతం చిందుతూ ఉంటుంది. అనువాద మనేది సామాన్యమైన పనికాదు; అయనే ముద్రారాక్షస నాటక ప్రస్తావనలో అన్నట్లు

వలతి నుడికారమున్న భావంబు సున్న
భావపుం బుష్టి యున్న నల్పంబు శయ్య
రెండునుం గూడ మూలా నుసృతి దొలంగు
గత్తిపైసాము లనువాద కావ్యరచన.

ఇలా అయన కత్తిపై సాముగా అనువాదాలూ చేశారు; అ సాముగానే స్వతంత్ర రచనలూ చేశారు శర్మగారు 1914 జనవరి 7న ఇప్పటి ప్రకాశం జిల్లా దొనకొండ తాలూకా పోలేపల్లి గ్రామంలో జన్మించారు. ఈయన తండ్రి రంగనాథ శాస్త్రిగారు కాశీలో 14 సంవత్సరాలు తర్క వేదాంత మీ మాంసా శాస్త్రాలు చదివి పుష్పగిరి పీఠంలో అస్థాన పండితులుగా ఉంటూ ప్రవచనం చేసేవారు. శర్మగారి చిన్న నాటి చదువు పోతేపల్లిలో నే మేడవరం వెంకట రామశాస్త్రి గారి వద్ద జరిగింది. అయన ఏ కావ్యాన్నయినా వ్యాఖ్యాన నిరపేక్షగా పాఠం చెప్పేవారు. పిదప శర్మగారు నెల్లూరు స్టోన్‌హవుస్ పేటలో ని నిత్యానందస్వామి పాఠ శాలలో చదివారు. ఈ నిత్యానందస్వామి పంజాబ్ రాష్ట్రంవారు. తెలుగు నాట స్థిరపడి సంస్కృత విద్యాలయం స్థాపించారు. అప్పుడా పాఠశాలలో పండితులు బరూరు వేంకటాద్రి శాస్త్రి, వి. రాజగోపాలా చార్యులు గార్లు. నిత్యానందస్వామికి నవాబు పేట తోటలో పెద్దబండి వంటి యిల్లు ఉండేది. అయన మహాయోగి, అకాశ గమనాదులు చేసే వారని చెప్పుకొనే వారు జనులు. శ్రీ శర్మగారు తెలుగు కావ్యాలు కైవాసుబ్రహ్మణ్య శర్మ గారి వద్ద పఠిచారు. స్వయంకృషితో 1938లో విద్వాన్ పరీక్షలో ప్రథమ శ్రేణిలో నెగ్గారు. పిదప 1947లో సాహిత్య శిరోమణి పరీక్షలో, కడప జిల్లాలో ఉపాధ్యాయ వృత్తిలో వుండగా, ఉత్తీర్ణులయ్యారు. శర్మగారి మొదటి రచన, 1936లో, దీనచింతామణి శతకం. ఈ మొదటి రచనే ఎంత ప్రౌఢంగా ఉందో యధాలాభంగా ఏఒక్క పద్యం చూచినా తెలుస్తుంది.

మదిగర్వాట వి దేహ తృష్ణ గొ ని
సంసార ప్రదం బందు దు
ర్మదుడై చొచ్చి చరింప, నాంతరరిపు



గ్రాహంబు పీడింపగన్
దుది డిల్లంబడి 'పాహిమా మని' ప్రప
న్నుండైన రక్షింతు వి
య్యది నిక్కంపు గజేంద్ర మోక్షణ మనం
తా దీన చింతామణీ.

రెండవది ప్రవాసి. ఇది ఒక నాటి భావపరంపరకు కవితారూపం. "ప్రేయసీ వియోగము నంగుములు ప్రణయమూర్తి యగు నొక తరుణ ప్రవాసి యొక్క యొకనాటి భావ ప్రపంచం. ప్రవాసి ఇల స్మరిస్తాడు.

తేనెన్ సోనలువార వ్రాలియిదెపై
దీపంబలిన్ నీకునై
మేనున్ దాల్చితి, నిన్ను గైకొనితి
నెమ్మిన్ బ్రాణముంగాగ నీ
దానన్, నీకిదె యాత్మ భిక్ష, మనుచో
దర్పంబు కన్గొందు ప్రే
మానూనంబగు నీ యకల్మష దృగం
తాలోకమున్ బ్రేయసీ.

ముద్రారాక్షసానువాదం చాల జనప్రియమైంది. ఇది అన్ని విశ్వవిద్యాలయాలలో ను విద్వాన్, బి. ఎ., ఎం. ఎ. లకు పాఠ్య గ్రంథంగా వుంది. ముద్రా రాక్షసానికి పీఠిక వ్రాయమని శ్రీ రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ గారిని ఈయన అడిగారట. అయన ఒక పట్టాన ఒప్పుకోలేదు. మూడు రోజులువిని, అ మిదట పీఠిక వ్రాశారట. మాతృగుప్తుని చరిత్రను కవిరాజ చూడామణి అనే పేర లఘుకావ్యంగా తీర్చారు. కేశవ మిశ్రుని అలంకార శేఖమనే శాస్త్రగ్రంథాన్ని అనువదించి అంధ్ర ప్రబంధాల నుండి ఉదాహరణ లిచ్చారు. స్వప్నవాసవదత్త, మచ్ఛ కటిక, పుష్పబాణ విలాసాలను తేనెలూరే తెలుగు చేశారు. శర్మగారి సంస్కృత రచనలు వీరభద్ర సుప్రభాతం (రాయచోటి), సిద్దేశ్వర సుప్రభాతం (కల్లూట), దేవీ సువర్ణమాల మొదలైనవి.

మంథాన సమ్మథన మంజుల తక్రఘోష
సమ్మిశ్రితై ర్మధురగాన విబోధ గీతైః,
గాయంతి ఘోషవని తాస్తవ వీరగాథాః
శ్రీ వీరభద్ర భగవన్ తవసుప్రభాతమ్.

అని మంజుల మధురంగా సాగింది వీరభద్ర సుప్రభాతం. దేవీవర్ణమాల అక్షరమాలాస్తవం. నూతన కల్పనలతో ముద్దకట్టిన కవిత. పాణిని శివుని డమరుకని నదంవిని శబ్దశాస్త్రం రచించాడు. అమ్మా నీ కాలి అందెల నాదాల అర్థం నీ భర్త అయిన శివుడు కూడ చెప్పలేడంటారు శర్మగారు.

డమరుక నినదాన్ విచింత్య భర్తుః
పణిన సుతః ప్రణినాయ శబ్ద శాస్త్రమ్,
జనని తవ పదాంగద స్వనానామ్
అల మభవోపి నవక్తు మర్థజాతమ్.

వర్ణమాలలో ణకారానికి శర్మగారు చక్కని శ్లోకం చెప్పారు. నమస్కారం చేయడం నాపని, క్షమించడం నీ పని అంటారు.

ణమికర్తృతా ముపగతో స్మి దృఢం
క్షమి కర్తృతా భవతు తే జనని,

అపరాధ ఏవమయికర్తృమతిః
త్వయి కర్తృతా హి నకదా వ్యనృతా.

శర్మగారి గొప్ప కృతి సేతుబంధ కావ్యానువాదం. శర్మగారు సాహిత్య శిరోమణి చదివేప్పుడు ప్రాకృతం చదివారు. తర్వాత శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారితో సాన్నిహిత్యం వల్ల ప్రాకృతంపై అభిమానం కలిగింది. ప్రాకృత సాహిత్యపు అందాలు చూచిన పిదప దానిపై అభిమానం పెరిగింది. సేతుబంధ కావ్యాన్ని -ప్రాకృతంలో మొదటి మహాకావ్యాన్ని - తెలుగు వారికి మూల సదృశంగా అందివ్వాలను కున్నారు అనుసరించారు [illegible] సహజంగా, ఒక్క పొల్లు మాటయినా లేక సాగిందో ఒక్క ఆర్యను ఉదాహరిస్తాను. ఈ ఆర్య అలంకారికులందరూ కావ్య విశిష్టతను తెలుపడానికి ఉదాహరించిందే.

పరివడ్ఢయి విణ్ణాణం
సంభావిజ్జఇ జసో విసప్పంతి గుణా,
సువ్వఇ సుఉరిస చరిఅం
కిం తం జేణ ణహరంతి కవ్వాలా వా.

అనువాదం చూడండి:

పెనుపొందెదు విన్నాణము
దనరారు యశంబు గుణవితానము వెలయున్
వినదగు సజ్జన చరితము
గొనకొని కావ్యమున మనము గొననిదిగలదే?

ఈ సేతుబంధ మహాకావ్యం ఆవిష్కరణ గడచిన డిసెంబర్ 27న ప్రొద్దుటూరులో జరిగింది. తిరుమల రామచంద్ర అధ్యక్షత వహించి ప్రాకృత భాషా ప్రాశస్త్యం, దానిలో సేతుబంధ స్థానం వివరించారు. చిన్మయా మిషన్ అధ్యక్షులు శ్రీ జూటూరు వేమయ్య గారు కావ్యం ఆవిష్కరించారు. శ్రీ కృష్ణ దేవరాయ విశ్వవిద్యాలయం ఆంధ్రశాఖాధ్యక్షులు ప్రొఫెసర్ డాక్టర్ శలాకరఘునాధ శర్మ కావ్యాన్ని గురించి ప్రసంగించారు. శ్రీ రవ్వా ఓబయ్య శ్రీ చంద్రశేఖర శర్మను, శ్రీ ఎ. సత్యారావు ఎం. ఇ, ఎ. పి. ఎస్. ఇ. బి. డివిజనల్ ఆపరేషన్ ఇంజనీరు శ్రీ తిరుమల రామచంద్రను, ప్రముఖ పారిశ్రామిక వేత్త శ్రీ మోహన్‌కుమార్ శ్రీ శలాకరఘునాధ శర్మను సన్మానించారు. ఈ ఆవిష్కరణ సన్మానం ది వైశ్యాయూత్ అసోషియేషన్ పక్షాన ఘనంగా జరిగాయి. ఈ అసోసియేషన్ అధ్యక్షులు, శ్రీ లింగాల సత్యనారాయణ, కార్యదర్శి శ్రీ బుశెట్టి రామ్ మోహన్‌రావు, కార్యకర్తలు శ్రీ రఘు మున్నగు వారు అత్యంత శ్రద్ధా భక్తులతో కార్యక్రమం నిర్వహించారు. మేళ తాళాలతో గ్రంధకర్త ఊరేగింపు, సన్మాన సమయంలో నాదస్వరం చాల సాంప్రదాయికంగానూ, జనరంజకంగానూ జరిగాయి. శ్రీ చంద్రశేఖరశర్మ గారు కృతజ్ఞత ప్రకటించారు. శ్రీ శర్మ గారు చంద్రశేఖర మధ్యాక్కరలనే రసవత్కావ్యం మరొకటి రచించారు. శర్మగారు గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, దైవందిన్న, ఎద్దగిరి మున్నగు సంస్థానాలలో పండిత కవి సన్మానం పొందారు. బమ్మెర పోతన పంచ శతజయంతి, హిందూ ధర్మ ప్రతిష్ఠాన్ మున్నగు చోట్ల సన్మానం పొందారు. భారతాన్ని యధామూలంగా అనువదించారు. కడపటి మూడు పర్వాలు ఆనందా ప్రెస్సులో ముద్రిత మైనాయి. శర్మగారు నిత్యసంతృప్తులు. మరచాను, ఆయన అనువంశిక వైద్యులు జ్యోతిషంలో బాగా పరిచయమున్నవారు. మృత్యువు సంగతి చర్చకు వచ్చింది.

కృతార్థః సంప్రతీక్షేత
మృత్యుం ప్రియమివాతిథిమ్.

తనకు ఇష్టమైన పని చేసి సంతృప్తితో ఉండేవాడు. మృత్యువును ఇష్టమైన అతిథిలాగ ఎదురు చూడాలి– అన్నారు ఆయన. మనం ఎదురు చూస్తే వచ్చేదేనా మృత్యువు? నా దృష్టిలో శర్మ గారికి ఇంకా ముప్పై ఏండ్లకు గాని ఆ అతిథి రాదు. కనుక అంత వరకు మరికొన్ని ప్రాకృత కావ్యాలను ఆంధ్రావళికి అందివ్వాలని ఆయనను కోరుతున్నాను.

## వ్యక్తిగతం



ప్రముఖ రాజకీయవాది, సోషలిస్టు నాయకుడు శ్రీ రాజ్‌నారాయణ్ (69) డిసెంబర్ 29 రాత్రి కొత్తఢిల్లీలో మరణించారు. 1917 మార్చ్ 15న జన్మించిన రాజ్ నారాయణ్ బాల్యం నుంచి స్వాతంత్ర్య సమరంలో శ్రద్ధాసక్తులు ప్రదర్శించారు. బనారస్ హిందూ విశ్వవిద్యాలయం నుంచి న్యాయశాస్త్రంలో పట్టా పొందిన రాజ్‌నారాయణ్ ఆచార్య నరేంద్రదేవ్, డాక్టర్ రామ మనోహర్ లోహియా వంటి సోషలిస్టుల సహచరుడుగా ఉండేవారు. ఆయన మొదటి సారిగా కార్యాచరణ లోకి 1942 క్విట్ ఇండియా ఉద్యమ సందర్భంగా వచ్చారు. అప్పుడు అరెస్టయి మూడు సంవత్సరాల పాటు జైలు జీవితం గడిపారు. స్వాతంత్ర్యానంతర భారతదేశంలో కూడా ఆయన ప్రభుత్వానికి వ్యతిరేకంగా తన సమరాన్ని కొనసాగించారు. స్వాతంత్ర్యానంతరం 30 సంవత్సరాలలో 15 సంవత్సరాలు తాను జైల్లోనే గడిపానని, కాంగ్రెస్ ప్రభుత్వాలు తనను 58 సార్లు అరెస్టు చేశాయని ఆయన ఒకప్పుడు చెప్పారు. స్వర్గాష్టం ఉత్తర ప్రదేశ్‌లో గోవింద్ వల్లభపంత్ వంటి ప్రముఖులతో ఘర్షణ ద్వారా సుప్రసిద్ధులైన రాజ్‌నారాయణ్ 1966 లో రాజ్య సభ సభ్యుడు కావడం ద్వారా జాతీయ రాజకీయాలలోకి వచ్చారు. శ్రీమతి ఇందిరాగాంధీ ఎన్నిక చెల్లనేరదని న్యాయస్థానంలో ఫిర్యాదు చేసి గెలవడం ద్వారా దేశ రాజకీయాలలో ఒక పెద్ద మార్పుకు ఆయన కారణమయ్యారు. అట్లాగే 1977 లోక్‌సభ ఎన్నికల్లో ఆయన శ్రీమతి గాంధీని ఓడించారు. 1979లో ఆయన ప్రవర్తన జనతా ప్రభుత్వం పడిపోవడానికి పరోక్షంగా కారణ మైంది. శ్రీ మొరార్జీ దేశాయి మంత్రివర్గంలో ఆయన ఆరోగ్య శాఖా మంత్రిగా పని చేశారు. కొంత కాలం శ్రీ చరణ్‌సింగ్ ప్రాపకంలో ఉన్న రాజ్‌నారాయణ్ తర్వాత ఆయనతో కూడా ఘర్షణ పడ్డారు. ఆయన ఒక హిందీ సినిమాలో కూడా నటించారు. □



బ్రిటన్ మాజీ ప్రధాని హెరాల్డ్ మాక్మిలన్ తన 92వ ఏట డిసెంబర్ 29 ససెక్స్‌లోని స్వగృహంలో మరణించారు. ఆయన 1957 జనవరి నుంచి 1963 అక్టోబర్ వరకు బ్రిటన్‌కు ప్రధానిగా ఉన్నారు ఆయన మేధావిగా, ప్రచురణకర్తగా దేశ ప్రముఖులలో ఒకరుగా పేరు గాంచారు. 1957 సూయెజ్ కాలువ సంక్షోభం తర్వాత ఆయన కన్సర్వేటివ్ పార్టీ నాయకుడుగా ఎన్నికై ప్రధాని అయ్యారు. బ్రిటిష్ ప్రధాన మంత్రులందరిలోకి అతి ఎక్కువ కాలం అవిచ్ఛిన్నంగా పదవిలో కొనసాగిన మాక్మిలన్ అనారోగ్య కారణాల వల్ల పదవీ విరమణ చేశారు. ఆయన ప్రభుత్వం ఎన్నో వాదవివాదాలకు గురయింది. ప్రొఫ్యూమో సెక్స్ వ్యవహారం దాదాపు ఆయన ప్రభుత్వాన్ని పడగొట్టినంత వివాదాన్ని రేపింది. ఇలాంటి సంక్షోభాలన్నిటినీ ఆయన తట్టుకుని నిలిచారు. ఆయన సాధించిన విజయాలలో ఒకటి అణ్వాయుధ పరీక్షల పై నిషేధ ఒప్పందం. 1963 లో అమెరికా, సోవియట్ యూనియన్, బ్రిటన్‌లు ఈ ఒప్పందంపై సంతకం చేయడానికి కారణం మాక్మిలన్ చూపిన పట్టు వదలని దీక్షేనని అమెరికా అధ్యక్షుడు జాన్ ఎఫ్. కెన్నెడీ అన్నారు. 1963 లో పదవి నుంచి తప్పుకున్న మాక్మిలన్ రెండు సంవత్సరాల క్రితం తిరిగి రాజకీయాలలో ప్రవేశించారు. 1984 లో ఎగువ సభలో మొదటి ప్రసంగం చేస్తూ విపరీతమైన నిరుద్యోగాన్ని చవిచూస్తున్న ఇంగ్లండ్‌లో ధనికులకూ పేదలకూ మధ్య వ్యత్యాసాన్ని పూడ్చడానికి కృషి చేయాలన్నారు. 32 నిమిషాల పాటు ఆయన చేసిన ఉపన్యాసంలో ప్రధాని మార్గరెట్ థాచర్ విధానాలను దుయ్యబట్టారు..... □

## ఉపశ్రుతి:

శ్రీ అవధానం చంద్రశేఖరశర్మగారి మనుమడు చిరంజీవి ఆనందవర్ధనుడు మూడేళ్ల వాడు. చాల చురుకైన వాడు, జిలిబిలి పలుకులతో ఆనందింపజేస్తుంటాడు. నీ బొజ్జలో ఏముంది నాన్నా? – అనడిగాను. బువ్వ – అన్నాడు. నాన్నగారి పొట్టలో?– అనడిగాను. కాఫీ – అన్నాడు. అమ్మగారి కడుపులో? – అన్నాను. పాట అన్నాడు. అవ్వగారి కడుపులో? మంతం (మంత్రం)– అన్నాడు. తాతగారి కడుపులో నో?– అన్నాను చివరగా. చదువు– అన్నాడు తాతగారి చదువును మనుమడూ గుర్తించాడన్న మాట. జనరేషన్ గ్యాప్ సిద్ధాంతానికి అపవాదం.

–తిరుమల రామచంద్ర



# అతి పొడుగు బాస్కెట్‌బాల్ ఆటగాడు మాన్యూట్ బాల్

ఆటలలో పాల్గొనేవారు దృఢకాయము, ఎత్తు కలిగి యుంటారు కొన్ని ఆటల్లో ముఖ్యముగా బాస్కెట్‌బాల్ క్రీడలో బాగా ఎత్తు కలిగిన వారికి ప్రాధాన్యత లభిస్తుంది అమెరికా లాంటి దేశాల్లో బాస్కెట్‌బాల్ ముఖ్యమైన ఆటల్లో ఒకటి. అక్కడ ప్రపంచ అగ్రగామి బాస్కెట్‌బాల్ క్లబ్బులు యున్నవి ఆ క్లబ్బులు తమ జట్ల విజయానికై ఎంతో కృషి చేస్తాయి. క్లబ్బుల ప్రతినిధులు బాస్కెట్‌బాల్ ఆటలో పనికివచ్చు క్రీడాకారులకై ప్రపంచ నలుమూలల 'వేట' (టాలెంట్ హంట్) ఆడ్తారు అనుట అతిశయోక్తి కాదు అట్టి 'వేట'లో వారికి సుడాన్ దేశములో ఏడు అడుగుల ఏడు అంగుళాల ఎత్తు 85 కేజీల బరువు కలిగిన అతి పొడుగాటి యువకుడు కనిపించాడు అతని వృత్తి 'పశువుల కాపరి', ఖార్ట్యూన్‌కు చెందిన యీ యువకుని పేరు మాన్యూట్‌బాల్ ఇతని ఎత్తు చూసి సుడాన్ దేశస్థులు ఒక అమెరికన్ కాలేజీ కోచ్‌వద్ద శిక్షణ యిప్పించి తమ జాతీయ జట్టులో అవకాశము కల్పించారు కొద్ది కాలములోనే మాన్యూట్‌బాల్ మంచి ప్రతిభ చూపాడు కోచ్ ప్రోత్సాహముతో ఇంగ్లీషు భాష నేర్చుకొని బ్రిడ్జిపోర్టు విశ్వవిద్యాలయములో స్కాలర్‌షిప్ పొంది చేరాడు కొనెక్టికట్‌లో గల విశ్వవిద్యాలయములో మంచి ఆటగానిగా పేరు పొందాడు. ఇతనిలోని ప్రతిభ గుర్తించి 'బుల్లెట్స్' జట్టు ఆహ్వానించినది వాషింగ్టన్ బుల్లెట్స్‌లో చేరి బాల్ తన ఆటలో నైపుణ్యము సాధించాడు అక్కడ శిక్షణతో యిదివరకటి రెండు పుష్ అప్స్ నుండి పది "పుష్ అప్స్ కు చేరగలిగాడు నేడు అమెరికా జాతీయ బాస్కెట్‌బాల్ సమాఖ్య ఆటగాడు ప్రపంచములో బాస్కెట్‌బాల్ ఆటలో మేటి ఆటగాళ్ళు అమెరికా వారు అట్టి దేశ జట్టులో ప్రతిభగల ఆటగానిగా మాన్యూట్‌బాల్ పేరు పొందాడు బాస్కెట్‌బాల్ ఆటవలన ఆదాయము అతని జీవిత ఆధారము

మనలో కూడా మాన్యూట్‌బాల్ లాగ ఎత్తుగల యువకులు ప్రయత్నము చేస్తే అమెరికా దేశములో ఆడగలరు

-ముకరమ్



హైదరాబాదు వాస్తవ్యులు ఆంధ్ర పత్రిక ఏజంటు శ్రీ మహేశుని శివనారాయణ ప్రథమ పుత్రుడు చి. పద్మారావుకు, శ్రీ మద్దె జనార్ధనం ప్రథమ పుత్రిక చి. సౌ. చంద్రకళకు డిసెంబరు 21వ తేదిన జమిస్తాన్‌పూర్‌లో బహద్దూర్ యార్ జంగ్ హాల్‌లో వివాహం జరిగింది పలువురు బంధు మిత్రులు వివాహానికి హాజరై నూతన వధూవరులను ఆశీర్వదించారు.

## ఉత్తరాలు

( 4 వ పేజీ తరువాయి)

### న్యూఢిల్లీ లేఖ

జయ్ దుబాషీగారి 'ప్రజలను హీనంగా చూసే పాలకులు లో ఎంత హీనంగా చూస్తున్నారో తెలియజేశారు

నాగండ్ల వెంకటేశ్వర్రావు, ఇతరులు, అమ్మాపాలెం

### వ్యాసాలు

"దంతాలు ఎందుకు అరిగిపోతాయ్", "వంశ పారంపర్య వ్యాధులని జన్యు చికిత్స ఆపగలదా?" వ్యాసాలు విజ్ఞానదాయకంగా వున్నాయి

మోదేకుర్తి సత్యనారాయణ, అన్నవరం

### శీర్షికలు

'గర్భస్థ శిశువు'లు చెప్పే కథలు హృదయాన్ని మెలిపెడుతున్నవి చాలా బావుంటున్నాయి

కొండమూరి శ్యామ, గుత్తెనదీవి

### ఆనందించాము

జనవరి 2-8 గల మన వార పత్రిక చదివి చాలా ఆనందించాము ముఖ చిత్రం సుమలత తన అంద చందాలన్నీ కలియబోసి నూతన సంవత్సర శుభాకాంక్షలు అందిస్తూ, పాఠకులను పలుకరిస్తున్న ఆమెకు మా నూతన సంవత్సర శుభాకాంక్షలు

యీ వారం ఇ-వేమన పద్యాలు" శీర్షికలో ప్రచురించిన చిత్రం బాబుగారు చాలా అర్థంతో కూడినదిగా చిత్రించారు

షేక్ మస్తాను, గాలి బీబి,
ముమ్మలనేనివారిపాలెం, రేపల్లె □

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinager, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667